# BHAVABHANDHALU

Short Stories

First Edition : 2024



Published by

**D. Kameswari**

Block H-7, Jalwayu Towers

Lower Tankbund Road

Hyderabad - 80

Cell : 92473 31446

durvasulakameswari@gmail.com

Price Rs. **150/-**

DTP & Type Setting

**K. Harini**

Cell : 99636 83558

Printed at

**Sri Uday Printers**

Hyderabad

Cell : 98490 38058

# సమాజంతో పాటు ఎదిగిన
# డి. కామేశ్వరి గారి రచనలు

**– మల్లాది వెంకట కృష్ణమూర్తి**

**వి**జయవంతమైన రచయితలు మధ్యతరగతి పాఠకులకి సంబంధించిన అంశాలతోనే రచనలు చేస్తారు. కింది తరగతి వారికి సాధారణంగా చదివే అలవాటు ఉండదు. పై తరగతి వారు తెలుగులో వచ్చే కాల్పనిక సాహిత్యం బదులు తమ సంపాదనకి పనికివచ్చే పుస్తకాలనే చదువుతుంటారు లేదా టైమ్స్ వీక్లీలోని బెస్ట్ సెల్లర్స్ లాంటివి. తెలుగులో పాపులర్ రచనలు చేసే చాలామంది కథలలో మధ్యతరగతి జీవితాలనే మనం చదువుతుంటాం. వీటిలో కొన్ని పాత్రలు మనల్ని పోలివుంటాయికూడా !

డి. కామేశ్వరి గారి రచనలని నేను నా చిన్నప్పటినుంచే చదువుతున్నాను. జయశ్రీ, జ్యోతి, యువ, తరుణ, స్వాతి లాంటి మాసపత్రికల్లో నేను చదివిన ఆమె కథలు, అనాటి మధ్యతరగతి సామాజిక పరిస్థితులకి అనుగుణంగా వుండేవి. అప్పటినుంచి నేను కామేశ్వరి గారి కథలు చదువుతూనే ఉన్నాను. ఆమె సమకాలీనులైన కొందరు రచయితల, రచయిత్రులకి ఆదరణ తగ్గడానికి కారణం, తర్వాతి తరాల విషయంలో వారికి సరైన అవగాహన లేకపోవడమే అని నా ఉద్దేశం.

డి. కామేశ్వరి గారిలో నేను గమనించిన విశిష్ట లక్షణం, ప్రస్తుత సమాజాన్ని నిశితంగా పరిశీలించి, అందులోని వ్యక్తుల సమస్యలని అర్థం చేసుకుని, ఆ నేపథ్యంలో కథలు రాయడం. ఆవిడ ప్రతీ తరంతో అప్‌డేట్ అవుతున్నారని నాకు అన్పిస్తూంటుంది. రచయితకి ఉండాల్సిన ప్రధాన అర్హతలైన



దార్శనికత కామేశ్వరి గారి రచనల్లో స్పష్టంగా ప్రతిఫలిస్తూంటుంది. 1960లలో బొగ్గుల కుంపటి, కట్టెల పొయ్యి, చాలీ చాలని జీవితం లాంటి ఆడవారి కష్టాల నేపథ్యంలో కథలు రాసిన కామేశ్వరి గారు ఇప్పుడు వర్క్‌ఫ్రంహోం, స్త్రీ పురుష సమానత్వం – అసమానత్వం లాంటి సమస్యలని నేపథ్యంగా తీసుకొని రాసిన కథాసంపుటి భవబంధాలు. ఇందులో అసహనం ఎక్కువైన ఆర్జించే ఆడపిల్లల ఆలోచనలా ధోరణి, వారిమీద ఆధారపడ్డ గత్యంతరం లేని తల్లిదండ్రుల మద్దతు ఇవ్వడం లాంటి నేటి సమస్యలని, జీవితపాఠాలు, భవబంధాలు, విలువలు తెలిసేది, పుత్ర కామేష్టి లాంటి కథల్లో చదవచ్చు.

కథని ఏ పాయింట్ దగ్గర ఆరంభించి ఎక్కడ ముగించాలి, ఫ్లాష్‌బేక్ ఎక్కడ చొప్పించాలి లాంటి వాటిలో కామేశ్వరి గారు నిష్ణాతులని ఈ కథలన్నీ రుజువుచేస్తాయి.

పాఠకుడ్ని ప్రధానంగా చదివించేది రచనాశైలి, వాడుక భాషలో సాగే ఆమె శైలి చదవడానికి ఆహ్లాదంగా ఉంటుంది. వాక్యాలు తికమకలేకుండా విషయాలని తేటతెల్లం చేస్తాయి.

వీటన్నిటిలో నాకు చాలా నచ్చిన కథ 'పేరెంట్స్ డెన్'. అపార్ట్‌మెంట్ జీవితానికి అలవాటుపడ్డ వారందరికీ ఈ కథ చక్కని సందేశాన్నిస్తుంది. రచయిత్రి సూచన బిల్డర్స్‌తో పంచుకోదగ్గ విషయం.

పుస్తకాలు కొనే పాఠకులు కనుమరుగైన ఈ తరుణంలో 15 కథల ఈ సంపుటిని తీసుకురావడానికి కామేశ్వరి గారికి తన కథలమీద గల ప్రేమ, వాటిని గుదిగుచ్చి ఒకేచోట ఉంచడం భవిష్యత్ తరాల వారికి ఉపయోగం అనే ఆలోచన కారణమని నాకు అన్పిస్తోంది. పాఠకులు ఈ సంపుటిని తప్పక ఆదరిస్తారని ఆశిస్తూ ...

హైదరాబాద్
తేది : 16–5–2024

**మల్లాది వెంకట కృష్ణమూర్తి**



**జలంధర చంద్రమోహన్**
హైదరాబాద్



# ముందుమాట

**మా** తరంలో అప్పుడే ఎదుగుతున్న మాకు, అప్పటి రచయితలు, రచయిత్రులకు కూడా సౌందర్యమూర్తి, ఆలోచింపజేసే మేధావంతురాలు అయిన డి. కామేశ్వరిగారంటే చాలా ఆరాధన ఉండేది. నేను S.P.E.T. విద్యార్థిగా ఉన్నప్పుడు మా తెలుగు డిపార్ట్‌మెంట్ హెడ్ శ్రీమతి విద్యుల్లతారెడ్డి గారు చెప్పారని, మేము వీరిని ఒక ఫంక్షన్‌కు ఆహ్వానించడానికి వెళ్లాము. ఆవిడ మద్రాసు ఏదో పనిమీద చెల్లెలి ఇంటికి వచ్చినప్పుడు, చల్లని వెన్నెలలాంటి ఆమె రూపము, స్నిగ్ధత, ఆమె ఆదరణ, ఆమె సంస్కారం ... మమ్మల్ని మంత్రముగ్ధుల్ని చేశాయి.

టీనేజ్ పిల్లలకు ఆమె గొప్ప ఇన్‌స్పిరేషన్. 'న్యాయం కావాలి' ?! రచనతో ఈమె ఇలా కూడా ఆలోచిస్తారా ?! అని ఆశ్చర్యపోయి, మరింత ఇష్టం పెంచుకున్న తరం మాది.

ఇన్నేళ్ల తరవాత ఆవిడ కథలకు నేను ముందుమాట రాయడానికి అవకాశం ఇచ్చిన ఆవిడ ఔదార్యానికి కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను.

భవబంధాలు కథలో "నాకు సరదాలు కావాలి మీ అబ్బాయి ఇంటిపట్టున పడుండే భార్యకావాలి. మాకు ఇద్దరికి సరిపోదు" అని విడిపోదాం అనుకున్న భార్యాభర్తలు "వాళ్లకు బిడ్డ పుట్టబోతోంది" అని తెలిసి భావవ్యతిరేకత నుంచి భవబంధాలకు కట్టుపడతారు. తనకు నిజంగా ఏమి కావాలో తెలియని తరం గురించి చాలా అబ్జర్వేషన్‌తో ఈ సంపుటిలో మంచి కథలు రాశారు కామేశ్వరి



గారు. పేరెంట్స్‌డెన్, పుత్ర కామేష్టి, జీవిత పాఠాలు ... ఈ కథల్లో కొత్త పోకడల కాపురాలలో ఆలోచనలు ఎలా సవరించుకోవాలో సూచనగా చెప్తారు రచయిత్రి.

స్త్రీ పక్షపాతి మాత్రమే కాదు న్యాయవాది కూడా ఈమె అనిపిస్తుంది. తోడొకరుండిన, బ్రతుకున బ్రతుకై కథలు ఇవే. కొన్ని ఘోరమైన సంఘటనలు చూసి న్యాయం పక్క నిలబడాలా మనకెందుకులే అని ఊరుకోవాలా ? అన్న డైలమా అందరికీ కలుగుతుంది. అలా ఎటూ తట్టుకోలేని స్థితిలో ఒక వృద్ధురాలు, కళ్లెదురుగా ఒక అమ్మాయి బలవడం చూసి "ఆలస్యం అయింది ... అయినా న్యాయం చేయాలి" ఆమెకు అని నిర్ణయానికి వస్తుంది.

పరోపకారం, మందిని గురించి ఆలోచించడం ఎంత ముఖ్యమో, ఎవ్వరూ ఇవ్వలేని ఆత్మతృప్తి ఆ ఆలోచనా, ఆచరణ ఇస్తుందని చెప్పే కథలు ఊరికి ఉపకారం, స్థితప్రజ్ఞుడు. ఈ కథలో బాంధవ్యాలు, ఎమోషన్స్‌తో ఉక్కిరి బిక్కిరి అయ్యే వ్యక్తులు పరోపకారంతో ఎంత శాంతిని పొందుతారో అర్థమయ్యేట్లు చెప్పారు రచయిత్రి.

జీవితం మనిషిపెట్టే కొలబద్దలలో ఇమడదు. అవకాశం, అవసరం ఎటువంటి వారినైనా ప్రలోభపెట్టగలదు. జాలి, దయ ప్రాతిపదికగా జరిగిన స్టూడెంట్ చర్యలు ... తరువాత అవకాశవాదిగా మారడం, వారి బలహీనతలను తన కవ్వింపుతో ఆకట్టుకునే ఆ అడవి పిల్లలు గురువారి, లక్ష్మీ వీరి పాత్రల చిత్రీకరణలో ఏమాత్రం మొహమాటపడలేదు కామేశ్వరి గారు 'మాన్ ఈటర్' కథలో.

నీతులు, ధర్మాలు జరుగుబాటు ఉన్నవారికి తప్పనిసరేమో కానీ అవసరాలలో ఉన్న ఈ ఆడపిల్లలకు "కాదు" అని జీవిత చిత్రాన్ని కనులకు కట్టినట్లు చూపించారు.

నాగరంలో నాలుగిళ్లలో ... ఈ కథలో నాలుగు రకాల అంతస్థులో




ఉన్నవారు చిన్న చిన్న ఆశలతో, డబ్బులేమితో ... ఎలా కష్టపడో నష్టపడో జీవితపు ఆనందాల్ని వెతుక్కుంటారో చెప్తారు ... వీరిలో నాలుగో జంటలో బోలెడంత డబ్బు ఉన్న శాపగ్రస్థుడు రామారావు. కారణం భార్య జల్సాల లోకంలోకి తను అడుగుపెట్టలేడు. ఆమెను వదిలిపెట్టలేడు. భరించలేడు. దుఃఖానికి మూలం తెలిసినా, మనిషి ఎండమావుల వెనకాల ఎలా పరిగెడతాడో చెప్తారు కామేశ్వరి గారు "వేట" కథలో.

మూడు లక్షల బిజినెస్ మీద కన్నేసిన కాంట్రాక్టర్ మనిషి బలహీనతలను బాగా అర్థంచేసుకున్న గుంటనక్క. క్యాంపుకు వచ్చిన కన్జర్వేటర్ ఆఫ్ ఫారెస్ట్ టూరుకు వస్తున్నాడని తెలిసి అందవికారమైన పెళ్ళాన్ని కట్నంకోసం చేసుకున్నాడు కానీ "ఆడగాలి" కోసరం తపన పడతాడని తెలుసుకుంటాడు.

ఫారెస్ట్ బంగళాలో ఎదురుగా టెంట్‌లో ఉన్న అందమైన స్త్రీమూర్తి తన భార్య అని చెబుతాడు. "ఇంత ఎనుబోతులాంటి వాటికి అంత అందమైన పెళ్లామేమిటి" అనుకున్న ఆఫీసర్ రమాకాంత్ స్నేహితులతో వెటకు వెళ్ళి వచ్చి మర్నాడు అందరికీ తన ఆరోగ్యం బాగాలేదని చెప్పి బంగళాలో ఒంటరిగా ఉండిపోయి మెల్లిగా ఆ ఇల్లాలిని కుశలప్రశ్నలతో మభ్యపెట్టి లొంగతీసుకుని ప్రపంచం జయించిన ఆనందంతో ఆ కాంట్రాక్టర్‌కు అన్ని వరాలు గుప్పించి వెళతాడు.

ఆ మర్నాడు ఆ అమ్మాయికి కాంట్రాక్టర్ పట్నాయక్ వెయ్యి రూపాయలు ఇచ్చి సెటిల్ చేస్తూ ఉంటే ...

"నీ పెళ్లాం అని చెప్పకపోయే నష్టమేమిది గురూ ..." అని అడిగిన అసిస్టెంట్‌కు

"నా పెళ్లాం అని వాడు నమ్మకపోతే ఆడికి, నేను కొత్తగా ఏమిచ్చినట్లు?! పరాయివాడి పెళ్లాంతో తప్పుచేశానన్న పాపభీతి ఏముంటుంది వాడికి ?! మరొకడి పెళ్లాం మీద మోజుకదా నాకు కాంట్రాక్ట్ ఇప్పించింది ?! అంటాడు.

కామేశ్వరి గారికి మానవ బలహీనతలు, సైకాలజీ – రకరకాల కోణాల్లో చూసి విశ్లేషించగలిగారంటే … రచయిత ఎలా ఆలోచించాలో చెప్తారనిపిస్తుంది "మనిషి మారలేదు" … కథలో

కాపీ కుంపటి, బొగ్గుల డబ్బా, కూరలబుట్ట … నాలుగు పాత వాయిల్ చీరలు … ఇటువంటి జీవితంలో అందవికారంగా కనిపించే సీతకు తనకు ప్రాముఖ్యత ఇచ్చి గౌరవించే మగవాడు దొరుకుతాడని నమ్మకం లేదు. కానీ ఆఫీసులో తనకు దొరికిన స్నేహితుడు చూపే ఆదరణ, అభిమానం చూసి మూర్తితో జీవితం ఊహించుకుంటుంది ఆ పిచ్చితల్లి. అతడు అవసరం తీరాక ఆమెకు చెప్పకుండా కొత్తగా పుట్టిన కొడుకును చూడటానికి అత్తారింటి బండి ఎక్కుతారు.

అమాయకురాలైన ఆడపిల్ల చిన్న చిన్న పొగడ్తలకు, మగవాడి కాలక్షేపం కబుర్లకు ఎలా బలైపోతుందో హెచ్చరిస్తారు రచయిత్రి.

"నిమిత్తమాత్రులు" కథలో నిజాయితీపరుల్ని ప్రలోభపెట్టలేనప్పుడు జిత్తులతో పనులు చేయించుకునే వ్యక్తుల గురించి వార్నింగ్ ఇస్తారు.

ఈ కథా సంకలనంలో ఎంతో వైరుధ్యం ఉన్నది. ఆలోచింపచేసే సంఘటనలు ఉన్నాయి. అవకాశవాద ప్రపంచంలో అమాయకులు ఎలా బలైపోతారో సౌలభ్యంగా చెప్పే సంస్కారవంతురాలై రచయిత్రి ఈ ప్రయత్నంతో అందరి మన్ననలను తప్పకుండా అందుకుంటారు.

62లో రచనలు మొదలుపెట్టి, 62 ఏళ్లుగా రచనలు చేస్తూ, తొంభై పడిలో పడినా, ఇంకా రచనలు చేస్తూ పుస్తకం తేవాలన్న ఆమె ఆసక్తి, ఉత్సాహం మెచ్చదగింది. అందుకు ఆమెని అభినందిస్తూ …

**జలంధర చంద్రమోహన్**

హైదరాబాద్



# విషయసూచిక








# భవబంధాలు

"**వ**రుణ్, రేపు ఆదివారం కదా, మధ్యాహ్నం భోజనానికి రండి'' జానకి కొడుకుతో అంది.

"ఏదన్నా విశేషమా, ఎవరన్నా వస్తున్నారా'' ఆరా తీశాడు.

"కొడుకుని అమ్మ పిలవడం, కొడుకు అమ్మని చూడడానికి రావడానికి విశేషం వుండాలా ! కొంచెం మాట్లాడాలి. సాయంత్రం వరకు వుండి వెళుదురు గాని.''

వరుణ్ ఒక్కక్షణం ఆగి "తను లేదు. వాళ్లింటికి వెళ్లింది'' అని ఫోన్ కట్ చేశాడు. పదకొండు గంటలకి వచ్చిన కొడుకు భుజం చుట్టూ చేయివేసి ఆప్యాయంగా "పిలిస్తేగాని రావు. నెలయింది తెలుసా వచ్చి'' అంది కినుకగా.

"అవునమ్మా ఆదివారం వచ్చేసరికి ఏమిటో బద్ధకంగా వుంటోంది'' రిలాక్స్‌గా సోఫాలో వాలి "కిందటి వారం నీవు వచ్చావుగా, కలవడం ముఖ్యం; ఎవరు ఎవరింటికి వస్తే ఏమిటి'' అన్నాడు నవ్వి.

"నవ్య వుంటుందనుకున్నా, అందుకే యిద్దరినీ రమ్మన్నా'' తనూ ఓ సోఫాలో కూర్చుంటూ అంది.

"వారానికల్లా గాలి అటుపోతుంది ఆవిడగారికి, నేను ఏడుగంటలకి ఇంటికి వచ్చేసరికే లేదు. ఫోనన్నా చేసి చెప్పలేదు.''

"అదేమిటి, మళ్లీ ఏదన్నా గొడవపడ్డారా, చెప్పకుండా వెళ్లడం ఏమిటి !''

"అమ్మా నాకేం తెలియదు, నన్నేం అడక్కు'' విసుగ్గా అని, "తనిష్టం వచ్చినపుడు వెళ్తుంది, వస్తుంది, నేనేం అడగను.''

"అదేమిట్రా, ఎక్కడికి వెళ్తున్నది భార్య చెప్పదు. ఎక్కడికెళ్లావని భర్త అడగడు, యిదేం సంసారం, మీ యిద్దరి పద్ధతి ఏం బాగులేదు'' మందలింపుగా అంది.

"అమ్మా, నేనందుకే రాను. వచ్చిందగ్గరనించి నీతి బోధలు, సాధింపులు - యింట్లో తన గోల, యిక్కడ నీ గోల. నేనేం చెప్పినా నీవు కోడలినే సపోర్ట్ చేస్తావు. ఎందుకు చెప్పడం, అన్నం పెట్టు తినేసిపోతా'' దురుసుగా అన్నాడు.

"ఏమిటిరా నాన్నా, చిన్న పిల్లాడిలా అలక, ముప్పై ఏళ్లు వచ్చినా'' కొడుకు చేయిపట్టుకుని నిమురుతూ అంది జానకి. "నీ కంటె కోడలెలా ఎక్కువవుతుంది, కానీ, మనింటికొచ్చిన పిల్ల ... కూతురే అనుకోవాలి. ఆ అమ్మాయి మనసు నొచ్చుకుని తల్లీకొడుకు ఒకటే అనుకోకూడదని తనవైపు ఆలోచించి పెద్దదానిగా సర్దిచెపుతాను. బాబీ, ఒక ఆడదానిగా, అమ్మగా, భార్యగా - అత్తింటి కోడలిగా వచ్చిన ఒక అమ్మాయి మనఃస్థితి ఎలా వుంటుందో మీకేం తెలుస్తుందిరా, పుట్టిపెరిగిన యింటిని, ప్రేమాభిమానాల మధ్య పెరిగిన అమ్మాయికి ఒక్కసారిగా అన్నింటికీ దూరమై కొత్తచోటు, కొత్తయిల్లు, కొత్త మనుషులు, కొత్త అలవాట్లు, కొత్త వాతావరణం మధ్య యిదంతా నాది, వీళ్లందరూ నావాళ్లు అనుకోడానికి సమయం పడ్తుంది. భర్త అన్నవాడే తనవాడు. కావల్సినవాడు అని నిన్నే నమ్ముకోని వచ్చిన అమ్మాయికి 'నీకు మేమున్నాం. నీవు మాదానివి, ఈ ఇల్లు నీదే' అన్న భరోసా యివ్వడం మనపని. అలాంటి భార్యకి నీవు ఆసరాగా నిలవాలి. అత్త మా అమ్మలాంటిదే అనుకునే నమ్మకం కలిగించితే మంచీచెడ్డా చెప్పి మందలించ గలదు అత్త. పెద్దదానిగా యిద్దరికీ సర్దిచెప్పడం నా బాధ్యత గదా. కాని నిన్ను అడిగినంత చనువుగా ఆ అమ్మాయిని అడగను గదా.''

"సరేలే, నేనేదో అనేశానని, తను ఫీలయిపోయినట్టు ఊహించుకోకు, నేనేం అనలేదు. గొడవేం పడలేదు. నవ్య ప్రతి ఆదివారం పరిగెడ్తుంది. యీసారి శనివారమే వెళ్లింది. చెబితే వద్దంటానా, వద్దంటే మానుకుంటుందా, అందుకే అసలు పట్టించుకోను'' అసహనంగా అన్నాడు.

"నిన్న నవ్య యిక్కడికి వచ్చింది, చాలాసేపు మాట్లాడింది తెలుసా'' నెమ్మదిగా అంది జానకి. తెల్లబోయాడు వరుణ్. క్షణంలో తేరుకుని "ఆహా ...



మరి నన్నెందుకు అడుగుతున్నావు. తను నీకేం చెప్పిందో, అందుకేనా క్రాస్ ఎగ్జామీన్!'' అన్నాడు సూటిగా చూస్తూ.

తన మధ్య, నవ్య మధ్య జరిగిన సంభాషణ ఎంత వరకు చెప్పాలా అని తేల్చుకోలేక వీలయినంత తేలిగ్గా "ఏముంది, ఎప్పుడూ నీకూ తనకూ వున్నదే గదా. నీవెక్కడికీ రావు, సరదాల్లేవు. ఎవరితో కలవవు ... మా ఫ్రెండ్స్ అందరూ చక్కగా పెళ్లాల వెంట పార్టీలకీ పిక్నిక్‌లకీ వస్తారు. వరుణ్ రాకపోతే నా కెంత చిన్నతనం అవమానం ... అంటూ చెప్పుకొచ్చింది. అంత అడిగినపుడు వెళ్లొచ్చుగదా.''

"ఏమిటమ్మా ఆవిడ ఫ్రెండ్స్, ఆ పార్టీలు చూస్తే నాకు చికాకు. అంతా ఆర్టిఫీషియల్ మాటలు, నవ్వులు, మితిమీరిన షోకులు, చీప్‌గా అనిపిస్తుంది. ఏమిటో ఆ మేకప్పులు, పలకరింతలు, ఆ సుతారంగా మాటలు, లేనిది తెచ్చిపెట్టుకునే నవ్వులు, పొగడ్తలు - వాళ్లెవరూ నాకు తెలియరు - అక్కడికీ మొదట్లో తనకోసం కొన్నిసార్లు వెళ్లాను - సెలవొస్తే చాలు పార్టీలు, హోటళ్లు అంటుంది. నాకేమో మంచిపుస్తకం చదువుకోవడం, ప్రశాంతంగా పాటలు వినడం రిలాక్స్‌గా వుండాలని వుంటుంది'' విసుగ్గా అన్నాడు.

"అవును, ఆ అమ్మాయి సరదాలు వేరు. మీరిక్కడున్నప్పుడు చూశాగా. ఫోన్లు, స్నేహితులు - మరీ ఎక్కువే అనుకో, కాని ఏదో అప్పుడప్పుడైనా తన సంతోషం కోసం, మన కిష్టంలేని పనులైనా యితరులని, అందులో భార్యని సంతోషపెట్టడం కోసం కొన్ని చెయ్యాలిరా... యింట్లో గొడవలుండకూడదంటే ఒకరి కోసం ఒకరు కొన్ని సర్దుబాట్లు తప్పవు'' అనునయంగా అంది.

"అమ్మా, నేనూ పెళ్లిళ్లకో, శుభకార్యాలకో వెళ్తా, నాకెవరూ తెలియకపోయినా నాకు యీ క్లబ్బులు, హోటళ్ల పార్టీలు, ఆడా మగ తాగుడు, ఏమిటో నాకెందుకో వెళ్లాలనిపించదు. ఎప్పుడో ఏ రెండు మూడు నెలలకో ఓసారి ఏ న్యూయియర్, స్పెషల్ అకేషన్స్ అవీ, ఆఫీసు పార్టీలు తప్పవు. సెలవు వచ్చే సరికల్లా పద అంటే నాకు కుదరదు. నేనేం తనని వద్దనలేదే, వెళ్లు ఎంజాయ్ చేయి, నన్ను బాధపెట్టకు అన్ని ఎన్నోసార్లు చెప్పా'' నిజాయితీగా అంటున్న కొడుకుని ఏమనాలో తెలియక తల వూపింది అప్రయత్నంగా.




"తనకి కాలక్షేపం లేక ఏదో కొత్తదనం కావాలన్న ఆరాటం, పనీ పాటా లేదు. ఇంట్లో వంట బోర్ అంటూ మనిషిని పెట్టింది. అన్నీ ఆమె చేసి టేబిల్ మీద పెడ్తుంది. ఆఫీసుకెళ్లి రావడం ఒకటే పని. యిల్లు, వంట, సర్దుకోడం దేనిమీదా తనకి యింటరెస్ట్ లేదు. స్నేహితులు, తిరుగుళ్లు, ఫోను వుంటే చాలు. ఇంకా, కాలేజ్ స్టూడెంటు లెవల్లోనే వుంది తను'' విరక్తిగా అన్నాడు తరుణ్.

పెళ్లయ్యాక ఏడెనిమిది నెలలు వాళ్లు బుక్ చేసుకున్న అపార్ట్‌మెంటు రెడీ అయ్యేవరకు యిక్కడున్నప్పుడు నవ్య, కొత్త కోడలిగా వచ్చిన పిల్ల. తనే నేర్చుకుంటుంది అని కొన్నాళ్లు అసలు ఏ పనీ చెప్పలేదు జానకి. చనువుగా వచ్చి ఏదన్నా తనతోపాటు వంటింట్లో కబుర్లు చెపుతూ కాస్త సాయంగా 'కూరలు తరిగిస్తా, ఇలా యివ్వండి చపాతి పిండి కలపనా, టేబుల్ మీద అన్ని నేను పెడతా మీరు కూర్చోండి' లాంటి చిన్నచిన్న పనులన్నా చేస్తుందేమో అని ఆశించింది కాని, లాభం లేకపోయింది. 'ఏమిటో పనీపాటా అలవాటున్నట్టు లేదు - ఇంట్లో అలా పెరిగినట్టుంది' అనుకుని జానకి సర్దుకుపోయేది.

"ఏమిటోరా, నువ్విలా అంటావు. నిన్న నవ్య చాలా సీరియస్‌గా కంప్లైంట్ చేసింది.

"ఏమంది నీతో చెప్పడం ఎందుకు, డైరక్ట్‌గా నాతోనే చెప్పొచ్చుగా'' ఆవేశంగా అన్నాడు. జానకి సందిగ్ధంగా ఎలా ఏది చెప్పడం అన్న ఆలోచనలో పడినట్లు వూరుకుంది.

✲ ✲ ✲

"అత్తయ్యగారూ, నేను మా యింటికి వెళ్లిపోతున్నాను. మీరు నన్ను కోడలిగా కాక కూతురిగా చూస్తారని, చెప్పి వెడదామనివచ్చా. ఇంక మీరు నాకేం చెప్పద్దు. చెప్పినా వినను'' దూకుడుగా యింట్లోకి వస్తూనే ఆవేశంగా అంది నవ్య. చదువుతున్న పుస్తకం పక్కన పెట్టి "ముందు లోపలికెళ్లి మంచినీళ్లు తాగిరా'' ఎర్రబడి చెమటపట్టిన మొహం చూసి అంది జానకి.

"సరే, యిప్పుడు చెప్పు, ఎక్కడికి వెళ్లిపోతానంటున్నావు'' జానకి సూటిగా చూసింది. "ముందు మా యింటికి, ఆ తర్వాత మిగతాది ఆలోచిస్తా.''



"నీ యిల్లు వదిలి, పుట్టింటికి వెళ్లిపోవాలన్న నిర్ణయం తీసుకునేటంత విషయం ఏం జరిగింది?"

"ఏం జరుగుతుంది. మీ అబ్బాయింక మారడని అర్థమైపోయింది. అతనికీ నాకూ పడదు, నేనింక సర్దుకోను. ఓ సరదా లేదు, అచ్చటా ముచ్చటా లేదు. మౌనమునిలా మొద్దులా కూర్చునే మొగుడిని నేను భరించలేను. నేను లైఫ్ ఎంజాయ్ చెయ్యాలి, మనుషులు కావాలి, సరదాలు కావాలి. షికార్లు, పార్టీలు, స్నేహితుల మధ్య జీవితం ఆటలా పాటలా సాగాలి అని ఉంటుంది. మా స్వభావాలు కలవవు. యింక మా యిద్దరికీ కుదరదు" ఆవేశంగా అంది.

"సరే, యిప్పుడేం చేస్తావు. విడాకులు తీసుకుంటావా, విడిపోతావా, నిర్ణయం తీసేసుకున్నావా ?" కోడలిని చూస్తూ ప్రశాంతంగా అంది జానకి. అత్తమాటకి ఒక్క నిమిషం చకితురాలై, తడబడ్తూ "ఏమో యింక అదంతా ఆలోచించలేదు. తనతో మాత్రం వుండనంతే" మొండిగా చిన్నపిల్లలా అంటున్న కోడలిని చూసి, "మరి వాడితో యీ మాట చెప్పావా ?" అంది.

"లేదు, ముందు వెళ్లిపోతే, నే లేకపోతే తెలిసి వస్తుందేమో చూస్తా, ఒక అవకాశం యిచ్చి చూస్తా మారడానికి" బింకంగా అంది.

"ఓ, అయితే యిది ఉత్త బెదిరింపన్న మాట, వాడేం చేస్తాడో చూద్దామని."

"అత్తయ్యగారూ, మీ అబ్బాయిని వెనకేసుకురాకండి, నాకు ఒళ్లు మండు తుంది."

"నీకు తెలుసు, నేనెవరినీ వెనకేసుకురానని, ఎవరి తప్పుంటే వాళ్లకే పెద్దదానిగా ఏదన్నా చెప్పాలనుకుంటాను" ప్రశాంతంగా చిరునవ్వుతో అంది.

"అందుకే, మీకు చెప్పాలని వచ్చి" కాస్త మెత్తబడింది. "చూడు నవ్యా, అందరి స్వభావాలూ ఒకేలా వుండవు. యిష్టాయిష్టాలు, కోరికలు చెల్లాలనుకుంటే సంసారంలో కలతలు తప్పవు. పార్టీలు, క్లబ్బులు అవివాడికి అంతనచ్చవని అర్థమయ్యాక, నీ భర్తని నీవైపు తిప్పుకునే చాకచాక్యమన్నా వుండాలి. అది లేనప్పుడు కాస్త అవతలివారి అభిప్రాయం గౌరవించి దాని కనుగుణంగా నీవు మారాలి."



"అంటే ఆయనగారి కోసం నా సరదాలన్నీ చంపుకోవాలా ? ఆయన పార్టీలకి నేను వెళ్లడం లేదా ?'' నిలదీసింది నవ్య.

"అవును. ఆడవాళ్లం అందరితో తొందరగా కలిసిపోగలం, గలగల మాట్లాడుకోగలం. మన పరిచయాలు, స్నేహాలు ఎక్కువ, నీలా వాడూ వుండాలంటే ప్రేమతో లొంగదీసుకోవాలి. మేం చదువుకున్నాం - సంపాదిస్తున్నాం, ఎప్పటికి వాళ్లమాటే ఎందుకు చెల్లాలి అనుకుంటే కాపురంలో గొడవలు తప్పవు. తగ్గాల్సి వచ్చినప్పుడు తగ్గాలి, వినాల్సి వచ్చినప్పుడు వినాలి. చెప్పాల్సి వచ్చినపుడు చెప్పాలి. అంతేగాని సాధించితే సాధించేది వుండదు.''

"అవును, మీ అబ్బాయి గదా, యిలాగే మాట్లాడతారు. ఎన్నాళ్లయినా ఆడవాళ్లనే సర్దుకోమంటారు మీలాంటి చదువుకున్నవారు'' కోపంగా అంది.

"ఏం అబ్బాయిలు ఎంత మారారు ? మా కాలంలో మొగుళ్లలా వున్నారా మీ మొగుళ్లు - వాళ్లలో మార్పు ఎంత వచ్చిందో మాకు తెలుసు'' సూటిగా చూస్తూ కాస్త గట్టిగానే అడిగింది జానకి.

ఇబ్బందిగా చూసి "అంటే మీ అబ్బాయిలో ఏ తప్పులేదు అంటారు'' అంది.

"వుంటాయి, తప్పులెందుకుండవు. అందరిలో వుంటాయి. పర్ఫెక్ట్ పర్సన్ ఎవరూ వుండరు. ఎటొచ్చి మనం చూసే ధోరణి బట్టి వుంటాయి. చూడు యీ కాలం అమ్మాయిలు మొగుడనగానే సర్వగుణ సంపన్నుడు, తమని పువ్వుల్లో పెట్టి పూజించేవాడు, మాట జవదాటనివాడు కావాలనుకుంటారు. దానికి వ్యతిరేకంగా ఏదన్నా యిటు అటు అయితే తమ కలలు కరిగిపోయినట్టు, బాధపడిపోతూ, మొగుడన్న వాడినీ బాధపెడతారు. పెళ్లికి ముందు ఏడాది తిరిగారు. స్నేహం, ప్రేమ, పెళ్లి అన్నీ మీరు కోరుకునే చేసుకున్నారు. అప్పుడు మరి చూసుకోలేదా'' గొంతు పెంచింది జానకి.

"అపుడు బాగానే తిరిగాడు నా వెనకాతల'' హేళనగా అంది నవ్య.

"అవును బాయ్ఫ్రెండ్గా అమ్మాయిలని ఇంప్రెస్ చెయ్యాలని అబ్బాయిలు,



అబ్బాయిని మెప్పించాలని అమ్మాయిలు షోకులు చేసుకుని మురిపిస్తూ వెంట తిప్పుకుంటారు. బాయ్‌ఫ్రెండ్ మొగుడయ్యాకా అలాగే వుండాలని కోరుకుంటే అది మీ అమాయాకత్వం. నవ్యా యిచ్చిపుచ్చుకుంటేనే అభిమానాలు పెరుగుతాయన్నది గుర్తుంచుకో. నా జోక్యం వుండకూడదని ఇన్నాళ్లు నేనేం అనలేదు. ఇంకా పెళ్లికాని అమ్మాయిలా సరదాలు, తిరగడాలు తగ్గించుకుని యిల్లు, సంసారం, మొగుడ్ని కాస్త పట్టించుకుంటే' అన్నీ అవే సర్దుకుంటాయి''. అత్తగారి మాటల్లో మందలింపు ధోరణికి ఉక్రోషం వచ్చేసి విసవిసా వెళ్లిపోయింది నవ్య.

✲✲✲

"నేను చెప్పాల్సినవి కాస్త గట్టిగానే చెప్పాను. అంత చెప్పాక, అలా అలిగి వెళుతుందనుకోలేదు. సరే, ప్రతి ఆదివారం ఆవిడకి అలవాటే గదా రేపు ఆఫీసుంది గదా, వస్తుందిలే'' సర్దిచెపుతూ అంది జానకి.

"అమ్మా, యింక నీవేం ఫోన్లు చెయ్యకు, ఎప్పుడు రావాలంటే అప్పుడు వస్తుంది. రాకపోయినా నేనేం అడగను'' చిరాగ్గా అన్నాడు. కొడుకు కోపం అర్థమయింది.

"వరుణ్ ఒక మాట చెప్పనా, మీ పెళ్లయి రెండేళ్లు నిండిపోయింది. జీవితంలో ప్రతి దశలో మార్పు వుండాలి. పెళ్లయిన కొత్తలో కొత్త భార్య - ప్రేమ, మోజు, మోహం అనుబంధంతో ఒక ఏడాది తొందరగానే గడిచిపోతుంది. తరువాత భార్యాభర్తల అనుబంధం గట్టిపడాలంటే పిల్లలు పుట్టుకువస్తే వారిద్దరి జీవితంలో మార్పు వస్తుంది. పిల్లల పెంపకంలో, ముద్దుముచ్చట్లతో అనుబంధాలు పెనవేసుకుని ఆప్యాయతలు పెరుగుతాయి. పిల్లల కోసం అలవాట్లు, అభిరుచులు మార్చుకుని సర్దుబాటు ధోరణి అలవడుతుంది. యిప్పుడు బాయ్‌ఫ్రెండ్స్, ప్రేమలు, మోజులు, ముచ్చట్లు, ఆకర్షణలు, పెళ్లికి ముందే జరిగిపోతున్నాయి.

ఏ కొత్తదనం, ఏ మార్పు కనపడక, పెళ్లంటే యింతేనా అనిపించడం, కాపురంలో బాధ్యతలు, ఉద్యోగాలు, సర్దుబాట్లు పైనపడి ఏ థ్రిల్లు కనపడదు. ఉద్యోగాల్లో అలిసి సొలిసి దాంపత్యంలో, శృంగారానికే తావు కనిపించనంతగా

అలిసిపోతున్నారు. ఒకరిపట్ల ఒకరికి నిరాసక్తత, ఆకర్షణపోయి, అనుబంధం తగ్గి చిరాకులు, కోపాలు, విసుగులు, పంతాలు, కీచులాటలు పెరుగుతున్నాయి.''

"అయితే ఏమిటంటావు, అందరూ ఉద్యోగాలు చేస్తున్నారు, కాని అందరూ ఇలాగే ఇల్లు, సంసారం ఏది పట్టించుకోకుండా వున్నారా?''

"అమ్మాయి ఒక్కర్తి అవడం, ఇంట్లో అతిగారాబం, పనీపాట చెప్పకపోవడం పెంపకం లోపం అనిపిస్తూంది. పెళ్లి తరువాత అమ్మాయిలు నేర్చుకుంటారు. కానీ నవ్యకి యింకా బాధ్యత రాలేదు. ఏదో తన ఇంటికి తను వెడితే సంసార బాధ్యత వస్తుందనుకున్నా. అందుకే నీకు కోపం వచ్చినా, బాధపడ్డా ఇల్లు వదిలి నీ దగ్గరికి రాలేదు. నేనుంటే అసలు పట్టించుకోదు ... పని పాట నేర్చుకోదని.''

"అవునమ్మా, మొదట కోపం వచ్చినా, నీవు ఎందుకు రానన్నావో, ఒక్కర్తివీ ఎందుకు ఇక్కడ వుంటానన్నావో తరువాత అర్థమైంది. అమ్మా. నీవు నవ్యకి ఏం ఫోను చెయ్యకు, చెప్తున్నాను'' అంటూ విసురుగా వెళ్లిపోయాడు.

✲ ✲ ✲

"రావోయ్, వరుణ్, రా, రా'' మామగారు ఆప్యాయంగా ఆహ్వానించారు. అత్తగారు లేచి నిలబడి "రా ... ఇలా కూర్చో'' చాలా సంతోషంగా ఇద్దరూ ఆహ్వానిస్తుంటే కాస్త ఆశ్చర్యపోయాడు వరుణ్. తనూహించిన ఆ ప్రసన్న వాతావరణం, గంభీరత కనపడకపోవడంతో ఒక విధంగా రిలీఫ్‌గా పీలయ్యాడు వారం రోజులు తరువాత.

'వరుణ్ ఒకసారి నీవు అర్జంటుగా రావాలి' మామగారినించి ఫోను రాగానే, నవ్య ఏం చెప్పిందో, ఈయన పిలిచి ఏం నీతులు చెపుతాడో, క్రాస్ ఎగ్జామ్ చేసి అల్టిమేటమేమిస్తాడో... సరే, ఒకసారి వాళ్లతోనూ మాట్లాడి నవ్య గొడవ తేల్చుకుందాం అన్నట్టు వెళ్లిన వరుణ్ అక్కడ ఎదురైన అభిమాన ఆహ్వానం, ప్రసన్న వాతావరణం చూసి "ఏమిటి అర్జంటుగా రమ్మనారు''అన్నాడు కూర్చోకుండానే.

"అర్జంటుగా కాక మాములుగా చెప్పే కబురా ఇది, మనవడు వస్తున్నాడోయ్ మరి మాకు. యిదిగో చూడు యింక మీరిద్దరూ చిన్నపిల్లల తగువులు మానేసి,

డాడి, మమ్మీల రోలుకి ప్రిపేరవడం మొదలుపెట్టండి'' సంబరంగా, ఆనందంగా అన్నాడు.

వరుణ్ ఒక్కక్షణం అర్థంకానట్టు చూసి, తరువాత 'ఏమిటి, నిజమా!' సంభ్రమంగా అన్నాడు. "నవ్య చెప్పలేదు నాకు.''

"దాని మొహం, దానికి తెలిస్తే గదా, వికారం, వాంతులు అంటూ తిండి తినకపోతే వాళ్లమ్మ డాక్టరు దగ్గరికి తీసికెళ్లింది. వెళ్లు, వెళ్లు, గదిలోకి వెళ్లు'' అంటూ తరిమాడు ఆయన.

✲ ✲ ✲

"ఏదో పాపం, నా బాబుకి తండ్రి ప్రేమ వుండాలి గదా అని వస్తున్నాను తెలుసా'' దబాయింపుగా అంది నవ్య కారులో బుంగమూతి పెట్టి.

"అబ్బో, పరవాలేదు. పుట్టని బాబు మీద అంత ప్రేమ పుట్టుకొచ్చేసి, నన్ను ఉద్ధరించడానికి వస్తున్నావు. వెల్‌కమ్ హోమ్ ...'' వ్యంగ్యంగా ఎత్తి పొడిచాడు వరుణ్.

"నాకుంది, నీకే లేదు నా మీద ప్రేమ'' భుజం మీద తలవాల్చి ముద్దులు గునిసింది.

"నీ తిక్క వేషాలు ఆపి కాలేజ్ గర్ల్ అవతారం నించి, అమ్మ అవతారానికి ప్రిపేరవు. పిచ్చిపార్టీలంటే కాళ్లు విరగ్గొడతా. డ్రింక్ ముట్టుకుంటే చేతులు విరగ్గొడతా. నోరు మూసుకుని చెప్పినట్టు విను'' బెదిరించాడు నవ్వుతూ.

"అబ్బో ... మొనగాడు బయలుదేరాడు, కాళ్లు విరగ్గొట్టడానికి. నాకేం హాయిగా ఉద్యోగం మానేసి యింట్లో తింటూ కూర్చుంటా - మరీ మంచిది.''

"అదేం కుదరదు. తొమ్మిదో నెల వరకు ఉద్యోగం చేస్తావు. లేకపోతే నీలాంటి బద్ధకస్తులు పుట్టుకొస్తారు తిని పడుకుంటే. చలాకీగా వుండాలి ఆరోగ్యం సరిగా వుండాలంటే, డ్రింక్ అది..''

"తెల్సులేవోయ్ - డాక్టరు చెప్పిందిలే నాకు, నీతులు చెప్పకు నాకు, కడుపున




పడగానే కంట్రోలు చేస్తున్నాడు - ఇది, అది చేయకూడదంటూ. పుట్టాక ఎలాగో నా ఫ్రీడం అంతా పోతుంది గాబోలు'' విచారం నటించింది నవ్య

"అంతే, రంకెలు వేసే గిత్తకి ముక్కుతాడు వేస్తారు పొగరు దించడానికి, నీలాంటి దానికి పిల్లలు వేస్తారు'' ఉడికించాడు వరుణ్.

బాల్కనీలోంచి ఆరాటంగా ఎదురు చూస్తున్న జానకి, కారుదిగి సరదాగా లోపలికి వస్తున్న కొడుకు, కోడలిని తలుపు దగ్గరే యిద్దరిని కలిపి సంతోషంగా చుట్టేసింది.

వియ్యంకుడు చెప్పిన శుభవార్త, తర్వాత వరుణ్ ఫోనుచేసి వస్తున్నాం అని చెప్పిన దగ్గరనించి ఆవిడకి సంతోషంతో గాలిలో తేలిపోయినట్టుంది. ఇంట్లోకి వచ్చాక కొడుకు చెప్పిన కబుర్లు వింటూ "అవున్నాయనా, పెళ్లికి పలుపుతాడు నడుంకి కట్టి మొగుడు పెళ్లాన్ని కట్టడి చేస్తాడు. పిల్లలు పుట్టుకొచ్చి సంసారబంధాన్ని బిగిస్తారు.''

"అమ్మా ఎంతయినా ఆడవాళ్లనే సపోర్ట్ చేస్తావు'' అన్నాడు వరుణ్.

"అదేం కాదు కాని, నిజం చెప్పనా మన దేశంలో సంసారాలు సగం పిల్లల వల్లే నిలుస్తాయి. పిల్లలే భార్యాభర్తలని బంధించే బంధాలు'' అంది ఇద్దరినీ మురిపంగా చూస్తూ జానకి.

**ఆదివారం ఆంధ్రజ్యోతి 1, ఆగస్టు 2021**



# ఆలస్యం అయింది

'ఓ షామ్, కుఛ్ అజీబ్ థీ... ఏ షామ్ భీ అజీబ్ హై ...' బాల్కనీలో చీకటివెలుగుల మధ్య వాలుకుర్చీలో కూర్చుని పాట యిచ్చే అనుభూతిని ఆనంది స్తూంటే- 'ధన్'మని పళ్లెం కిందపడ్డ చప్పుడు, పళ్లెం కిందపడి గింగురులు తిరిగి ఆగిన చప్పుడు... అప్రయత్నంగా వెలువడ్డ నిట్టూర్పు, వరలక్ష్మిని నిర్వేదంలోకి నెట్టేయి.

వెంటనే వినవచ్చిన మగకేకలు - ఆ కేకల మధ్య చిన్నగా ఏడుపు గొంతు, ఆడ మాటలు... ఎన్నోసార్లు అలవాటయినా ప్రతిసారి వరలక్ష్మి గుండెలు బరువెక్కుతాయి. తలుపు ధడాలున తీసిన చప్పుడు మాటలు అనవలసిన మాటలు, అరుపులు అయిపోయి, గడపదాటి వెళ్లిన మగవాడు... అవమానభారంతో కుళ్లి కుళ్లి ఏడుస్తున్న అమ్మాయి తెల్సిన దృశ్యం...

అంతలో సుడిగాలికి ఆరేసిన చీర లుంగచుట్టుకు బాల్కనీలోంచి ఎగిరి పోయినట్టు - ఓ చీర... అది వట్టి చీర కాదని చీరలో మనిషి వుందన్నది తట్టి కుర్చీలోంచి చేతులు చాచి పిలుస్తూ లేవబోయేలోగా అరో అంతస్తునించి దబ్బున కిందపడ్డ చప్పుడు...

కాళ్లు గజగజ వణికి కుర్చీలో మళ్లీ కూలబడిపోయింది వరలక్ష్మి. ఇంక లేచి ఏం చెయ్యాలి? ఏం చూడాలి? చూడడానికి రక్తంముద్ద తప్ప ఏం మిగులుతుంది? కింద ఏవో కేకలు, అరుపులు, హడావిడి అస్పష్టంగా వినిపిస్తున్నా... కాళ్లల్లో శక్తి లేనట్టు లేవలేకపోయింది. ఎంత పని జరిగింది? ఎంత పని చేసింది?

ఇంతకు తెగిస్తుందని, యింత తొందర పడ్తుందని ఊహించని వరలక్ష్మికి హఠాత్తుగా అయ్యో! తను తొందరపడలేదు అన్నది తట్టి... అవును, పాపం! ఎన్నాళ్లు ఆవేదన భరిస్తుంది? ఎన్నాళ్లు నరకం అనుభవిస్తుంది? భవిష్యత్తు

బాగుంటుంది అన్న ఆశ చచ్చిపోయాక, నిత్యం చస్తూ బతికే కంటే చావే నయం అని, పెళ్లయిన ఏడాదికే ఓ ఆడపిల్ల నిర్ణయించుకుందంటే... తెలివి తక్కువగా తొందరపడిందని ఎలా నింద మోపడం. తను తొందర పడలేదు. ఆలోచన తెమలక తను తొందరపడలేదు. ఈలోగా యింత పని జరుగుతుందని ఊహించకపోవడం తన తప్పే! ఆదుకుందామన్న ఆలోచన వచ్చినా, అమల్లో పెట్టడానికి ఎన్ని అనుమానాలు, అడ్డంకులు, ఏ హక్కుతో తను వెళ్లి ఆదుకోవాలి? ఎనభయ్యో పడిలో పడిన తను ఎన్నాళ్లుంటుందో? ఎటూ కాకుండా ఆ అమ్మాయి బతుకు ఏమవుతుందో? ఓ పెళ్లయిన అమ్మాయిని యింట్లోంచి రా, వచ్చేయ్ అని చెప్పడం, నే చూసుకుంటా, నీకేం భయం లేదు అని భరోసా యివ్వడం యీ దేశంలో అంత సులువైన పని కాదు అని అర్థమయి తర్జనభర్జన పడి కొడుక్కి ఫోన్ చేసింది.

"అమ్మా, నీకేమన్నా మతిపోయిందా? ఆ అమ్మాయి బాధ్యత నీవు తీసుకోడం ఏమిటి? ఆ మొగుడు ఊరుకుంటాడా? నీ ఇంటికి వచ్చి నువ్వెవరు అని అడిగితే, నా పెళ్లాన్ని తీసికెళ్లడానికి ఏ హక్కుతో వచ్చావు అని నిలేస్తే జవాబుందా నీ దగ్గిర? సరే, ఆ అమ్మాయి భర్త చేతిలో హింసలు పడ్తాంది. ఆమె ధైర్యం చేసి యిల్లు వదిలి బయటికి వెళ్లి కోర్టు ద్వారా విడాకులు తీసుకొంటే అపుడు నీవేదన్నా సాయం చెయ్యగలవు కావాలంటే. నిజమే నీవు చెప్పిందాన్నిబట్టి పాపం ఆమెకి ఎవరూ లేరు. అంత ధైర్యం చేసి బయటికి వచ్చే తెగింపున్న పిల్లలా లేదంటావు. బాగుంది. ఆ తెగువ, ధైర్యం లేని అమ్మాయి, రేపు అతను పోలీసు కేసు పెట్టి నిన్ను యిరికించడని ఏముంది ? అతని ఇగో హర్ట్ అయి కావాలని కక్షకట్టి చెయ్యచ్చు. నీకేమో ఎనభై రెండేళ్లు. ఎన్నాళ్లుంటావో ఎవరికి తెలుసు? ఆ అమ్మాయి యిటు అటు కాకుండా అయిపోదా?

'ఆ... అలా ఎందుకవుతుంది? చదువుకుంది. ఏభైవేలు వచ్చే ఉద్యోగం చేస్తాంది. తన బతుకు తను బతుకుతుంది' అంటావు. అమ్మా! అన్నీ నీవే ఆలోచించి అనేస్తున్నావు. అసలా అమ్మాయి ఏమంటుందో అడిగావా? భర్తని వదిలి బయటికి రావాలనుకుంటోందా? అసలేమీ మాట్లాడకుండా జాలిపడిపోయి అన్ని ఆలోచనలు, నిర్ణయాలు నీవే తీసేసుకొని, ఆ అమ్మాయిని తెచ్చి యింట్లో

పెట్టుకుంటాననడం, ఆమె బాధ్యత తీసుకుంటాననడం... ఏమిటి నీకేమన్నా మతిపోయిందా? అవును చూస్తూ జాలిపడ్తున్నావు, బాధపడ్తున్నావు ఓ ఆడపిల్లమీద దౌర్జన్యం జరిగిపోతోందని కలవరపడిపోతున్నావు. బాగుంది. ఇలాంటి ఆడవాళ్లు ఎందరో వుంటారు. పైకి చెప్పుకోలేక కొందరు, ఇల్లు వదిలి వచ్చే ధైర్యం లేక కొందరు, బయటికి వస్తే ఎదురయ్యే యిబ్బందులు తలుచుకు భయపడి కొందరు, ఏదోలా సర్దుకు బతకడం నయం అని కొందరూ అన్నీ సహించి పడుండేవాళ్లు ఎందరో! ఏదో నీ యింటి పక్కన వున్నారు, నీ కళ్లబడినవి, చెవులబడినవి చూసి, విని బాధపడ్తున్నావు. అమ్మా! జాలిపడి, ఆ క్షణంలో ఆవేశంలో ఏదో నిర్ణయం తీసుకొనే విషయం కాదు ఇది. నీవు ఏ పోలీసులకో కంప్లైంట్ ఇచ్చినా, ఆ అమ్మాయి నీకేమవుతుంది అన్న ప్రశ్న ముందుగా వస్తుంది. అదే నీ కూతురయితే నీకు హక్కు వుంటుంది. అమ్మా! సారీ, నేనింతకంటే ఏం చెప్పాలి? ఆలోచించి అడుగు వెయ్యి. నీవు యీ వయసులో మనశ్శాంతి పోగొట్టుకుని ఇదంతా నీ నెత్తిన వేసుకొని సమస్యల్లో పడతావని నా భయం'' అని వూరుకున్నాడు.

కొడుకు నిష్కర్షగా చెప్పేశాడు. కొడుకే కాదు ఎవరన్నా యిలాగే అంటారు. అవును, తనకేం అవుతుంది ఆ అమ్మాయి? ఎందుకంత జాలి, అభిమానం, బాధ ఆ అమ్మాయి మీద తనకి?

ఏడాది క్రితం చూసిన మొదటిసారే ఆ అమ్మాయి మొహంలో ఏదో అవ్యక్తమైన బాధ. ఏణ్ణర్థం క్రితం పెళ్లి అయిన అమ్మాయి... పక్క ఫ్లాట్‌కి అద్దెకి దిగిన ఆ భార్యా భర్త, సామానుతో పక్క యింటికి వచ్చిననాడే లిఫ్ట్ తలుపు తెరుచుకుని ఎడాపెడా సంచులు భుజాన, చేతికి తగిలించుకుని, ఆదివారం మూడు గంటల వేళ గుమ్మంలో అడుగుపెట్టిన ఆ అమ్మాయిని లిఫ్ట్ ఎదురుగా వున్న అపార్ట్మెంట్ డ్రాయింగ్ రూములో కూర్చుని చూసింది వరలక్ష్మి. కొత్తవాళ్లు వచ్చారు అని లేచి గుమ్మంలోకి వెళ్లి ఆహ్వానం పలికినట్టుగా నవ్వుతూ చూసింది పలకరింపుగా. "ఇన్నాళ్లూ ఖాళీగా వుంది. మీరొచ్చారు. సంతోషం. మంచినీళ్లు అవీ ఏమన్నా కావాలంటే అడుగమ్మా!'' అంది చనువుగా.

ఆ అమ్మాయి తలెత్తి చూసి పెదాలు దాటని చిరునవ్వుతో అలాగే అన్నట్టు



తల ఆడించి, "థాంక్స్ ఆంటీ!" అంది లోపలికి వెడుతూ. చామనఛాయ, పల్చటి మనిషి, మొహం ముందు కనపడేవి కళ్లే, కాని ఆ కళ్లల్లో జీవం లేదు. ఆ మొహంలో కాంతి లేదు. ఉదయం నించి సామాను, అదీ సర్దుకు యిల్లు మారడం, అలిసిపోయినట్టు కనిపించిన ఆ అమ్మాయి ఆ తర్వాత యిల్లు అదీ సర్దుకుని ఆఫీసుకెడుతున్నా, వస్తున్నా, ఎప్పుడు కంటబడినా నిస్తేజమైన ఆ కళ్లు, మొహంలో నిర్లిప్తత, ఏ ఉత్సాహమూ కనపడలేదు. ఉదయం ఏడున్నరకే హడావిడిగా వెళ్లిపోయేది. సాయంత్రం ఆరింటికి ఊసురోమన్నట్టు వచ్చి తలుపు మూసుకునేది. అవును మరి! పాపం! యింట్లో మళ్లీ చాకిరీ, వంట తప్పదు గదా ఉద్యోగం చేసినా, ఊళ్లేలినా ఆడదానికి. ఆ అమ్మాయి ఆదివారమన్నా బయటికి వస్తే పలకరించాలన్నా కనపడేది కాదు. ఇంట్లో పనులు చక్కపెట్టుకోడం, కాస్త రెస్ట్ తీసుకోడం చేస్తుందేమో! తను వెళ్లి పలకరించాలన్నా ఆదివారం యింట్లో మొగుడుంటాడు, ఎందుకు డిస్టర్బ్ చేయడం అని వూరుకుంది వరలక్ష్మి.

మొదటి రోజు నాలుగు గంటలకి టీ చేసి, ఫ్లాస్కులో పోసి, ప్లేట్లో అరడజను బిస్కట్లు పెట్టి పాపం సామాను అదీ సర్దుకున్నారో లేదో, టీ చేసుకోడానికి స్టవ్ అదీ రెడీ అయిందో లేదోననిపించి టీ పెట్టి తీసికెళ్లి తలుపు తట్టింది.

తలుపు తీసిన అమ్మాయి, యింటినిండా పరిచినట్లున్న పుస్తకాలు, సామాను మధ్య కుర్చీలో లుంగీ, బనీనుతో కూర్చుని పేపరు చదువుకుంటున్న అతను. చెమటలు కారిపోతూ అలిసిపోతూ సర్దుకుంటున్న ఆమె,

"టీ తాగండమ్మా! స్టవ్ అదీ వెలిగించావో లేదో... ఏదన్నా టిఫిను ఉప్మా లాంటిది ఏదన్నా చేసి యివ్వనా అమ్మా!" అంది చనువుగా.

ఆ అమ్మాయి గబగబా "అయ్యో! వద్దండీ, వద్దు. టీ కూడా చేసుకుంటాం లెండి. మీరెందుకు తెచ్చారు?" అంది.

"అయ్యో! టీ ఏం భాగ్యం! పక్కనున్నా. ఇల్లు సర్దుకుంటున్నావు. టీ తాగండి కాస్త ఓపిక వస్తుంది" అంటూ ట్రే ఆ అమ్మాయి చేతికి అందించింది.

ఆ అమ్మాయి మొగుడివంక ఒకసారి చూసి ట్రే అందుకుని "థాంక్స్ అండీ" మొహంలోకి రాని నవ్వు తెచ్చుకుని అంది.

"సరే, సరే, నీళ్ల సీసా యివ్వనా?"

"వద్దండీ, వున్నాయి" అంటూ యింక మాటలకి అవకాశం యివ్వకుండా తలుపు మీద చెయ్యి వేసింది. పనిలో వున్నవాళ్లని యింక యిబ్బంది పెట్టినట్లు అవుతుంది అని తప్పుకుంది వరలక్ష్మి.

***

నెలరోజులయినా అమ్మాయి పేరు కూడా తెల్సుకోలేకపోయింది. ఓ రోజు ఆఫీసునించి వస్తూ లిఫ్ట్‌లో కలిస్తే "సర్దుకోడం అయిందా? ఎక్కడా కనపడ్డమే లేదు. పేరన్నా అడగలేదు. మీ యింటికి వద్దామంటే మీరెప్పుడూ బిజీ..." నవ్వుతూ పలకరించింది వరలక్ష్మి.

"సారీ అండీ! పొద్దుట వెడితే యిదిగో యిప్పుడే రావడం. రాగానే వంటపని, తీరిక వుండదు" కాస్త నవ్వు మొహం పెట్టి అంది.

"అవునులే, వర్కింగ్ వుమన్ గదా! నీ పేరన్నా చెప్పలేదు నీవు?"

"ఆ, వాణి అండీ... వస్తానండి" లిఫ్ట్ డోర్ తెరవగానే గబగబా వెళ్లిపోయింది.

ఏదో పక్కింట్లోకి ఎవరన్నా వస్తే కాస్త కాలక్షేపం వుంటుందనుకున్న వరలక్ష్మికి నిరాశ అనిపించింది. తన వయసుదానితో ఏం మాటలనుకుందేమో! తీరిక, ఓపిక లేవేమో!

లిఫ్ట్ గుమ్మం ముందు వుండడంతో వచ్చీపోయేవారు కనపడి ఆ ఫ్లోర్‌లో వున్నవాళ్లు ఏదో పలకరిస్తారు. ఈ అమ్మాయి భర్త పొద్దుట ఏడుగంటలకల్లా వెడుతూంటే చూసింది. ఆ మొహం చూస్తే సీరియస్‌గా అనిపించింది. రంగు తక్కువ, కళలేని మొహం, అంత పొడుగు లేడు. ఈ వయసులో అంత సీరియస్ ఏమిటో! నెల రోజులయినా యిద్దరూ కల్సి ఎక్కడికీ వెళ్లడం చూడలేదు. అనుకుంది వరలక్ష్మి.

ఒకరోజు ఆదివారం. పాలప్యాకట్టు గుమ్మం ముందు పడి వుంది. ఎనిమిదైనా తీసుకోలేదు. పాలు విరిగిపోతాయేమోనని తీసి బెల్ కొట్టింది. అతను తలుపు తీసి సీరియస్‌గా ప్రశ్నార్థకంగా చూశాడు. "పాల ప్యాకట్టు తీసుకోలేదు. మర్చిపోయారని...



విరిగిపోతాయని...'' కాస్త తడబడుతూ, అతని మొహం చూస్తూ... అతని కళ్లలోని తీవ్రత, అప్రసన్నత చూస్తూ అంతకంటే అనలేకపోయింది.

"థాంక్స్'' ప్యాకట్టు తీసుకుని తలుపు వేశాడు. తన గుమ్మంవైపు నడుస్తుంటే లోపలినించి అతని గొంతు గట్టిగా వినిపించింది. పాలప్యాకట్టు తీసుకోలేదని అరుస్తున్నాడు గాబోలు భార్యమీద. తరువాత నాలుగయిదుసార్లు సాయంత్రం యిద్దరూ యింటికి వచ్చాక దేనిమీదో అరుచుకోడం, ఒకటి రెండుసార్లు గ్లాసో, గిన్నో విసిరికొట్టిన చప్పుళ్లు, అలాంటపుడు ధడాలున తలుపు తెరుచుకు విసురుగా అతను యింట్లోంచి వెళ్లిపోయి ఏ రాత్రో పదిగంటలపుడు రావడం - మళ్లీ యింట్లో విసురుగా మాటలు - చాలాసార్లు వినిపించేవి. తన బెడ్‌రూమ్ బాల్కనీ, వాళ్ల డ్రాయింగ్‌రూము బాల్కనీ పక్కపక్కనుండేవేమో స్పష్టంగా వినపడకపోయినా యిద్దరూ దేనికో ఘర్షణ పడ్తున్నట్టు అర్థమయేది. ఏమిటో యిద్దరూ సుఖంగా, హాయిగా వుండాల్సిన ఈ వయసులో యిప్పటినించీ యీ గొడవలేమిటో? మనసులు కలవని సంసారం అనిపించింది.

ఇవాళ వినిపించిన పళ్లెం గింగురులు వాళ్లు వచ్చిన నెలరోజులకి మొదటిసారి వినిపించింది. విసురుగా అతను బయటికి వెళ్లిపోవడమూ చూసింది. ఏదో గొడవ జరిగింది. అలాంటి గొడవలు నాలుగైదుసార్లు విన్నాక పాపం ఆ అమ్మాయి... ఎందుకిలా... ఒకసారి వెళ్లిచూసి విషయం తెల్సుకొంటే? అట్టే పరిచయం అన్నా లేని అమ్మాయి, తను వెడితే యిబ్బంది పడచ్చు. యిష్టం లేకపోవచ్చు. ధైర్యం చెయ్యలేక నిస్సహాయంగా పూరుకుంది.

ఒకరోజు చాలా చాలా చప్పుళ్లు, గిన్నెలు, ధబధబ కుర్చీలలాంటివి పడిన చప్పుళ్లు. కెవ్వుమన్న ఆ అమ్మాయి కేక విని కలవరపడిపోయి... అతను విసురుగా తలుపు తీసుకుని వెళ్లిపోగానే, యింక ఆగలేక తలుపు తోసుకుని లోపలికి వెళ్లింది.

డైనింగ్ టేబుల్ మీద తలవాల్చి వెక్కి వెక్కి ఏడుస్తున్న ఆ అమ్మాయిని చూసి మనసు ద్రవించి నెమ్మదిగా వెళ్లి తలమీద ఓదార్పుగా రాసింది. దిగ్గున తలెత్తిన ఆమె తనని చూసి బిత్తరపోయింది. తన బతుకు బట్టబయలయిందన్న సిగ్గు, అవమానం, దుఃఖం, ఆశ్చర్యం, ఉక్రోషం... ఏవేవో భావాలు మొహం నిండా.



"ఊరుకో అమ్మా, అలా ఏడవకు. బాధపడకు. నేను మీ అమ్మ, అమ్మమ్మ వయసుదాన్ని. రోజూ వింటూ కూడా వస్తే ఏం అనుకుంటావోనని రాలేదు. ఇవాళ యింక ఆగలేక వచ్చా. నీ కష్టం చెప్పమ్మా నాతో. ఏం జరిగింది? ఎందుకిలా?''

ఆ అమ్మాయి హిస్టీరియా వచ్చినదానిలా రెండు చేతులతో తలమీద దబదబా బాదుకుని "నా ఖర్మ, నా దురదృష్టం, యిలాంటి వెధవ పాలబడ్డాను. వెధవ పెళ్లిచేసుకున్నా. ఒక్క రోజు సుఖంలేదు. నా బతుకింతే, చావడం తప్ప మార్గం లేదు.'' పెద్ద పెట్టున వెక్కి వెక్కి ఏడుస్తూ, ఏడుపు మధ్య ఒక్కోమాట... అలా ఆగకుండా పది నిమిషాలు ఏడ్చింది.

మంచినీళ్లు యిచ్చి, కొంగు తడిపి మొహం తుడిచి, ఓదారుస్తూ తల నిమురుతూ, కంటి కింద కమిలిన చోట తడికొంగుతో అద్దుతూ "ఊరుకో అమ్మా! ఏడిస్తే ఏం ప్రయోజనం? ఇలా ఎందుకు సహిస్తూ పడి వుంటున్నావు? చదువుకున్న దానివి. ఉద్యోగస్తురాలివి. ఇంత బేలగా అన్నీ భరిస్తూ యిలా పడిపంచడమేమిటి? ధైర్యం తెచ్చుకో, తిరగబడి, నిలేయి. కొట్టే హక్కు లేదని చెప్పు. ఊరుకుంటే ఇలాంటి మగాళ్లు యింకా పేట్రేగిపోతారు.''

"ఏం చెయ్యను. నాకెవరూ లేరు. ఎవరితో చెప్పుకోను?'' ఏడుస్తూ అంది.

"చూడు, ముందు ఆ అన్నం తిను. అన్నం మానేస్తే ఏడవడానికన్నా ఓపిక వుండాలి గదా! కడుపు మాడ్చుకుంటే కరిగిపోయే మొగుడు కాదన్నది నీకు అర్థమయే వుంటుంది గదా!'' అంటూ కంచంలో మజ్జిగ అన్నం అంత ముద్దలు చేసి పెడితే ఎంత ఆకలిమీద వుందో అంతా తినేసింది. "లే, యింక వెళ్లి పడుకో. ఇవన్నీ యిలా వుండనీ, వీలయితే రేపు సెలవు పెట్టు. మనం మాట్లాడుకుందాం. ఏం చెయ్యాలో ఆలోచిద్దాం. లే, వెళ్లు లోపలికి'' అంటూ లేపి లోపలికి పంపి, వీధి తలుపు లాగి వేసి వెళ్లింది వరలక్ష్మి.

✲ ✲ ✲

మర్నాడు వాణి చెప్పింది వింటుంటే యింక యీ కాలంలో కూడా యిలాంటి మగవాళ్లు వున్నారా అనిపించింది. పెళ్లి చేసుకుందాం అంటూ వెంటబడి,

వప్పుకునేవరకూ ప్రేమ నటించి, యిద్దరూ ఒక ఆఫీసు, యిష్టపడ్డవాడు దొరికాడు అని మురిసి మురిపెంగా చూసుకుంటాడు అన్న ఆశలు, ఊహలు, కోరికలు అన్నీ చేసుకున్న నెలరోజులకే నలిపి నేల రాస్తాడని ఏ అమ్మాయి ఊహిస్తుంది? తన ఉద్యోగం, డబ్బుకోసం మాత్రం చేసుకున్న డబ్బుమనిషి అని రెండు నెలలకే అర్థం అయిపోయింది. మనిషి చదువుకున్నాడు, సంస్కారం వుంటుందన్న నమ్మకాన్ని వమ్ము చేసేశాడు. నిలువెల్లా మగ అహంకారం, యిల్లు తనది, భార్య తనది, ఆ యింట్లో తనదే సర్వాధికారం, భార్య అన్నది చెప్పుచేతల్లో వుండాలనుకునే మగమహారాజు. కూరకి సర్దుకోడు, టిఫినుకి సర్దుకోడు. భార్యకి వంట్లో బాగులేకపోయినా ఓ పూటన్నా వంటకి సర్దుకోడు. సర్దుబాటు అన్నదానికి అర్థం అతనికి తెలియదు. భార్యకి పూలు, చీర, పుట్టినరోజు కానుక, ఓ హెటలుకి వెళ్లి తినడం, ఎప్పుడన్నా సినిమాకో, షికారుకో వెళ్లడం అన్నీ అతనికి అనవసర ఖర్చుల్లాగే అనిపిస్తాయి. జీతం కోసం ఆఫీసు, బతకడం కోసం తినడం ఆ రెండే అతనికి అవసరం. భార్య జీతం మీదా అతనిదే అధికారం. జమాఖర్చులు తను జాగ్రత్తగా చూస్తాడు, ఆడవాళ్లకి తెలియును అని కొత్తలో నమ్మబలికి జీతం తీసుకుని, ఖర్చులకి డబ్బు ఎంత యివ్వాలో అతనిదే నిర్ణయం. అన్నింటికీ తల ఆడించింది. తనవాడు అతను చెప్పింది వేదం అనుకుంది. తనకెందుకీ డబ్బు లెక్కల గోల? అతన్ని చూసుకోనీ అని నిశ్చింతగా వూరుకుంది. రెండు నెలలు గడిచేసరికి అతని తత్వం అర్థమైంది. అతని ఆలోచనలు, మాటలు, ఆచరణ అన్నీ వక్రమేనన్నది అర్థమయ్యాక తను ఎంత తెలివితక్కువగా అతన్ని నమ్మి, మోస పోయిందో గ్రహించింది.

నిలువెల్లా పురుషాహంకారం నింపుకున్న అతనిలో ఏ కోశానా మానవత్వం లేదన్నది, మనిషిగా వుండాల్సిన ప్రేమ, అభిమానం, సెంటిమెంట్స్ లాంటి మాటలకి అర్థాలే తెలియని మూర్ఖుడు అన్నది తెల్సిపోయింది. అతనికి నచ్చనిది జరిగితే, చెప్పినట్టు చేయకపోతే అతని నోటికి అడ్డూ అదుపూ లేకుండా ఎంత సంస్కార హీనంగా మాట్లాడుతాడో! కోపం వస్తే చేతిలో వున్నది మొహం మీదకి విసిరికొట్టడం. అతని ప్రవర్తనతో పెళ్లయిన కొత్తలోనే బేజారు అయిపోయి భయంతో బిక్కచచ్చి

పోయింది. పెళ్లికి ముందే పక్షవాతంతో ఓల్డ్ ఏజ్ హెమ్‌లో వున్న తల్లికి నెలకి పదివేలు పంపడం తన బాధ్యత, తల్లిని చూడడానికి ఎవరూ లేరని ముందే పరిస్థితి చెప్పినా ప్రతి నెలా గోల, అరుపులు. పదిసార్లు చెపితేగాని డబ్బు యివ్వకపోవడంతో జీతం రాగానే తనే ముందే పంపితే దానికి ఎంత రాద్ధాంతం! అతని సంగతి అర్థమై అణిగివుంటే మరింత రెచ్చిపోతున్నాడని గ్రహించి జవాబులు యివ్వడం, అభిప్రాయం ఖచ్చితంగా తెలియచెప్పడం మొదలుపెట్టగానే యింకా గొడవలు ఎక్కువై, ఆ మనిషిని ఏం చెయ్యాలో తెలియని అయోమయ అవస్థలో అన్నీ భరిస్తూ తన పని చేసుకుంటూ మౌనంగా వున్నా పొగరు జవాబు చెప్తావా అంటూ గోల. ప్రతిరోజూ దినదిన గండంగా బతుకీడుస్తూ తిట్టిన రోజు ఏడుస్తూ, తిట్టకుండా గడిచిన రోజు పండగ అనుకుంటూ బతుకీడిస్తున్నా. ఏం చెయ్యాలో తెలియదు. చద్దామనిపిస్తుంది.''

“హు, నీవెందుకు చావడం? ఇలాంటివాడితో యింకా కాపురం సాగిస్తున్న నిన్ను చూస్తే ఆశ్చర్యంగా వుంది. చదువుండి, ఉద్యోగం వుండి, నీ బతుకు నీవు బతకగలిగే అవకాశం వుండీ, యిలా భరిస్తున్నావంటే... గట్టిగా ఎదిరించి యింట్లోంచి పోతా, నా బతుకు నే బతుకుతా అని...''

“అన్నీ అయ్యాయి. అంటే, ఫో అని బట్టలు విసిరేశాడు. నన్ను ఎదిరించి పోతా అని మరోసారి అంటే గెంటేస్తా యింట్లోంచి. ఏ బాబు ఆదుకుంటాడో చూస్తా అని బెదిరింపులు. ఉద్యోగం చూసుకు మిడిసిపడ్తున్నావు. ఫో యింట్లోంచి. పోతే మొగుడంటే ఏమిటో తెలుస్తుంది. మొగుడన్నాక ఓ మాట అంటే పోతా పోతా అని భయపెడితే, ఆడాళ్లకే అంత తెగింపు వుంటే, నాకేం మగాడ్ని మరో పెళ్లి చేసుకుంటా.''

“అంటే - ఎంత మగ అహంకారం! ఇంకా యీ రోజుల్లో యిలాంటి మగాడిని భరించి సహిస్తున్నావంటే...''

“ఏమిటో, నాకెవరూ లేరు. అమ్మని చూసుకోవాలి. ఒంటరిగా బతకడంలో ఏ చిక్కులు వుంటాయోనని.... అక్కడికొచ్చి ఏ గొడవలు ... చేస్తాడో ?''

“ఇంతకంటే గొప్ప చిక్కులుండవులే అమ్మా! ఒక గది తీసుకో. చిన్న యిల్లు



తీసుకుని నీ పాటికి నీవు బతకలేవా? పిచ్చివేషాలు వేస్తే పోలీసు కంప్లైంట్ యిస్తానని బెదిరించు. నీ హద్దులో నీవుండి, మొగుడ్ని కదా అని నన్ను వేధిస్తే నీ అంతు చూస్తా' అని బెదిరించి చూడు. అన్నింటికీ నీవు భయపడ్తున్నావని నీకు ధైర్యం లేదని గుర్తించి అలా రెచ్చిపోతున్నాడు. నీకు నేనున్నా. ఏమన్నా పిచ్చివేషాలు వేస్తే పెట్టె పట్టుకు నా యింటికి రా. నీ ఏర్పాటులు చేసుకునేవరకూ నేను అండగా వుంటా. ఎన్నాళ్లు కావలిస్తే అన్నాళ్లుండు.''

"అమ్మో! మీ యింట్లో - నన్ను బతకనిస్తాడా?''

"ఇదిగో, పిచ్చిమాటలు మాట్లాడకు. పిరికితనం వదులు. నీ వంటిమీద చెయ్యి వేస్తే ఫోను ఎత్తి పోలీసులని పిలు. చచ్చినట్లు భయపడతాడు.''

అపనమ్మకంగా చూసింది. "పోలీసులు వస్తారా? వాళ్లు వస్తే ఆ కోపంతో యింకా ...''

ఆమెలో అభద్రతాభావం, పిరికితనం పోగొట్టడానికి ఎన్ని రకాలుగా ధైర్యం చెప్పి చెప్పి, "తిరగబడి చూడు... అప్పటికీ దారికి రాకపోతే చూద్దాం'' అంటూ ఆ రోజంతా ధైర్యం చెప్పింది వరలక్ష్మి.

✲ ✲ ✲

"ఆంటీ! మీరు చెప్పింది చేశా. ఫోను ఎత్తేసరికి భయపడి, కోపం పట్టలేక ఫోను విసిరేశాడు. 'ఫోను విసిరేస్తే బయటికి వెళ్లి చెయ్యలేననుకుంటున్నావా? నీ హద్దులో నీవు వుండి యీ యింట్లో నీకెంత హక్కుందో నాకూ అంతే హక్కు వుంది. పొమ్మనే హక్కు నీకు లేదు' అని దబాయిస్తే కాస్త తెల్లబోతూనే బెదిరాడు. 'పొగరెక్కిందే నీకు. ఉండు నీ పని చెప్తా' అంటూ విసురుగా వెళ్లిపోయాడు. ఆంటీ! కాస్త భయపడ్డాడు.''

రెండు మూడు రోజులకి ఒకసారి సలహాలు, సంప్రదింపులుతో యిద్దరూ చర్చించేవారు. ఆఫీసుకి వెళ్లే పిల్ల అంటూ వండుకున్నది కాస్త ఎక్కువ వండి కూర, పచ్చడి, పులుసులాంటివి స్పేర్ తాళం దగ్గర పెట్టుకుని వాళ్లిద్దరూ యింటి కొచ్చేముందు వంటింట్లో పెట్టేది వరలక్ష్మి. చాకలి బట్టలు తెచ్చినా, పనిమనిషి వస్తే తాళం యిచ్చి పని చేయించడం లాంటి చిన్న చిన్న పనులు చేయిస్తూ తల్లిలా



ఆదుకుంటూ ధైర్యం నూరిపోస్తూ వాణి కాస్త ప్రశాంతంగా ఎలా తన బతుకు తను బతకాలో చెపుతూ ఆప్తురాలైంది. వాణి తిరగబడ్డాక తిట్లు తగ్గినా, ఆ కోపం, ఆ విసురు సహజంగా వచ్చిన బుద్ధులు తగ్గడానికి సమయం యివ్వాలని, "కొన్నాళ్లు ఎదురుచూడు, మార్పు రాకపోతే ఆలోచిద్దాం'' అంది వరలక్ష్మి.

పది రోజులు కాస్త తగ్గినట్టు కనిపించినా, లోలోపల వుడికిపోతూ వాణిలో తిరుగుబాటుతనం తట్టుకోలేక బరస్ట్ అయ్యాడు ఒకరోజు. యధాప్రకారం పళ్లేలు, గ్లాసులు విసరడం, తిట్లు అన్నీ అయ్యాయి. "ఆంటీ, నాకు మీరు అండగా వున్నారని, మీరు నాకు అన్నీ నేర్పుతున్నారని, మనిద్దరి మధ్య సాన్నిహిత్యం తెల్సి, 'ఆ ముసలిది నీకు అన్నీ నూరిపోస్తూందన్నమాట!. అందుకే యింత పేలుతున్నావు. ఎవరే అది. కాళ్ళిరగ కొడతా నా ఇంటివైపువస్తే. కాపురం చెడగొడ్తుందా? అన్నేళ్లు వచ్చి బుద్ధి, జ్ఞానం లేదా దానికి' అంటూ నోటికి రాని మాటలంటే వినలేక తిరగబడ్డా. అదీ చూశారుగా ఆయన బుద్ధి.''

"సరే చూద్దాం...'' అంది వరలక్ష్మి.

ఆ రోజే కొడుకుతో మాట్లాడితే కొడుకు అన్నది విన్నాక కాస్త ఆలోచనలో పడింది. ఆలోచన తెమలకముందే తరువాత పదిరోజులకి కొత్త కారణంతో నోటికి రాని మాటలు.

"ఆంటీ, ఆఫీసులో ఎవరితోనో నాకు సంబంధం అంటగట్టి, వాడితో స్నేహం మరిగావే. వాడు రమ్మన్నాడా? పోతావా రంకు మొగుడి దగ్గరకి. అందుకేనా అంత ధైర్యంగా ఎదిరిస్తున్నావు?' అంటూ నానాగోల చేశాడు'' అంటూ ఏడ్చి ఏడ్చి వాచిన కళ్లతో ఏడుస్తూ అంది వాణి.

"పద, నీ మొగుడితో మాట్లాడుతా. ఇంక వూరుకోవద్దు'' వరలక్ష్మి ఆవేశం పట్టలేక లేచి వాణి వద్దు వద్దు అంటున్నా చేయి పట్టి లాక్కెళ్లినట్టే ఆ యింట్లో చొరపడింది. అతను తెల్లబోయాడు. "చూడు బాబూ! నీ పేరేమిటో, ఎందుకు ఒక ఆడపిల్లని యింతలా హింసిస్తున్నావు? అగ్నిసాక్షిగా పెళ్లాడి, నిన్ను నమ్మి తనవాళ్లందరినీ వదులుకుని వచ్చిన భార్యని గుండెల్లో దాచుకోవల్సిన అమ్మాయిని,



నీ యింటికొచ్చి, నీకు చాకిరీ చేసి, నీకు పిల్లల్ని కని, నీ యిల్లే తన యిల్లనుకుని బతికే భార్యని యిలా హింసిస్తావా? మగాడివైతే, మొగుడివైతే నీ యిష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తావా?''

దులిపేస్తున్న వరలక్ష్మిని చూసి ముందు బిత్తరపోయి తరువాత కోపంగా లేచి "ఏమిటి, ఎవరు నువ్వు? నా యింటికొచ్చి, నన్ను యిన్ని మాటలంటున్నావు, నీకెంత ధైర్యం? ముందు నడు బయటికి. మా యింటి వ్యవహారంలో కలుగజేసుకునే అధికారం ఎవరిచ్చారు? అసలు నీవే దానికి లేనిపోనివన్నీ ఎక్కించావు బుర్రలో. అంతవరకు చచ్చినట్టు పడివుంది. పో బయటికి. నీవెవరు అని యిన్ని మాట్లాడు తున్నావు?'' ఎగిరెగిరి పడుతూ మీదమీదకి వచ్చాడు.

"నేనెవరినా? తోటి మనిషిని. నీ అమ్మ వయసున్నదాన్ని, బుద్ధి చెపితే వింటావని వచ్చాను. ఆ అమ్మాయిమీద చెయ్యి వేశావో నీ అంతు చూస్తా! ఉద్యోగం ఊడగొట్టించి జైల్లో తోయిస్తా'' అరిచింది వరలక్ష్మి.

"ఇదే ఆఖరిసారి, మరో ఛాన్సు లేదు నీకు. కట్టుకున్న యిల్లాలిపై యిలాంటి దౌర్జన్యం, హింస ఏ పోలీసులు, కోర్టులు సహించవు. అది తెల్సుకో వస్తా. వాణీ, మరోసారి ఏదన్నా నోరెత్తితే రా నా దగ్గిరకి'' తర్జనితో బెదిరించి విసవిసా యింట్లోంచి బయటికి వచ్చింది వరలక్ష్మి ఆయాసపడ్తూ.

✲ ✲ ✲

తుఫాను ముందు నిశ్శబ్దంలా పదిరోజులు నిశ్శబ్దంగా గడిచాయి. పదకొండో రోజు ఏం జరిగిందో చెప్పడానికి వాణి లేదు. ఏదో పెద్ద నింద, హింస, భరించలేనంత ఏదో జరిగివుంటుంది. కాస్త ధైర్యం తెచ్చుకుని, ఏదో నిర్ణయానికి వద్దామన్న ఆలోచన వాణికి వచ్చి ఆ నిర్ణయం అమలుపరిచే వేళకే యిలా తొందరపడింది.

పావుగంట అలా స్పృహ లేనిదానిలా కూర్చున్న వరలక్ష్మి నెమ్మదిగా శక్తి కూడగట్టుకుని, ఫోను తీసింది. తర్వాత గోడకి తగిలించిన తాళాలు పట్టుకు నెమ్మదిగా వాణి యింటివైపు వెళ్లింది. ఇంట్లో నలుగురయిదుగురు జనం. డైనింగ్ టేబుల్ దగ్గిర కుర్చీలో రెండు చేతుల మధ్య తలవాల్చి, పాలిపోయిన మొహంతో

కూర్చున్న ఆ మొగుడనే మృగం దగ్గిరకి వెళ్లింది. టేబుల్ మీద వాళ్ల ఇంటి తాళం పడేసి "ఆలస్యం చేశాను ఫోను చెయ్యడం. ఇప్పుడు చేశాను. వారం ముందే చేసివుంటే వాణిని రక్షించుకునేదాన్ని. నాదే పొరపాటు. ఇప్పుడు ఇంక ఆలస్యం అవదు. వస్తారు పోలీసులు. సిద్ధంగా వుండు'' తిరస్కారంగా చూస్తూ, చెమటలు కారుతున్న అతని మొహంలోకి తీక్షణంగా చూసి బయటికి నడిచింది.

ఇంట్లో లైట్లన్నీ వేసుకుని, కుర్చీలో కూర్చుని పోలీసుల రాకకోసం చూస్తోంది వరలక్ష్మి.

**వంశీ - కొత్త కథలు-3 : 2019** 



# పేరెంట్స్ డెన్

ఆ వాణి నిలయం టెర్రేస్ మీద స్మశాన నిశ్శబ్దం అలుముకుంది. కింద మూడోఫ్లోర్‌లో శవయాత్రకి జగన్నాథం గారిని సిద్ధం చేస్తున్నారు. అక్కడ వున్న ఆరుగురు పేపర్లో ముఖం దాచుకున్నారు. రూమ్‌లో నించి వస్తూ కొంగుతో కళ్ళు కడుచుకుంటూ 'కిందికి వెడదామా' అంది జానకమ్మ జనాంతికంగా.

"ఇంకా టైమ్ పడుతుంది. ఇంటినిండా జనం, బంధువులు, స్నేహితులు, ఆయన ఆఫీస్ వాళ్ళు, బోలెడు మంది వున్నారు. చోటు లేదు. కిందికెళ్లి చూసివచ్చా. స్నానానికి కిందికి తీసుకెళ్ళినపుడు వెడదాం'' రామ్మూర్తి అన్నాడు.

"సరే అయితే... వెళ్ళేటప్పుడు పిలవండి, పని చూసుకుంటా లోపల'' అంటూ లోపలికెళ్ళిపోయియిందావిడ.

"ఒక కుటుంబంలా వున్నాం ఇన్నాళ్లు. ఇంతతొందరగా దాటి పోతారను కోలేదు.'' నిట్టూర్చి అన్నారు సుబ్రహ్మణ్యం.

"పోయినవాళ్ళు అదృష్టవంతులు, భార్య పోయిన ఈ రెండేళ్ళనించి ఆయన దిగులుగానే వున్నారు. అందులో గత ఏడాది స్ట్రోక్ వచ్చిందగ్గరనించి మరీ డీలా పడిపోయాడు. ఏదో మంచిపని చేసి పేరుతెచ్చుకుని పోవడం, ఎందరికి దక్కుతుంది ఈ తృప్తి, అదృష్టవంతుడు నలుగురికి మేలు చేసేపని. తోవ చూపించి దాటిపోయాడు. అయనకి ఎంతో దగ్గర స్నేహితుడు ఆప్తుడు గౌరీశంకర్ అన్నారు.

"అందరి మాటేమోగాని మనకి ఈ చివరి రోజుల్లో ఓ తోవ చూపించి సంతోషంగా స్వేచ్ఛగా పరువుగా మన మానాన మనం బతికే వీలు ఇచ్చాడు. ఎక్కడి వాళ్ళం ఎలా కలిసిపోయి ఆనందంగా యేడాదినుంచీ ఒక కుటుంబమయి పోయాం.'' చలపతిరావు విచారంగా అన్నాడు. అంతా తలాడించారు.

కిందనించి "నారాయణ నారాయణ" అన్న మాటలు వినగానే అందరు దిగ్గున లేచి "పదండి కిందికి తీసుకెడుతున్నారు. వెడదాం" అని బయలుదేరారు.

కింద బ్రాహ్మడు తంతు స్నానాదికాలు యధావిధిగా కొడుకు చేత చేయించి అందరిచేత ప్రదక్షిణాలు చేయించి నోట్లో బియ్యం గింజలు వేయించాడు. పాడె లేచింది నారాయణ శబ్దాలమధ్య. కావాల్సిన వాళ్లంతా వెంట కదిలారు.

"నాన్న కుటుంబం అయిపోయారు మీరంతా. వచ్చాక స్నానాలు చేసిరండి, భోజనానికి ఏర్పాట్లు చేసాం ఈ పూట" అంది కూతురు కళ్ళు తుడుచుకుంటూనే, అంతా తలాడించారు.

✲✲✲

ఆరోజుతో జగన్నాథం గారి శకం ముగిసింది. పదమూడు రోజులు ముగిసి ఎక్కడివారక్కడ సర్దుకున్నారు. అపార్ట్‌మెంట్స్ కట్టినపుడే, ముగ్గురు పిల్లలకి తలొకటి, తనకొకటి రిజిస్టర్ చేయించేశారు. వున్న క్యాష్ కర్మకాండలకి, సంవత్సరీకాలకి ఖర్చుపెట్టగా మిగిలింది తనపేరు, భార్యపేరుతో వారి వారి ఆబ్దిక దినాలలో రామకృష్ణ ఆశ్రమంలో ఆ వడ్డీతో అన్నదాన కార్యక్రమానికి వినియోగించవలసిందిగా కోరాడు. తన అపార్ట్‌మెంట్, తన తమ్ముడి కొడుకు జీవితంలో పైకిరాలేక పోయిన అతనికి ఇస్తున్నట్టు విల్లురాసి ఏ గొడవలు తలెత్తకుండా జాగ్రత్తపడ్డారు. తన పుస్తకాలూ, సామాను తన మిత్రులకి కావలసింది ఇచ్చేట్టు ఏ ఆశయానికి ఈ "పేరెంట్ హోమ్స్" మొదలుపెట్టారో అది అన్నిచోట్లకి విస్తరించి అమలు జరిగేట్టు చూసే బాధ్యత మిగతా మిత్రులపైన పెట్టారు. ప్రార్ధనలు భోజనాలు చేసి ఫోటోకి దండం పెట్టి అందరూ కదిలారు.

జగన్నాథం గారు జనానికి జడ్జి అయినా ఆయనకి భార్య వాణి జడ్జి. ఇంట్లో ఆవిడ మాట ఏనాడు కాదనలేని అపురూప అన్యోన్య జంట వారిద్దరిది. ఆయనమాటా ఆవిడ ఎప్పుడు కాదనలేదు. ఏదన్న ఆయన చెప్పింది సరిగా లేదని అనిపించినా, సావకాశంగా అలోచించి, నెమ్మదిగా సందర్భం చూసి తన ఆలోచన సరియైనదేనా అన్నట్టు అడిగేది భర్తని . "అవును సుమా ! నేనంతదూరం ఆలోచించలేదు, నయమే చెప్పావు అనేవారు" అయన.




అవిడేం పాతకాలం ఇల్లాలు కాదు. చదువుకుని, స్కూల్‌ని, పిల్లల్ని కంట్రోల్ చేసే హెడ్ మిస్ట్రెస్ స్థాయి నించి, అదే స్కూల్ కాలేజ్ అయ్యాక ప్రిన్సిపల్ స్థాయికి ఎదిగి, పవర్‌ఫుల్ ఇంటిలిజెంట్ లేడీగా అందరిచేత మన్ననలు అందుకున్న ఆవిడ అన్నదే కరక్ట్ అని నమ్మేవారు ఆయన. పుట్టిన ఊర్లోనే తండ్రి లా ప్రాక్టీస్ అందిపుచ్చుకుని తండ్రిని మించి పేరు తెచ్చుకుని కాలక్రమంలో హైకోర్టు జడ్జిగా ఎదిగి రిటైర్ అయిన పెద్దమనిషి. ఒకే ఊరులో జాయింట్ ఫ్యామిలీలో వుంటూ, తండ్రి పేరు నిలబెట్టి, తండ్రినిమించి ఎదిగిన కొడుకుగా, జగన్నాథం గారంటే ఆప్రాంతాల తెలియని వారులేరు. తల్లితండ్రి కాలం చేసాక ఆ యిల్లు, ఇంట్లో పెద్ద అన్నయ్యగా ఏ బాధ్యతలు వదలకుండా, ఆ ఇంట్లో భార్య భర్త హాయిగా ఆనందంగా, పిల్లల బాధ్యతలు తీరి, నిశ్చింతగా మొక్కలమధ్య గడుపుతూ, చూడదల్చిన ప్రాంతాలు, గుళ్లూగోపురాలు చూస్తూ, సంతోషంగా బతికే ఆ దంపతులని చూసి దేముడికే కళ్ళు కుట్టే ఏమో అన్నట్టు కరోనా రూపంలో వచ్చి ఆయన సగం ప్రాణాన్ని తీసికెళ్ళాడు దేముడు.

ఆత్మీయ బంధువుని కోల్పోయి జీవచ్ఛవంలా అయిపోయి, ఆరునెలలకు గాని అయన తేరుకోలేకపోయారు. తేరుకున్నా మునుపటి మనిషి కాలేకపోయారు. ఆ లంకంత పాత కొంపలో, ఒక్కరు వుండడానికి వీల్లేదంట, ఒక విధంగా బలవంతంగా రానంటున్న ఆయన్ని, సరే నెల రెండు నెలలు వుండి వస్తే కాస్త మార్పు ఉంటుందని, తల్లి పోయిన నెలలో తండ్రి బాధ చూడలేక వంటరిగా వున్న తండ్రిని ఊర్లో వున్నకొడుకు తీసుకెళ్లాడు.

ఊరికి దూరంగా ఎన్నో కొత్త కొత్త అపార్ట్‌మెంట్స్ వెలిసాయి. అందులో మూడుగదుల ఒక అపార్ట్‌మెంట్ ఆఫీసుకి దగ్గరని, అద్దెకి ఉన్న కొడుకు ఇంట్లో పుట్టిన దగ్గరనించి ఎంతో పెద్ద ఇంట్లో ఉండడం అలవాటయిన ఆయన, మనవడితో సర్దుకుని ఓ గదిలో ఇమడలేక, ఊపిరి ఆడనట్టు సతమతమయిపోయారు. ముళ్ళమీద ఉన్నట్టు నెల్లాళ్ళు గడిపి, వెళ్ళడానికి బయలుదేరిపోయిన తండ్రిని ఏ విధంగానూ ఆపలేక 'ఆపాత దెయ్యాల కొంపలో ఎలా వంటరిగా వుంటారు. అపార్టుమెంట్లు కట్టడానికి ఇచ్చేయండి, అందరికి తలోటి ఇచ్చి వాడు మిగతావి

తీసుకునేట్టు, బిల్డర్‌ని చూద్దాం. బాత్రూంలు, వంటిల్లు అన్ని పాతపడి సదుపాయంగాలేవు' అని తండ్రిని ఊదరగొట్టి, అన్నగారితో, అక్కచెల్లెళ్ళచేత చెప్పించి వప్పించాడు కొడుకు. 'ఒక్కరు ఉండద్దు చుట్టూ మనుషులుంటారు' కాలక్షేపంగా ఉంటుంది మీకు నేను ఆ అపార్ట్‌మెంట్‌కి వచ్చేస్తా. మీఇంట్లో మీరుండచ్చు. మీకుసాయంగా నేను అక్కడికి మారుతా, దూరమైనాసరే, అంటూ సిటీకి సెంటరర్లో ఉన్న అంతపెద్దస్థలం, ఏ బిల్డర్ అయినా కళ్ళకి అద్దుకు ముందుకు వస్తారు' అంటూ ఆయన్ని ప్రలోభపెట్టి మొత్తానికి పిల్లలంతా ఏకమయి ఆయన్ని వప్పించగలిగారు.

✲✲✲

ఆ ఎనిమిదివందల గజాలస్థలంలో ఐదంతస్తుల భవనం లేవడానికి పునాదులు పడ్డాయి. మొత్తం పది అపార్ట్‌మెంట్స్. బిల్డర్‌కి ఐదు ఇచ్చేట్టు మిగతావి కట్టి స్థలం యజమానికి ఆధునిక హంగులతో వారి అభిరుచులమేరకి వుడ్‌వర్క్‌తో సహా బిల్డర్ కట్టి ఇచ్చేట్టు ఒప్పదం కుదిరింది. ఆ స్థలానికి వున్న విలువ మరి. అన్నిటికి తలూపే బిల్డర్ పని ఆరంభించాడు. చుట్టూ ప్రహరీగోడకి అనుకుని వున్న పళ్ళచెట్లు, అడ్డంలేని ఏ చెట్లు కొట్టరాదన్న షరతులు పెట్టారు జగన్నాథంగారు. ఏడాది కల్లా పనిపూర్తిచేసి అప్పగించాలి. పనులు చురుకుగా సాగుతున్నాయి.

ఇల్లు వదిలి ఇంటి పని పూర్తిఅయే వరకు కొడుకింటికి షిఫ్ట్ అవక తప్పని స్థితి వచ్చింది ఆయనకి. వేరే ఫ్లాట్ తీసుకుని ఉండడానికి ఇల్లు, సంసారబాధ్యతలు భార్య తప్ప, అయన ఏనాడూ పట్టించుకోలేదు. కాఫీ కూడా చేసుకోడం తెలీని అయన వేరే ఉంటే పడాల్సిన ఇబ్బందులు తలుచుకుని, కొడుకింట్లో ఉండేందుకు తలవగ్గాడు. ఇంట్లో పాతకాలం ఫర్నిచర్ టేకువి, భార్య జ్ఞాపకాల వస్తువులు భద్రంగా ఓ గారేజ్ అద్దెకితీసుకుని పెట్టి కొడుకు ఇంటికి బయలుదేరారు జగన్నాథంగారు.

✲✲✲

ఆ ఏడాదిలో ఆ ఇంట్లో ఉండడం ఆయనకి జీవితం చాల పాఠాలే నేర్పింది. ఎవరిని తప్పుపట్టలేనిస్థితి. స్వేచ్ఛ అంటే అర్థం బాగా తెలిసివచ్చింది. తన ఇష్టాఇష్టాలకి ఆ ఇంటికి ఆయనకాదు యజమాని. ఆయన రుచులు అభిరుచులు



అన్నీ మర్చిపోయి సర్దుబాటు చేసుకోవలసిన స్థితి ఆయనకి మింగుడు పడేదికాదు. మింగుడు పడకపోయినా భార్య లేకపోవడం అంటే ఏమిటో తెలిసివచ్చి రాత్రిళ్ళు కుమిలిపోయేవారు. అలా దిగులుగా నిద్రపట్టని రాత్రులు ఆలోచనమధ్య తనలాటివారు ఎలా బతుకుతున్నారో బాధపడుతున్నారో అన్న ఆలోచన నించి మెరుపులా ఒక ఆలోచన తట్టింది. పదిరోజులకి ఆలోచన ఒక రూపు దిద్దుకుంది ఆయనలో. అంతే ఆ ఆలోచన అమలుచేసేవరకు నిద్రపోలేదు. ఆయన బిల్డర్‌ని పిలిచి మనసులో ఆలోచన వివరించారు. “ఇది డబ్బాశతో చెయ్యాలకున్నది కాదు, ఆడబ్బు నీదే అమ్ముకో, నాకొకటి ఇచ్చి మిగతావి అమ్ముకో, నేచెప్పిన అవసరాలు సౌకర్యాలు ఉండాలి. ప్లాన్ తీసుకొచ్చి చూపించు, ఎంతవుతదో చెప్పు. న్యాయంగా ఉండాలి, కట్టినపుడు ముసలివారని మర్చిపోకు..'' అని పర్మిషన్ వ్రాసి ఇచ్చేసారు. “మున్సిపాలిటీ శాంక్షన్ అన్ని నీవే చూడాలి. నాపలుకుబడి, మాటసాయం కావలిస్తే అడుగు'' అంటూ ఉత్సాహంగా భుజంతట్టి అపుడే అయిపోయినట్టు సంబర పడ్డారు. బిల్డర్ కలుగబోయే లబ్ధిని లెక్కలు కట్టి ఉబ్బి తబ్బిబ్బు అయ్యాడు.

✲✲✲

ఆరునెలల్లో పునాదులు, గోడలు మొదలై స్ట్రక్చర్ తయారయింది. ఆ అపార్ట్‌మెంట్స్ మీద ఆయనకి ఏమి ఇంటరెస్ట్ లేదు. ఆయన దృష్టిఅంతా టెర్రస్ మీద తాను అనుకున్నది ఎలావుండాలి. ఇద్దరు ఉండడానికి ఏ ఏ సదుపాయాలు కావాలీ అని. దేనికి ఇబ్బంది పడకుండా సుఖంగా చరమాంకం గడిచిపోవాలంటే ఆ గదిలో రెండు మంచాలు, ఇద్దరికీ చెరో వార్డ్‌రోబ్, ఓ టేబిల్, రెండు కుర్చీలు, విలువైనవి దాచుకోడానికి గోడలో ఒక చిన్న గోద్రెజ్ అలమారా, ఒక పక్క గోడలో చిన్నది దేముడికి స్థలం, ఇవన్నీ పట్టేట్టు మరీ ఇరుకుగా లేకుండా ఉండాలంటే గది సైజు ఎంతవుంటే సరిపోతుంది, టాయిలెట్ కమోడ్, స్నానం చేయడానికి స్థలం, సీనియర్ సిటిజెన్స్‌కి ఊతం ఇచ్చి పట్టుకుని ఇబ్బంది లేకుండా లేచెట్టు స్టీల్ రాడ్స్ మర్చిపోకూడదు, కమోడ్ వయసుమీరిన వారికీ ఎత్తులోవుండేట్టు, బాల్కనీ కాస్త పొడుగ్గా ఉండేట్టు, అందులో సగభాగం ఎంక్లోజ్డ్‌గా ఉండేటట్టు, ఓచిన్న స్టవ్ పెట్టుకుని కాఫీ, టీ, బోర్నవిటా కలుపుతాగే సదుపాయం ఓ పక్క,

స్టవ్‌పైన చిన్న కప్‌బోర్డు, కాఫీ సామానులు, కప్పులు, గ్లాసులు, గిన్నెలు పెట్టుకునే చోటు. రెండోపక్క ఫారెన్‌లోలాగా గోడకి ఫిక్స్‌చేసి వాషింగ్ మిషన్. బట్టలు ఆరేసుకోడానికి అడ్డులేకుండా సీలింగ్ వరకులాగే రాడ్స్, బయట టెర్రస్ మీద అందరు కూర్చుని కబుర్లు ఆడుకుంటూ కేరమ్స్, పేక, చదరంగం లాంటివి ఆడుకునే విధంగా ఓ ఆరు బై మూడడుగుల సిమెంట్ బల్ల, ఎండకీ వానకి తడిసినా ఇబ్బంది లేకుండా ఉండేట్టు, ఓ అరడజను గార్డెన్ చైర్స్, ఎండవున్నప్పుడు కాస్త వర్షానికి ఆగేట్టు యాస్బెస్టాస్ షేట్లతో తయారు చేయించాలని ఆయన ఆలోచనలు. ఒక్కోటి మర్చిపోకుండా, డైరీలో రాసుకుంటూ, బిల్డర్‌తో చర్చిస్తూ, తన రిక్వయిర్ మెంట్స్ చెపుతూ, ఒప్పిస్తూ, ఒక్కరోజు విడవకుండా టెర్రస్ మీద కడుతున్నప్పుడు, ఒక మోడల్ తయారుఅయ్యే వరకు, తను అనుకున్న విధంగా అయేవరకు, అక్కడేవుండి పర్యవేక్షించారు. బిల్డర్ ఆయన కోరికలకి తగ్గట్టు మార్పులుచేస్తూ మనసులో విసుక్కుంటూనే మొహాన నవ్వు పులుంకుంటూనే ఆఖరికి పూర్తి చేసాడు రాబోయే కోట్లు తలుచుకుంటూ. మొత్తానికి అన్న వేళకి రెండు నెలలు ఆలస్యమైనా ఆగమేఘాలమీద అన్నట్టు చేతికి అప్పగించాడు. అపార్టుమెంట్ల గురించి పిల్లలు బిల్డర్ తప్ప అయన జోక్యం కలుగచేసుకోలేదు.

తండ్రి టెర్రస్ మీద వన్ బెడ్ రూమ్స్ మీద అంత శ్రద్ధ ఎందుకో అర్ధంకాక అడిగారు పిల్లలు. ఆయన జవాబుకి తెల్లబోయారు. "ఏమిటి మీరుంటారా ఇక్కడ. అపార్ట్‌మెంట్‌లో వుండరా" ప్రశ్నలు గుప్పించారు. "అంతపెద్ద అపార్ట్‌మెంట్ నేను మేనేజ్ చేయలేను. ప్రశాంతంగా, హాయిగా ఎవరితో ప్రమేయం లేకుండా నేను ఉండడానికి ఇది కంఫర్టబుల్‌గా ఉంటుందనిపించింది. మీరు వండుకున్నది నాకు ఇంత వంటమనిషి చేత పంపండి అదీ కుదరకపోతే కేటరింగ్ ఫుడ్ ఉందిగా కాఫీ చేసుకుంటా. ఒకే బిల్డింగ్‌లో వున్నాం కనక పిల్లలు దూరంగా వున్నారని నేను, నాన్న ఏం ఇబ్బంది పడుతున్నారో అని మీరు బాధపక్కరలేదు. ఎమర్జెన్సీ వస్తే చూడడానికి పిల్లలు ఉన్నారన్న భరోసా చాలు. ఎవరి స్వతంత్రం ప్రయివసీ వారికుంటుంది. అంత ఇల్లు నేనేం చేసుకుంటా. మీ అమ్మ ఉంటే ఆ సంగతి వేరు. నాకు ఎవరు అడ్డు చెప్పద్దు. ఈ వయసులో వంటరిగా తోచక మగ్గేకంటే నాలాటి రిటైర్ ఇయి భార్యో భర్తో వంటరిగా మిగిలిపోయి పిల్లలదగ్గర ఇమడలేక సర్దుకు ఇరుకు గదుల్లోఉండలేక భాదపడుతూ కాలక్షేపం లేక బాధపడే వారందరం

కలిసి మెలిసి ఉండచ్చు. పది అపార్ట్‌మెంట్స్‌లో వుండేవాళ్ళ పేరెంట్స్ ఇక్కడ కొనుక్కుంటే, లేక పిల్లలు కొనిచ్చి వయసుమీరిన తల్లి తండ్రి వారిమానాన వారు హాయిగా వుంటారు. పిల్లలకి దగ్గిర పెట్టుకునే ఇబ్బంది. తల్లితండ్రులకి సర్దుకుని బతికే అవస్థ ఉండదని ఈ ఆలోచన చేశా'' అని అన్ని విశదంగా అందరికి భోదపరిచి ఎవరు ఏం మాట్లాడడానికి లేకుండా చేసారు జగన్నాథంగారు.

***

అమ్ముడవుతాయో లేదో కొంటారో లేదో ఇన్ని కట్టించారీయన అని మనసులో భయపడే బిల్డర్ హాట్ కేక్స్‌లా ఎనిమిది అమ్ముడవడమేకాదు ‘‘ఇంకా ఏమన్నా ఃఃఉన్నాయా, బయటి అపార్ట్‌మెంట్స్ వాళ్ళకి అమ్ముతారా'' అంటూ ఎంతో మంది తిరిగిపోవడం చూసి మళ్లి ఈ ప్లాన్ తో కట్టాలి ఇంకోచోట అని నిర్ణయం చేసుకున్నాడు.

అక్కడ కొనుక్కున్న వాళ్ళందరూ మధ్యతరగతి సంసారులే. ఓ ఇల్లు ఉంటే చాలు బతకడానికి పెన్షన్ వుంది అనుకునేవారే.

మంచిరోజు చూసి పాలు పొంగించి. సింపుల్‌గా గృహప్రవేశం చేసారు. కొనుక్కున్న వారందరిని సంప్రతించి, 'పేరెంట్స్ డెన్' అని టెర్రస్ రూమ్స్‌కి ఆరోజే బ్రాహ్మడిచేత నామకరణం చేయించేసారు. భార్య పేరిట వాణినిలయం అని అపార్ట్‌మెంట్స్‌కి పేరు రాయించేసారు.

పిల్లలు, తల్లితండ్రులు అందరు హ్యాపీ పేరుపేరు కారణాలతో. అబ్బా కాస్త విశాలంగా ఉన్నట్టుంది ఇల్లు. మూల కూర్చోకుండా అన్ని అడుగుతారు, అన్ని వాళ్లకే కావాలి అని విసుక్కున్న కోడళ్లు ఏదో ఫ్రీడమ్ దొరికినట్టు ఫీల్ అయ్యారు. అమ్మానాన్నలతో ఓపక్క, పెళ్ళాంతో ఓపక్క వేగలేక పోతేపోయింది కాస్త డబ్బు ప్రశాంతతత దొరికింది. డబ్బు కాస్త సర్ది పెన్షన్లోనించి మిగతాలోన్లు కట్టే ఏర్పాటు చేసిన కొడుకులు రిలీఫ్‌గా ఫీల్ అయ్యారు. భగవంతుడా తినో తినకో హాయిగా గొడవలు, అవమానాలు లేకుండా సర్దుకు బతికే అవస్థ నించి తప్పించావు. మేము కృష్ణ రామ అనుకునే వీలు కల్పించారు. చేతులెత్తి దండాలు పెట్టుకున్నారు. తల్లో తండ్రి ఒక్కరయ్యాక కాస్త డబ్బుండి ఇల్లు మెంటైన్ చేయలేని వారు పిల్లలతో సర్దుకు బతకడం చేతకాక సతమతమయ్యేవారు, అన్ని రకరకాల ఇబ్బందిపడిన వారందరు జన్నాథంగారిని పొగడ్తలతో ముంచెత్తి 'ఇంతమంచి ఐడియా మీకు

వచ్చినందుకు మీవల్ల మా శేష జీవితం ఆనందంగా గడుపుతాం. మీకు మేమందరం రుణపడ్డాం' అంటూ దండాలు పెట్టారు.

మొత్తానికి జగన్నాధం గారి పెద్దరికం అందరు ఇష్టపడి, ఆయన చెప్పినట్టు వాళ్లు వాళ్ళ జీవితాలుకి ఓ రొటీన్ ఏర్పరుచుకుని, ఓ కుటుంబంలా కలిసి మెలిసి ఆనందంగా బతకడానికి ఆరునెలలు గడవకుండానే తయారుఅయిపోయారు.

***

''తాతయ్యా, మీ గది ఎంత బాగుంది హాయిగా ఎవరి గొడవ లేకుండా చక్కగా చదువుకోవచ్చు, ఇది నాకిచ్చేసి నీవు కిందికి నా గదిలోకి వెళ్ళిపో' అన్నాడు జగన్నాధం గారి మనవడు పైకివచ్చి అన్నీ తిరిగిచూసి.

"అమ్మ ఆశ నీకోసమా.. ఇంత కష్టపడి కట్టించాను. ఈ ప్రశాంతత కోసమే, ఈ కాలక్షేపం కోసమే కదా.. కింద మీరంతా స్కూల్స్‌కి ఆఫీస్‌లకి పోతారు. మీచదువులు పనులు మీవి. ఈ ముసలాడి సంగతి ఎవరికి కావాలి రా, తోచక కొట్టుకునేవాడిని. ఇప్పుడు చూడు నా వయసు వాళ్ళం అందరం ఉదయం యోగ చేస్తా, అందరు మాటాకలడుకుంటూ, పేక, చదరంగం, కేరమ్స్ ఆడుకుంటాం, కలిసి వాక్‌కి వెడతాం, కలిసి కష్టం సుఖం పంచుకుంటాం. ఎంతహాయిగా ఉందిరా ఇపుడు'' ఎమోషనల్‌గా అన్నారాయన.

"ఓ కారమ్స్ పేకాట ఆడుతున్నారా తాతయ్యా. నేను ఆడుతాను, పిలు తాతయ్యా నన్ను'' ఉత్సాహంగా అన్నాడు.

"మీ అమ్మ కర్రపుచ్చుకు వస్తుంది. అయినా మా ముసలివాళ్లతో నీకెందుకురా .. నీ వయసు వాళ్ళు లేరా ఎవరు అయినా చదువుకోకుండా వీటిమీదకు గాలి మళ్లిపోతుంది ఆడుతుంటే. ఆదివారం ఎప్పుడైనా పిలుస్తాలే'' చిన్నపోయిన మనవడి మొహం చూసి మనవడి భుజం మీద చేయివేసి ఆప్యాయంగా అన్నారు.

"ఏమో సరిగా ఇంకా ఎవరు పరిచయం కాలేదు'' అని తాతగారి మొహం చూస్తూ "తాతయ్య ఒకటి అడుగుతా నిజం చెపుతావా. నీవు అమ్మ మాటలు విన్నావు కదూ! అమ్మ ఏదో అందని ఇక్కడకి వచ్చేసావు కదూ!'' సూటిగా చూస్తూ అన్నాడు తొమ్మిదో క్లాస్ చదివే జ్ఞానం వచ్చిన మనవడు.

ఆయన ఒక్క నిమిషం తెల్లబోయి తరువాత నవ్వేస్తూ "నీ మొహం అదేంకాదు. మామ్మ పోయాక ఇలా ఫ్రెండ్స్‌తో ఉంటే కాలక్షేపంగా ఉంటుందని,



ఎవరికీ ఇబ్బందిలేకుండా, చోటు సరిపోదురా చదువుకునే పిల్లలకి ఓ గది వుండాలిరా నాకు రూం వద్దా చెప్పు'' అంటూ మాట మార్చేసి నవ్వేసారు.

మధ్య మధ్య తాతగారి దగ్గరకు వచ్చి వెళ్ళేవాడు మనవడు. ఆదివారం కొడుకు వచ్చి తండ్రి యోగక్షేమాలు విచారించేవాడు. జగన్నాథం గారు చెప్పింది సంభ్రమంతో విన్న మనవడు దృష్టిలో తాతగారు ఒక్కసారిగా అంతెత్తు ఎదిగి పోయారు.

* * *

అలాగ అందరికీ ఒకే రోటిన్ అలవాటు చేసి జగన్నాథంగారు ప్రతీది పద్ధతి ప్రకారం జరిగేట్టు చూసారు. అక్కడ ఇద్దరు ఒంటరి ఆడవారు ఇద్దరు కలిసి ఒకరూం కొనుక్కుని వుంటారు. అక్కడ వున్న అందరు డెబ్బయి, ఎనభయి దాటినవారే. అన్నయ్యగారు అక్కగారు అనుకుంటూ ఒకరికొకరు సాయం చేసుకుంటూ హాయిగా బతికేస్తున్నారు. అట్టే డబ్బు లేకపోయినా తమకు నీడా తోడు సాయం దొరికి నిశ్చింతగా వున్నామని గొడవలు లేకుండా బతుకుతున్నామని అనుకుంటారు.

మనందరం ఎంత ప్రశాంతంగా బతుకుతున్నామో.. మనలాటి ఒంటరివారు బాధ్యతలు, బరువులు, గొడవలు లేకుండా బతకాలంటే ప్రతి అపార్ట్‌మెంట్‌లో ఇలాటి రూములు ఏర్పాటు చేసేట్టు బిల్డర్స్‌తో స్థలాలు అమ్మినపుడే మాట్లాడి సెటిల్ చేసుకునేట్టు ఉండాలి. ఈ పద్ధతి నలుగురిలోకి వెళ్లాలన్నా, అందరిదృష్టి ఈ విషయం మీదకి వెళ్లాలన్నా, మనం విస్తృతంగా ప్రచారం చేస్తే, పేరెంట్స్ మధ్య, పిల్లల మధ్య మనస్పర్ధలు లేకుండా, ఎవరి ప్రైవసీ వారికి వుండి హాయిగా ఉంటారని ఆయన అంటుండేవారు. ఎన్నో ఫోటోలు పత్రికలకి పంపించి, తెల్సిన అందరి ద్వారా మౌత్ టు మౌత్ పబ్లిసిటీలకి కరపత్రాలు ముద్రించి, జనం మధ్యకు ఈ వార్త వెళ్లేట్టు చేయడంలో సఫలీకృతులయ్యారని చెప్పచ్చు. తనకున్న పలుకుబడితో ప్రభుత్వాలు అపార్టుమెంట్లు కట్టేటప్పుడు విధిగా ఈ రూలు పాటించి, చట్టం రూపొందించాలని ఎంతోమంది ఆఫీసర్లని, వారిద్వారా చీఫ్ మినిస్టర్ని కలిసి, చర్చించి ఒప్పించి తప్పకుండ ఈసారి అసెంబ్లీ సమావేశాల్లో ఈ అంశం ప్రవేశపెడతాం అని మాట తీసుకున్నారు. ప్రెస్ వాళ్ళు రావడం, ఫోటోలు, వార్తలు, ఆర్టికల్స్ వచ్చాయి.

ఇదంతా ఒకరోజో వారమో కాదు జరగడానికి ఏడాది పట్టి, అందరు సర్దుకు అలవాటు పడి, హాయిగా ఉన్నామని అనుకునేసరికి శరాఘాతంలా జగన్నాథంగారికి

ఓ రాత్రి స్ట్రోక్ వచ్చింది. ఆయనకి కాలుచేయి కాస్త దెబ్బతిన్నా తొందరగానే తేరుకుని పిజియోథెరిఫిలు వాటితో కోలుకుని, వాకర్ సాయంతో నడుస్తూ, ఆయన పనులు ఆయన చేసుకునే స్థాయికి వచ్చారు. ఆయన ఆప్తమిత్రుడు పార్థసారధి అనుక్షణం ఆయననతో వుండడానికి ఆ గదిలోకి మారాడు సాయంగా. మిగతా అంతా ఏ ఒక్క క్షణం వంటరిగా వదలకుండా, ఎవరో ఒకరు దగ్గిరుండి నడిపిస్తూ, ఎక్సర్‌సైజులు చేయిస్తూ, పేకాట, చదరంగం ఆడుతూ ఆయన్ని మూడునెలల్లో కాస్త బయటికి తీసుకువెళ్లి, దగ్గరుండి వాక్ చేయిస్తూ ఇంచుమించు కొంచెం కాలు తప్ప మిగతా ఏ ప్రాబ్లమ్ లేదు, అమ్మయ్య అని అంతా అనుకునే వేళకి, మృత్యువు నిద్రలోనే తీసికెళ్ళిపోయింది. ఆయన్ని బతికినంతసేపు ఆయన మిత్రులతో గవర్నెమెంట్ రూల్ చేయించే బాధ్యత మీదే నేనున్నా లేకపోయినా అనేవారు అందరు తలలూపేవారు.

పదమూడో రోజు భోజనాలు అయ్యాక ఆయన ఫోటోదగ్గర నమస్కారంచేసి ఆయన కోరిక తీరేవరకు ప్రయత్నిస్తామంటూ ఫోటో మీద చేయి వేసి ప్రమాణం చేసారు మిత్రులు.

**ఆంధ్రజ్యోతి, ఆదివారం సంచిక : ఆగస్టు 2023** 



# పుత్ర కామేష్టి

పెళ్లయి వెళ్ళాక కరోనా ధర్మమాని రెండేళ్ల తరువాత వచ్చిన మనవడిని చూసి సంబరపడిపోయింది అనసూయమ్మ. పలకరింపులు, కబుర్లు, భోజనాలు, నిద్రలు అయ్యాక సావకాశంగా కాఫీ కప్పుతో కూర్చుని "ఏమిటి బామ్మా కబుర్లు" అంటూ చేయి పట్టుకు పలకరించాడు మనవడు చైతన్య.

"ముసిలిదాన్ని నా దగ్గరేముంటాయి కబుర్లు, నీవే చెప్పు మీ అమెరికా కబుర్లు, కొత్తపెళ్ళాం కబుర్లు, మీ హనీమూన్ పర్వం అయిపోయిందా.." మురిపంగా చూస్తూ అందావిడ.

"పో బామ్మా రెండేళ్లయింది ఇంకా కొత్తపెళ్ళాం, హనీమూన్‌లు ఏమిటి ప్రేమ యాత్రలకి నందనవనాలు, బృందావనాలు ఏలనోయి అన్నట్టు గృహమే స్వర్గసీమ అనుకుంటూ కరోనా ధర్మమాని ఖర్చులేకుండా గడిపేసాం" హాస్యంగా అన్నాడు చైతన్య.

"అయితే పోట్లాటలు లేకుండా అన్యోన్యంగా వున్నారా, మీ ఆవిడ వంట గింటా నేర్చుకుందా, వండిపెడుతుందా..' ఆరా తీసింది ఆవిడ గొంతుతగ్గించి పక్కగదిలో ఇంకా నిద్ర పోతున్న మనవరాలికి వినపడకుండా.

'అవన్నీ నీవడగకూడదు నేచెప్పకూడదు. అవన్నీ పాతకాలం కబుర్లు. ఎవరికీ టైమ్ వుంటే వాళ్ళు చేస్తాం. అక్కడ కాఫీ కావలిస్తే కలుపుకుంటాం. ఆకలేస్తే అన్నం అన్నం వండేయాలి, పప్పో కూరో ఏంతిన్నాం అన్నదికాదు కడుపు నిండిందా అన్నదే పాయింట్. అంతగా ఓపికలేకపోతే హొటల్‌కి పోతాం సెలవురోజు వస్తే' అన్నాడు నిర్లిప్తంగా చైతన్య.

"అదేమిటిరా అదేం చోద్యం పెళ్లయి పెళ్ళాం వచ్చాక అయినా ఇంట్లో

వంట చేయదా'' వింతగా చూస్తూ అనసూయమ్మ అడిగింది . "మరేంటనుకున్నావు ఉద్యోగం చేసే పెళ్లామంటె ... మాతో సమంగా చదివి, సమంగా సంపాదిస్తున్న వాళ్ళు, మేమె ఎందుకు చేయాలి పనిఅంతా ఇద్దరం కలిసి చేయాలంటారు. కాఫీ అని ఆర్డర్ వేస్తె గో అండ్ గెట్ అంటారు ఇప్పటి అమ్మాయిలు. నీవింకా ఎప్పటి ప్రశ్నలో వేస్తె ఎలా బామ్మా..'' నవ్వుతూ తేలిగ్గా అన్నాడు.

"బానేవుంది సంబడం. ఆమాత్రం దానికి పెళ్లి ఎందుకు..ఏం చదువులు చదివితే మాత్రం ఆడది ఇల్లు సంసారం పట్టించుకోవద్దా..'' కోపంగా అందావిడ.

"బామ్మా ఆమాటలు వదిలేయి ఇంకేమన్నా కొత్త సంగతులు చెప్పు.''

"వాళ్ళు కలిసిమెలిసి పనులు చేసుకుంటారు. మనలా ఆడపని మగపని అని వుండవక్కడ. మీరేం అనకండి వసుధ దగ్గర చాదస్తంగా.'' కోడలు కాస్త మందలింపు ధోరణిలోనే అంది.

"ఆ అవును రేపు పొద్దున్న పిల్లలు కంటే నెప్పులు నీవంతు అంటారేమో చూసుకో నాపీలు, పాలసీసాలు ఇప్పటికే అంట కట్టారు మీవంతని'' అందావిడ వ్యంగ్యంగా.

"ఏదో ఏడవండి గాని రెండేళ్లయింది మునిమనవాడిని ఎత్తుకుని కానీ నేను కదలను. అదేదో తొందరగా ఇచ్చేస్తే చూసి దాటిపోతా. ఇంకా ఉంటే ఇంకేం పోకడలు చూడాలో.. ఒరేయి హాస్యం కాదు రెండేళ్లయింది పిల్లలని కనే ప్లానుందా లేదా.. ఇంకా ఏదో కరోనా టైం అని భయపడి అడగలేదు''అంది.

"బాబోయి పిల్లలా నన్నిలా కొన్నాళ్ళు హాయిగా బతకనీ'' నవ్వుతూ దాటేశాడు.

"బామ్మా పిల్లల్ని కనాలంటే భయమేస్తుంది వాళ్ళతో, మా స్నేహితులు పడుతున్న అవస్థలు చూస్తే. ఇప్పటి పిల్లలు తెలివిమీరి పోయారు బామ్మా.. తినడానికి చేతిలో ఫోన్లో బొమ్మలు చూపెడుతూ ముద్దలు నోరుతెరిచినప్పుడల్లా కూరాలి, ఏడుపు ఆపాలంటే ఐపాడ్ చేతిలోకి రాగానే టక్కున ఆపేస్తారు. ఏడెనిమిది నెలలు వరకు ఓకే గాని తరువాత పాట్లు చూడాలి. ఓ పక్క ఉద్యోగాల టెన్షను, ఇంట్లో



పిల్లల పెంపకం, ఏమిటో ఆ పరుగులు, ఉరుకులు, గెంతడాలు, మొండితనాలు, కావాలన్నది ఇచ్చేవరకు ఆ ఏడుపులు, తినిపించడానికి మా ఓపికలు అడుగంటి పోతాయి. గంట గంట కూర్చోవాలి, కళ్లు పాడవుతాయని ఐపాడ్ అవి ఇవ్వకపోతే తినరు. వాళ్ళ ముద్దు మురిపాలు ఫోటోలు తీస్తే, అవి చూసుకుని ఏడాది పిల్లాడూకూడా ఎంత మురిసిపోతాడో... వాళ్ళడిగే ప్రశ్నలకి జవాబులు ఇవ్వడానికి ఎంతంత ఓపికలుండాలో, బాబోయి వాళ్ళందరి బాధలు చూస్తే పిల్లలిని కనాలంటే భయం వేస్తుంది. మీరంతా అరడజనుకి తక్కువకాకుండా కని ఎలా పెంచారో ఆశ్చర్యంగా ఉందిప్పుడు. పిల్లలు కాదు పిడుగులు ఈ జెనరేషన్ పిల్లలు'' గుక్కతిప్పకుండా ఏకరువు పెట్టాడు మనవడు.

"అదేమిటిరా పిల్లలని పెంచడానికి భయపడి కనకపోవడం ఏమిటి విడ్డూరం "అనసూయమ్మ వింతగా చూస్తూ అన్నది "మీరు ఒకళ్ళు ఇద్దరు అయి గారాబంచేసి పిల్లని పెంకివాళ్ళుగా, మొండివాళ్ళుగా చేస్తున్నారు. ఇద్దరు సంపాదిస్తూ అడిగిందంతా కొనిచ్చి, వాళ్ళు ఆడింది ఆట పాడింది పాటలా మీరు వాళ్ళని పెంచి పాడుచేస్తున్నారు. వాళ్ళనికాదు మిమ్మల్ని అనాలి అసలు''

"మీరేం చేసేవారు .. మీకాలంలో పిల్లలు ఇలా వుండేవారుకాదా'' మనవడు చెప్పమన్నట్టు చూసాడు.

"ఆరేడు నెలల వరకు మూలనున్న ముసలమ్మ పెంచుతుంది అనేసామెత వుంది. అప్పటివరకు పాలు నీళ్లు టైమ్ ప్రకారం జరిగిపోతాయి. అప్పుడైనా వేడివేడి నీళ్లు నలుగు పెట్టి స్నానంచేయిస్తే, పాలు రెండువైపులా తాగించి చక్కగా పాడుకోబెడితే మూడు గంటలు వొళ్ళెరగకుండా పడుకునేవారు. మీవి చలిదేశాలని బేసిన్లో గబగబా గిన్నెలు తొలిచినట్టు స్నానం చేయిస్తారు. కుయి మంటే చాలు పాలు కుడిపిస్తారు. రెండుసార్లు చప్పరించి కళ్లుమూసేసి మళ్ళీఅరగంటకు ఏడుస్తారు. ఏడ్చినపుడల్లా పాలుపడితే వాళ్ళకి అదే అలవాటు అయి అరగంటకోసారి ఏడుస్తుంటారు. కాసేపు ఏడవనీయండి, బాలానాం రోదనం బలం అనేవారు ఇదివరకు ఏడిస్తే. శరీరంలోని కండరాలు, నాడులు, కదలికతో బాగా ఆకలి వేస్తుంది. అరగంట ఊరుకుని పాలిస్తే, అడిగినప్పుడల్లా పాలివ్వరన్న సంకేతం చిన్నమెదళ్ళకి

అంది రెండు మూడుసార్లకి అర్ధమయ్యి తాగడం మొదెలెడతారు. అసలు పెంపకం అంత ఏడెనిమిది నెలలనించి పాకడం ఆరంభమయినప్పటినించి మొదలు. అన్నీ లాగేస్తారు, పీకేస్తారు. కనిపించిన వన్నీ నోట్లో పెట్టుకుంటారు. పాలు తాగరు. ఏడ్చి అన్ని పనులు సాధ్యపరుచుకుంటారు. అప్పుడే కాస్తముందు జాగ్రత్తతో వాళ్ళకి తెలియచెప్పాలి. పాలు ఇంకా తగుతావా తీసేయనా అని సీసా చూపిస్తూ అడగాలి. తలూపడంతెలిస్తే వద్దన్నట్టు అనగానే పాలసీసా తీసేయాలి. అంతేగాని ఫోనులో, ఐప్యాడ్లో , టీవీలలో బొమ్మలో చూపించి తాగించే ప్రయత్నం చేయద్దు. అది వాళ్ళకి అలవాటయి ముద్దకోసారి ఏదో చూపించి పెట్టె అలవాటు చేస్తున్నారు. డైనింగ్ టేబిల్ దగ్గర బేబీ కుర్చీలో కూర్చోపెట్టి భోజనం పెట్టె అలవాటు చేసి గబా గబా తినిపించాలి. కాస్త తిని మానేస్తే ఇంక తినవా వద్ద తీసైనా అని గంభీరంగా అడిగి ప్లేట్ తీసేయాలి. వాళ్ళకి పిచ్చివేషాలు వేస్తె అమ్మ అన్నం పెట్టదు అని అర్ధమవాలి. మీకేమో పిల్లలు ఏదో లాగా తినాలి హెల్దీగా తయారవ్వాలన్నఆత్రుత. ఎలాగో అలాగా ఎదో కాస్త తినిపిస్తే ఆడుకుంటాడు అనో, ఆఫీస్ టైమ్ అయిపోతుందనో, క్రష్‌లో సరిగా తినడనో, వాళ్ళు ఏది అడిగితె అది చేసేసి అలవాటు చేస్తున్నారు. అపురూపాలు ఎక్కువయి పోయాయి. పెళ్లి అయ్యాక ఐదారేళ్ళకి కంటున్నారు ఒకరిని, డబ్బెక్కువయింది, ముద్దెక్కువయి పిల్లలని పాడుచేస్తున్నారు. తుమ్మితే భయం, దగ్గితే బెంబేలు పడిపోవడం, కాస్త వళ్లు వెచ్చబడితే గాభరా, డాక్టర్ల దగ్గిరికి పరుగులు. మాటలు రాకపోయినాఏడాదినిండిన పిల్లకి, మీగాభరాలు, మీ వీక్‌నెస్సులు, మీ అపురూపాలు అన్ని అర్ధమవుతాయి. ఎలా మిమ్మల్ని లొంగదీసుకోవాలో అర్ధం అవుతుంది. ఏడ్చి తిండిమానేసి లొంగదీస్తారు. కాస్త పెద్దయిందగ్గరనించి కనిపించిన బొమ్మ అల్లా కావాలంటారు. ఎవరిదగ్గర ఏది కొత్తగా కనిపిస్తే అది కొనాలి. కొందరయితే పిచ్చి అల్లరి చేస్తారు. ఇంట్లో వస్తువులు పాడుచేసి, విరకొట్టి, తోటి పిల్లలని కొట్టి, వాళ్ళచేతుల్లోవి లాక్కోడం. వాళ్ళని చిన్నప్పుడే కంట్రోల్లో పెట్టకపోతే, పెద్ద అయ్యాక ఇంకా దురుసుగా తయారవుతారు. ఆ అనగానే ఆగే భయం ఉండాలి''.

"నిజమే బామ్మా మా ఫ్రెండ్స్ పిల్లలు దభీమని సోఫాలు ఎక్కి గెంతుతుంటే



ఏమనరు పేరెంట్స్. కొత్త సోఫాలు బోలెడు డబ్బు పోసి కొన్నారు, మా లాంటి వాళ్ళు వెడితే వాళ్ళ విద్యలన్ని చూపడానికి మరీ చేస్తారు. వాళ్ళందరిని చూసాక అందుకే పిల్లని కనాలంటే భయం వేస్తుంది'' నిజాయితీగా అన్నాడు చైతన్.

"మీరోజుల్లో ఆలా అల్లరి చేస్తే అంతమందిని ఎలా కంట్రోల్ చేసేవారు బామ్మా చెప్పు''అన్నాడు నిజంగా తెలుసుకోవాలనే.

"ఇంట్లో సమిష్టి కుటుంబాలు, పదిమంది పిల్లలు,వాళ్లలో వాళ్ళు ఆడుకునేవారూ, దెబ్బలాడుకునేవారు, మళ్ళీ కల్సిపోయేవారు. ఆడపిల్లలు అంతా చింతపిక్కలు, గవ్వలు, తొక్కుడుబిళ్లలు ... మగపిల్లలు చెడుగుడు, బంతాటలు, పెరళ్ళలోనో వీధుల్లోనో పరిగెత్తి ఆడేవారు. అసలు అన్నాలు పెట్టాం అని పిలిస్తేనేకాని వచ్చేవారుకాదు. పొద్దుటే స్నానాలు చేయించి తలలు దువ్వేస్తే, చల్ది అన్నాలు పెట్టేస్తే మా పని అయిపోయేది. చిన్నపెద్దపిల్లలు వాళ్ళ ఆటలు పాటలు మరీ చంటి పిల్లలు తప్ప రెండేళ్ల పిల్లలుకూడా వాళ్ళ ఆటలు చూస్తూ కూర్చునేవారు. ఆకలేస్తేనే మా దగ్గర కొచ్చేవారు. దెబ్బలు తగిలించుకుని వస్తే ఇంత టించరు రాసేవాళ్ళం. కంప్లయింట్లు వినేవాళ్ళం కాదు. కల్సి ఆడుకోండి అని చెప్పేవాళ్ళం. పెద్దయ్యాక బడిలో వేసాక ఏంచెప్పేవారో... ఏం చదివేవారో పట్టించుకునేవాళ్ళమేకాదు. అలాపెరిగేవాళ్ళు. మీలా ఈ నాజూకులు అపురూపాలు మేము ఎరగం. తప్పుచేస్తే స్కూల్ అయినా, ఇల్లయినా, రెండు దెబ్బలు వేసేవాళ్ళు తండ్రులు టీచర్లు. ఆ భయ భక్తులు ఎక్కడ ఈనాడు..'' అలా చెప్పుకు పోతుంది అనసూయమ్మ. "అయితే మా పెంపకాలోపమే అంటావా''.

"అవునన్నే అంటాను ప్రేమలు మమకారాలు గుండెల్లో దాచుకుని ఆగు అంటే ఆగాలి. నాన్న ఏమంటాడో, టీచరు చదవకపోతే ఏమంటారో అనే భయం ఉండాలి పిల్లలకి''.

"ఈ జెనరేషన్ పిల్లలు మీ టైమ్ పిల్లల్లా కాదు. వాళ్ళు వయసుకి మించిన నాలెడ్జితో లాపాయింట్లు తీసి వాదించి మనలని వప్పిస్తారు'' అన్నాడు చైతన్య.

"అందుకే మొక్కగా ఉండగానే వంచాలి. మంచిచెడ్డ చెప్పితే ఓహో



అనుకుంటారు. ఇది మంచి అది చెడ్డ ఎలావుండాలో ఎలావుండకూడదో కథల్లా చెపితే వాళ్లలేత మనసుల్లో ముద్ర పడుతుంది. ఇదివరకు పెద్ద వాళ్ళు దగ్గరకూర్చోపెట్టుకుని నీతి కథలు పద్యాలు చెప్పి బోధపరిచేవారు"అంది మనవడిని చూస్తూ.

"అయితే మాదే తప్పు అనితేల్చేసావన్న మాట".

"నిస్సందేహంగా అవునంటాను. ఆ పసిపిల్లలకి చెప్పేవిధంగా చెపితే అర్ధమవుతుంది. చిన్నప్పటి పెంపకం సరిగావుంటే". "ఈ పాఠం గుర్తువుంచు కుంటానులే" నవ్వాడు మనవడు." గుర్తుంచుకోడం కాదు. ఈసారి వచ్చేసరికి ముగ్గురు రావాలి" అంది దబాయింపుగా అనసూయమ్మ.

"బాబోయి టైం లిమిట్లు పెట్టకు" అన్నాడు దండం పెడుతూ.

"మీ ఇష్టం వచ్చినపుడు కార్లు, ఇల్లు, ఫర్నిచర్లు సమకూర్చుకుని కంటాం అంటే ఇదేమి రైస్ కుక్కర్ కాదు అన్నం తయారు అయిపోడానికి. కావలసినపుడు కనడానికి ఇంకా మందులు రాలేదు" అంది.

నవ్వి లేచి లోపలికి వెళ్ళాడు చైతన్య.

బామ్మ కోరిక తీర్చాలనేకాక వాళ్ళకే ఒకటే రొటీన్ ఆఫీస్ పని, వండుకోవడం, తినడం, ఎంతసేపు ఒకరి మొహం ఒకరుతప్ప ఇంట్లో ఇంకో మొహం కనపడక వాళ్ళకి మార్పు కావాలనిపించింది. ఇటు అటు కూడా రెండేళ్లయింది చాలు కనే ఒకర్నో ఇద్దరినో కనేయండి ఆలస్యం చేయకుండా అనే ఒత్తిడి ఫోన్లు వస్తుండడంతో ఏదో ఆపని కానిచ్చేద్దాం అన్న నిర్ణయానికి వచ్చారు చైతన్య దంపతులు.

కానీ వాళ్ళ బామ్మ అన్నట్టు, రైస్ కుక్కర్ స్విచ్ వేసినంత సులువుగా వారు కోరుకున్న వెంటనే కావాలనుకున్నప్పుడు పిల్లలు పుట్టరుఅన్నది తెలిసేసరికి ఏణ్ణర్థం గడిచిపోయింది.

"ఫామిలీ ప్లానింగ్ మాత్రలు పెళ్లయినదగ్గరనించి వాడుతున్నారు కనక మూడునాలుగు నెలలు గ్యాప్ ఇవ్వాలి సిస్టం నార్మలు అయేవరకు. మాత్రలు మానేసినా, ఇతర మెథడ్స్ వాడి, ప్రెగ్నన్సీ రాకుండా చూసుకోండి. తరువాత ఆరు

నెలలోపల ప్రెగ్నెన్సీ రాకపోతే కలవాలి డాక్టర్‌ని. నార్మల్‌గా సంసారం చేసేటప్పుడు ఆరునెలలలోగా గర్భం రావాలి, అలా కాకపోతే టెస్టులు చేస్తాం, రిజల్టు చూసి ఇద్దరిలో లోపాలు గుర్తిస్తాం. ముందు మాత్రలు ఆపేసి నేను చెప్పినట్టు చేయండి. ప్రెగ్నెన్సీ కావాలనుకున్నపుడు డ్రింకులు తాగకండి'' అంటూ అన్ని సవిస్తరంగా భోదపరిచి, నెలలో ఏ డేట్స్ లో ప్రెగ్నెన్సీ ఛాన్సులు ఎక్కువ వుంటాయో అన్ని రాసి భోధపర్చింది డాక్టరమ్మ.

"బాబోయి ఎంత తతంగం పిల్లలు కనడానికి'' భయం నటిస్తూ నవ్వాడు చైతన్య భార్యతో.

"నో డ్రింక్స్ డియర్ లెట్ అజ్ స్టార్ట్ ఫ్రం టుడే''అన్నాడు యుద్ధానికి వెళ్లాడనికి సంసిద్ధుడవుతూ. నవ్వింది భవ్య.

నవ్వినట్టు కాదు పిల్లని కనడం, అంత మీచేతుల్లో ఉన్నట్టు ఉహించుకోకండి, నేనొకడ్ని వున్నా పైన, అన్నట్టు ఆరునెలలు కాదు ఏడాది పైన మూడు నెలలైనా ప్రెగ్నెన్సీ రాకపోయేసరికి, గాభరా, భయం మొదలై డాక్టర్ దగ్గరికిపరిగెట్టారు ఇద్దరు. డాక్టర్ ఇద్దరికీ అన్ని టెస్ట్‌లు చేయించి చావుకబురు చల్లగా చెప్పింది. "స్పెరమ్ మొటిలిటీ తక్కువగా వుంది, కౌంట్ కూడా కొంచెం తక్కువే, అయినా భయంలేదు మందులతో సరిచేయవచ్చు'' అంటూ కొన్ని ఇంజక్షన్‌లు, మందులు రెండు నెలలు వాడి మళ్ళీరండి. ఆవిడకి అన్ని పర్‌ఫెక్ట్ వున్నాయి'' అంది డాక్టర్. చైతన్య మొహం వాడింది.

"మందులతో సరిగా అవుతుందా'' అన్నాడు కలవరంగా. "లెట్ అజ్ వెయిట్ అండ్ సి'' అని ధైర్యం చెప్పి పంపింది. భార్య భర్త ఇద్దరు మాట్లాడుకుని ఎవరితో ఏంచెప్పద్దు చూద్దాం అన్న నిర్ణయానికి వచ్చారు.

అనుకున్నవి అనుకున్నట్టు అయితే ఇంకేం అన్నట్టు రిజల్ట్‌లో మొబిలిటీలో తేడాలేదు.

"ఈ ఐటి ఉద్యోగాలొచ్చాక చాలామంది మగాళ్ళకి ఈ ప్రాబ్లెమ్ కనిపిస్తుంది. ఇంకా టైం వేస్ట్ చేయకుండా ఐ.వి ద్వారా ట్రై చేద్దాం. మీరు నిర్ణయం చేసుకుని

చెప్పండి. అదికూడా ఒకసారితో సక్సెస్ అయిపోతుందనుకోవద్దు. రెండుమూడు సార్లు పట్టచ్చు అంటూ మెంటల్‌గా వాళ్ళిద్దరిని ప్రిపేర్ చేసి ప్రొసీజర్ ఖర్చు అన్ని వివరంగా చెప్పింది.

ఖర్చు తలచుకుని గాభరాపడి,పెంచుకుంటేనో అని అలోచించి, వున్న సేవింగ్స్ గోవిందా అయినా సక్సెస్ ఐతేచాలని, కిందామీదపడి ఆలోచించి, ఎవరికీ చెప్పద్దు అని ఆఖరి ఛాన్స్ తీసుకోడానికి నిర్ణయించుకున్నారు భార్యాభర్తలు. భగవంతుడు దయ తల్చినట్టు రెండోసారి సక్సెస్ అయి ప్రెగ్నెన్సీ నిలిచింది. మొత్తానికి ఒక కొడుకు పుట్టి కళ్ళు కాయలు కాచెట్టు ఎదురుచూసిన తాతల్ని అమ్మమ్మని నాయనమ్మని అందిరిని సంతోష పెట్టాడు చైతన్య. ఇదివరకు రోజుల్లో పిల్లలకోసం యజ్ఞాలు చేసేవారు. పాపం చైతన్య కొడుకుకోసం యజ్ఞాన్ని మించిన పనే చేసాడు.

అంత అపురూపంగా, అంత ఖర్చుపెట్టి, కన్నకొడుకుని ఎంత బాగా మామ్మ చెప్పిన పాఠాలు గుర్తుపెట్టుకుని పెంచుతాడో, అయిదేళ్లకి అపురూపంగా పుట్టిన కొడుకుని ఎంత ముద్దు చేస్తాడో తెరమీద చూడాల్సిందే !!!

నెచ్చెలి మాసపత్రిక






# విలువలు తెలిసేది ...



రిజల్ట్ పాజిటివ్... ఒక్క నిమిషం గుండె ఝల్లుమంది. తరువాత నీరసం... వళ్లంతా చెమటలు.. భయం, ఆందోళన.. రిపోర్ట్ కాగితాలు మరోసారి చదువుకున్నా అదే వార్త... అనుమానించిందే, అనుకున్నదే, భయపడించే, అయినా ఏదో చిన్న ఆశ... అయి వుండదేమోలే...

"యిక్కడ మందులవి ఏమన్నా రాస్తారండీ..'' రిపోర్ట్ కాగితాలు యిచ్చిన అతన్ని అడిగాడు రామ్మూర్తి.

"లేదండి. ఎవరైనా డాక్టరుగారికి చూపిస్తే చెపుతారు...'' చాలా బిజీగా వున్నా, అన్నడాబ్బాయి.

కాగితాలు బ్యాగులో పెట్టుకుని నెమ్మదిగా బయటపడి ఆటో ఎక్కారాయన.

ఒంటిగంటన్నరయినా రాని భర్త కోసం ఓ పక్క ఆకలి, 'యింకా రాలేదు ఏమయ్యారు, ఫోను చేసినా నాట్ రీచబుల్ అని వస్తుంది. ఎక్కడున్నారో, ఏమయిందో, నేనూ వస్తానంటే వద్దన్నారు' ఆందోళనగా అనుకుంది సుబ్బలక్ష్మి.

గేటు చప్పుడు విని ఆరాటంగా గుమ్మంలోకి వెళ్లింది. వాడిన మొహంతో నీర్సంగా అడుగు వేసుకుని వస్తున్న రామ్మూర్తి చేతిలో బ్యాగు అందుకోబోయింది. ఆయన... చేయి వెనక్కి లాక్కుని "అడ్డులే .. లోపలికి వెళ్లనీ'' కసిరినట్టే అని, లోపలికి వెళ్లి, మంచినీళ్లియ్యి'' అంటూ గదిలోకి వెళ్లిపోయాడు.

నీళ్లు పట్టుకొచ్చి యివ్వబోతూంటే "అక్కడ పెట్టు. ఇదిగో చూడు, నాకు పాజిటివ్ వచ్చింది. గదిలోకింక రాకు...''

"అదేమిటి... మరి ఎలా?'' ఆందోళనగా అంది సుబ్బలక్ష్మి.

"చెప్పేది విను. నాకు భోజనం, కాఫీ, టిఫిన్ అన్నీ యిక్కడే గుమ్మం దగ్గర



పెట్టు. భోజనం అది యిదిగో యీ ప్లేట్లో పెట్టు. నేనీ గదిలోనే వుండాలి పదిహేను రోజులు'' అంటూ డిస్పోజబుల్ ప్లేట్లు, అవి వున్న పాకెట్టు టేబుల్ మీద పెట్టి "అవి తీసుకో, పది నిమిషాలాగి భోజనం పట్టుకొచ్చి బయట స్టూలువేసి పెట్టి వెళ్లు. ఏం మాట్లాడాలన్నా ఫోనులో మాట్లాడు. అస్తమాను గదివైపు రాకు. నా కాఫీ గ్లాసు అవీ నేను కడుక్కుంటా. మంచినీళ్లు కూడా పట్టుకొచ్చి అన్నీ గుమ్మం దగ్గిరే, నా ప్లేట్లు అవి నేను ఓ బ్యాగులో పడేసి బయట పారేస్తా... అర్థమైందా? యింక వెళ్లు, కాళ్లు చేతులు కడుక్కు వస్తా, అన్నం పట్రా'' తలుపులు వేసుకోబోతూంటే "డాక్టరేమన్నారు? మందులవి చెప్పారా?'' ఆరాటంగా అడిగింది.

"అన్ని ఆయన ఫోనులో చెపితే కొనుక్కు తెచ్చుకున్నా. నాకు కావాల్సిన మందులు, అన్నీ తెచ్చుకున్నా. పదిహేను రోజులు గదిలో వుండి ఎవరితో కలవద్దన్నారు. నీవు ఆ రెండో రూములో పడుకో, మాస్క్ వేసుకో...''

"మరి మీకు నీరసం, జ్వరం... వంటరిగా ఎలా వదిలేయాలి?''

"వదలక ఏం చేస్తావూ? సపర్యలు చేసి నీవూ రోగం తెచ్చుకుంటే మనకి చేసేదెవరు... నీవన్నా ఆరోగ్యంగా వుంటే గదా ఇల్లు నడుస్తుంది. నా సంగతి నేను చూసుకుంటా. నీవు జాగ్రత్తగా వుండు. వూరికే నన్ను విసిగించకు... ఏం కావాలన్నా అస్తమాను పిలవకు. ఫోనులో చెప్పు...'' ఆయన తలుపులు మూస్తూ అన్నారు.

✲ ✲ ✲

"నానీ, నాన్నకి కరోనా పాజిటివ్ వచ్చిందిరా, నాకు కాళ్లు చేతులు ఆడడం లేదు. వంటరిగా నేనేం చెయ్యగలనురా? ఎవరూ ఎవరింటికి రావడానికి లేదు...'' వణుకుతున్న గొంతుతో అమెరికాలో వున్న కొడుక్కి ఫోనుచేసి అంతా చెప్పింది సుబ్బలక్ష్మి. ఒక్క క్షణం అటు నిశ్శబ్దం.

"ఓ గాడ్, సరే అమ్మా! నీవనసరంగా భయపడకు. నాన్నగారు మందులవీ జాగ్రత్తగా వేసుకుంటారు. ఆయన ఆరోగ్యం విషయం ఎప్పుడూ నిర్లక్ష్యం చేయరులే. ఆయన్ని ఆ గదిలో వుండనీ. నాన్న చెప్పినట్టు నీవన్నీ వేళవేళకి అందించు. ఈ రోగానికి దూరం పాటిస్తూ మందులవి వేళకి వేసుకుని, ఆవిరి పట్టి, వేడినీళ్లతో గార్గిల్ చేయడం లాంటివన్నీ చేస్తే తగ్గిపోతుంది. నీవేం గాభరాపడకు, మందులవి



తెచ్చుకున్నారుగా. నీవు జాగ్రత్తగా దూరం వుండు... యిప్పుడెవరూ వచ్చే పరిస్థితి లేదు నీకు తెల్సుగా, జాగ్రత్తగా వుండండి. ఫోను చేస్తాలే రోజూ...'' అంతకంటే చేయగలిగింది ఏముంది అని సుబ్బలక్ష్మి సరిపెట్టుకుంది.

నాలుగు రోజులు వళ్లు నొప్పులు, కాస్త జ్వరం, తలనొప్పి, గొంతునొప్పి... మందుల ప్రభావం అన్నీ కలిసి వేళవేళకింత తిని, మందులేసుకుని, మగతగా పడుకునేవారు. తెల్లారి వేడి నిమ్మకాయనీళ్లు, మరో అరగంటకి కాఫీ, వేళపట్టున టిఫిన్లు, భోజనంలో నోటికి హితవుగా ఆయన చెప్పిన కూరలు. రాత్రి తేలిగ్గా అరిగే భోజనం. వేళవేళకి అందిస్తూ... గుమ్మం ముందు పెట్టి తలుపుతడితే వచ్చి తీసుకోడం. తనెళ్లేవరకు తలుపు తీయకపోవడంతో ఎలా వున్నారో చూద్దామన్నా వీలుకాక "మరేం ఫరవాలేదు. తలుపు తీయండి. నాలుగు రోజులయింది. చూడనీండి కాస్త ఎలా వున్నారో'' సుబ్బలక్ష్మి ఆరాటంగా అన్నా "ఏముంది నా మొహం చూడడానికి. వద్దు. డాక్టరు చెప్పారు...'' అంటూ కొట్టిపారేశాడాయన.

నాలుగో రోజు కాస్త మందులు పనిచేసి జ్వరం, గొంతు, వళ్లునొప్పులు తగ్గి తేలికగా వున్నట్లనిపించింది. మందులు పనిచేశాయి. కాస్త సుళువుగా వుంది'' అన్న ఆయన మాటకే సంతోషపడి, "పోన్లెండి. ఏదో మరో పది రోజులు జాగ్రత్తగా వుంటే సరిపోతుంది.'' నిశ్చింతగా అంది.

మర్నాటికల్లా పూర్తిగా తేరుకున్నట్టు వళ్లు తేలికగా వుండి, శారీరకంగా సరే, మానసికంగా ధైర్యం వచ్చేసింది ఆయనకి. వేడివేడి నీళ్లు పోసుకుని, తిన్న యిడ్లీ రుచికరంగా అనిపించి, మామూలు రొటీనుగా పేపరు చదువుకుని విశ్రాంతిగా టి.వి. చూసుకున్నారు. మనసుకి ప్రశాంతత కుదిరింది. ఫరవాలేదు, ఇంకో పదిరోజులు గడిపేస్తే తగ్గిపోతుంది.

"సుబ్బులూ నాకివాళ బాగుంది. తగ్గిపోయింది... కాస్త పరమాన్నం చేస్తావా, తినాలనుంది...'' సంతోషం ధ్వనించింది ఆయన గొంతు. అది విని సుబ్బలక్ష్మి సంబరంగా "అమ్మయ్య... ఎంత బెంగపడ్డాననుకున్నారు ఈ వారం రోజులు. పాయసం చేసి అమ్మవారికి నైవేద్యం పెడతాను'' అంది.

"తలుపులు తీయకూడదూ. మరీ మొహాలు చూసుకోకుండా..."

"వద్దు... వద్దు... పదిహేను రోజులవరకు జాగ్రత్తగా వుండి, నెగటివ్ వచ్చిందో లేదో టెస్ట్ చేయించుకున్నాక బయటికి వస్తాను. ఇది నీ కోసమేనే. నీకు వస్తే యిల్లెలా గడుస్తుందే..."

"సరేలెండి... మందులు యింకా వేసుకోవాలేమో, అశ్రద్ధ చేయకండి" సుబ్బలక్ష్మి అంది.

✲✲✲

ఆరోగ్యం కాస్త చక్కబడి ప్రశాంతత చిక్కిన దగ్గిరనించి రామ్మూర్తిగారి ఆలోచనలు సుబ్బలక్ష్మి చుట్టూ తిరుగుతున్నాయి. తనకేదన్నా అయితే పాపం దాని గతి ఏమిటి? వట్టి పిచ్చిమొద్దు. దానికి మొగుడు, పిల్లలు, సంసారం తప్ప వేరే ప్రపంచం లేదు. వంటిల్లు, చాకిరీయే దానికి కాలక్షేపం. పెళ్లయిన ఏభై ఏళ్లల్లో మొదటిసారి పెళ్లాం గురించి సానుభూతిగా ఆయన ఆలోచించారు. వేళ వేళకి ఎలా చేసిపెడ్తొందో, కసిరినా, తిట్టినా, కోప్పడినా ఏనాడూ తిరగబడి ఒక్కమాట అన్నది లేదు. తాను లేకపోతే దానికేం తెలుసు? పిల్లలిద్దరూ అమెరికాలో వున్నారు. ఏ అక్కచెల్లెళ్లు, అన్నదమ్ములు సానుభూతి తప్ప ఏం చేస్తారు సాయం... అలా నిద్రపట్టని టైమ్‌లో సుబ్బలక్ష్మి గురించి ఆలోచన మొదలయ్యేది...

"ఏమిటమ్మా, నాన్న మతుండే మాట్లాడుతున్నారా? సుబ్బుల్ని నే పెళ్లిచేసుకోడం ఏమిటి..." ఇంజనీరింగ్ మూడో సంవత్సరం చదువుతున్న రామం తల్లి దగ్గిర ఎగిరిపడ్డాడు.

"ఏమో నాయనా, ఆయనగారికి ఆ మేనకోడలంటే పిచ్చి అభిమానం. ఆ చెల్లెలు, బావ యాక్సిడెంట్లో పోయిందగ్గిరనించి, దిక్కులేనిదని తెచ్చి యింట్లో పెట్టుకున్నారు. సరే, తల్లి తండ్రి లేరు, మామయ్య ఆదుకోవాలి సరే, యింట్లో ఆడపిల్ల లేదు, చేతికిందకి వుంటుందనుకున్నా. యిలా తలమీద ఎక్కిస్తారని నేనెలా అనుకుంటా. ఏదన్నా అంటే నా నోరు మూయిస్తారు. ఎదురుచెప్పే వీలుందా ఆయనకి."



“ఇదిగో యిప్పుడే చెపుతున్నా, ఆ చదువు సంధ్య లేని పల్లెటూరి మొద్దుని నాకంటగడదామని చూస్తే వూరుకోను. నాన్నకెలా చెపుతావో చెప్పు... నాకు బాగా చదువుకుని, ఉద్యోగం చేసే అమ్మాయి కావాలి ?''

ఏడిశాడు, వెర్రివెధవ్వేషాలు వేయద్దను. దానికేం బంగారంలాంటి పిల్ల... ఏం లోటు వచ్చింది? ఆ వూర్లో హైస్కూలు కంటే తను చదువుకోలేదు. పది పాసయింది. యిక్కడ చదివిద్దామంటే పనిపాట నేర్చుకోనీండి అని నీవే కాలేజీలో చేర్పించనియ్యలేదు. కాలొంకరా కన్నొంకరా, ఎంత బుద్ధి, ఎంత వినయం, ఈ కాలం పిల్లల్లా పిచ్చివేషాలున్నాయా? ఎంత ఒద్దికగా పనిపాట చేస్తుంది. వాడికి కాలేజీ అమ్మాయిల మోజులో ఇది కనబడడం లేదు. మొగుడికి, యింటికి, సంసారానికి ఎలాంటి అమ్మాయి వుండాలో వాడికీ వయసులో తెలీదు. యిద్దరూ నోరు మూసుకోండి. నాకు తెలుసు మంచిచెడ్డా...'' గట్టిగా అరిచి వెళ్లిపోయారు అవధానిగారు.

“వాడు చచ్చినా చేసుకోనన్నాడు. తర్వాత మీ యిష్టం'' వర్ధనమ్మ అంతకంటే గట్టిగా అరిచింది వెనకనించి.

“అయితే చదువు మానేసి ఏదో వుద్యోగం చూసుకుని యింట్లోంచి పొమ్మను. నా మాట లెక్కలేనివాడికి నా డబ్బు, ఆస్తి ఏమీ దక్కవని చెప్పు'' బెదిరించాడు. ఉత్తి బెదిరింపు కాదని, ఆ నెల ఇంజనీరింగ్ కాలేజీ హాస్టల్లో వున్నవాడికి డబ్బు పంపడం మానేశాడు ఆయన.

నిజంగానే సుబ్బలక్ష్మి ముద్దబంతి పూవులా వుంటుంది. రంగెక్కువ లేకపోయినా కళగా మొహం, పెద్ద జుత్తు, అన్నింటికంటే వినయం, విధేయత... అన్నీ అవధానిగారికి ఎంతో నచ్చాయి. దాని ఖర్మగాలి తల్లి తండ్రీ యిద్దరూ ఒక్కసారి పల్లెలో వున్న అత్తగారికి వంట్లో బాగులేదని చూడడానికి వెళ్లి, సుబ్బులుకి పరీక్షలు, ఒక్కర్తి వుందని రాత్రికి రాత్రి తిరిగి వస్తూంటే బస్సు బ్రేకులు ఫేలయి, కాలవలో పడిపోయి చాలామందితోపాటు యిద్దరూ ప్రాణాలు పోగొట్టుకున్నారు. ఒక్క పిల్లని ముద్దుగా పెంచుకున్నారు. నాలుగెకరాల పొలం, తల్లి నగలు అన్నీ వున్నాయి. అదేం దిక్కూ దివాణం లేని పిల్లగాదు. మహారాజులా యింకెవరన్నా



చేసుకుంటారు. కాని యింట్లో పెట్టుకున్నాక, మేనకోడలు ఎంతటి బుద్ధిమంతురాలో చూసాక కోడలిగా చేసుకోవాలని నిర్ణయించుకున్నారు అవధానిగారు.

ఆ నిర్ణయానికి తిరుగులేదని కోడలిని చేసుకున్నారు. కొడుకుని బెదిరించి, పెళ్లాం మాట లెక్కచెయ్యకుండా. ఆవిడకి సుబ్బులు మేనకోడలిగా ఏం అభ్యంతరం లేదు. కొడుకుకు నచ్చని పిల్ల కోడలవడం యిష్టం లేదు. కాలేజీలో క్లాస్‌మేట్ వసంత మీద మనసు పడ్డ రామం, చదువు పూర్తికాకుండా, ఉద్యోగం లేకుండా ప్రేమ బయటకు చెప్పే వీలులేక తండ్రి వత్తిడితో నాలుగో ఏడు పరీక్షలవగానే పెళ్లికి తల ఒగ్గక తప్పలేదు. పెళ్లి చేసుకుని ఆ కోపం, నిరాశ అంతా పెళ్లాం మీద చూపించేవాడు. ప్రతిదానికి కసరడం, తిట్టడం, అవమానించడం, నలుగురిలో నానా మాటలు అని చిన్నపుచ్చడం - పాపం సుబ్బులు గుడ్లనీరు కుక్కుకుని లోపలికి వెళ్ళిపోయేది. తండ్రి ఇంట్లో లేని సమయంలో పెళ్లాం మీద ప్రతాపం చూపేవాడు. ప్రేమ లేకపోయినా కాస్తంత అభిమానం కూడా కనపరచని భర్త ప్రవర్తన అర్ధంకాక లోలోపల బాధపడేది కాని, పల్లెత్తి ఒక్కమాట అనలేదు.

పెళ్లి యిష్టం లేని వర్ధనమ్మ కూడా "వరేయ్, యిప్పుడెందువకురా ఆ కోపం, కసుర్లు, తిట్లు. ఏదో పెళ్లి అయింది, సుఖంగా కాపురం చేసుకో. రోజంతా దాన్నెందుకు తిడతావు'' అంది ఆఖరికి ఒక రోజు.

సుఖంగా కాపురం చేయలేదు. మగాడి అవసరంకొద్దీ కాపురం చేసి యిద్దరు పిల్లలని కన్నాడు. అక్కడ వసంత పెళ్లి అయిపోయిందని తెలిశాక కాస్త నిరాశ నిస్పృహ తగ్గినా, సుబ్బుల్ని భార్యగా ఆదరించింది. ఏనాడూ లేదు. పిల్లలు పెద్దవాళ్లవుతున్నారు. తల్లీ, తండ్రీ రెండేళ్ల తేడాలో పోయారు.

కొడుకు పెద్దవాడవుతున్నకొద్దీ తల్లిని తండ్రి ఎంత హీనంగా చూస్తున్నాడో, ఆ కోపం, ఆ అరుపులు, ఆథారిటీ అది చూసి "ఎందుకమ్మా, ఆయన అలా అరుస్తారు అన్నింటికి,'' చిన్నపిల్లలపుడు అనేవాడు కొడుకు.

"ఏదో మీ నాన్నకి కోపం ఎక్కువరా, ఏదో అంటారు. వూరుకోడమే విని'' అని సర్దిచెపుతూ.




"నీవలా వూరుకోబట్టే ఆయన అలా అరుస్తాడు. జవాబివ్వవెందుకు?" ఇంటర్ చదువుతున్న కొడుకు తల్లిని నిలేశాడు ఒకరోజు.

"జవాబిస్తే యింకా అరుస్తారు, వూరుకోడం ఉత్తమం" అంత శాంతంగా అంటున్న తల్లిని వింతగా చూసేవాడు కొడుకు.

"నాన్నా, ఎందుకలా అమ్మమీద అలా అరుస్తారు. నెమ్మదిగా చెప్పకూడదా?" ఒకరోజు ధైర్యం చేసి తండ్రిని నిలేశాడు ఇంజనీరింగ్ చదివే కొడుకు.

రామ్మూర్తి వింతగా చూసి జవాబివ్వడానికి కాస్త తడబడి, "మొద్దుమొహం, ఒక్కటీ సరిగా చేయదు. అరవక ఏం చెయ్యడం?" అన్నాడు చూపు తప్పించి.

"అమ్మ ఏం మొద్దుమొహం కాదు. మాకు చిన్నప్పుడు ఎంత బాగా చదువు చెప్పేది. అమ్మకన్నీ తెలుసు బాగానే, తెలియనివి వుంటే మీరు ఒకసారి చెపితే తెలుస్తుందిగా!" అన్నాడు పంతంగా వాదించి కొడుకు.

"నీ కొడుక్కి అంత ధైర్యం ఎలా వచ్చింది. నామీద నేరాలు చెప్పి వాడ్ని నాకు కాకుండా చేస్తున్నావా?" కొడుకు వెళ్లాక పెళ్లాం మీద హుంకరించాడు తర్వాత.

"నే చెప్పడం ఎందుకు? యింట్లో చూస్తే తెలియదా? వాళ్లేం చిన్నపిల్లలు కారు" సుబ్బలక్ష్మి జవాబిచ్చింది.

"ఓ, తల్లీకొడుకులకి చాలా ధైర్యం వచ్చిందే. మాటకి మాట జవాబిస్తున్నారు." పెళ్లాంమీద ఎగిరినా, యిప్పుడు కొడుకు, కూతురు పెద్దయ్యాక కాస్త తగ్గించుకున్నారు ధోరణి రామ్మూర్తి. వయసుతోపాటు కాస్త ఆ దూకుడు తగ్గింది.

సుబ్బలక్ష్మి నోరెత్తకుండా యింట్లో చేసే చాకిరి, యిల్లు, పిల్లలకి, తనకి ఏది కావాల్సినా వున్నంతలో అమర్చి పెడుతుంటే భార్యపట్ల కాస్త మనసు కరగడం మొదలైంది. రిటైరవడం, అల్లుడు రావడం, కొడుకు ఉద్యోగస్థుడవడం, ఇంటా బయటా అందరూ సుబ్బలక్ష్మి మంచితనాన్ని పొగిడి, యిల్లాలుగా ఆమె దొరకడం తన అదృష్టం అని బంధుజనం అనే మాటలు, సుబ్బలక్ష్మి తననుకున్నట్టు మొద్దు గాదు, చదువులో బాగా చురుకని, పుస్తకాలు బాగా చదివిన జ్ఞానం వుందని, పాట చక్కగా పాడుతుందని, అర్థమైనకొద్ది ఆయనలో ఇదివరకటి చిన్నచూపు

తగ్గి కాస్త ఆమెపట్ల సౌమ్యత మొదలైంది. దానికితోడు కొడుకు పెళ్లయ్యాక కోడలికిచ్చే మర్యాద, గౌరవం, అభిమానం, తనతో సరిసమానంగా చూసే ప్రవర్తన చూశాక, అమెరికా కొడుకు తనని అసలు లెక్కచెయ్యడం మానేసాక, తల్లితోనే మంచిచెడ్డ మాట్లాడుతూ, అభిమానం కనపరచడం. చూసాక, రామ్మూర్తికి తను వంటరివాడి నవుతున్న భావన కలిగాక ప్రవర్తనలో మార్పు రావడం మొదలైంది.

మనవలు పుట్టాక చనువుగా, కలుపుగోలుగా యింట్లో అందరితో మాట్లాడడం, సుబ్బలక్ష్మితో సంప్రతింపులు చేయడం, సలహాలడగడం కాస్త మామూలు భర్తలా మారడం, ఆ మాత్రానికే సుబ్బలక్ష్మి గతం మరిచి భర్తతో ముభావంగా కాక మనసు విప్పి మాట్లాడేది. పిల్లలు అమెరికా వెళ్లాక యిద్దరూ వంటరివాళ్లయి ఒకరికొకరవక తప్పలేదు.

యీ కరోనా వచ్చాక ఆయనలో ఒకరకం భయం, తనకేదన్నా అయితే కొడుకుండీ రాలేడు. దిక్కెవరు, సుబ్బలక్ష్మికేదన్నా అయితే యిల్లు గడిచేదెలా అన్న ఆలోచనలు చుట్టుముట్టసాగాయి. డెబ్బై ఐదేళ్ల వయసులో తనకి భార్య కంటే దిక్కెవరు, ఆమె కంటే ఇంకెవరు అన్న జ్ఞానోదయం కలిగింది ఆయనలో...

***

'చాలా ఆలస్యంగా అయింది నీకు జ్ఞానోదయం నాయనా, ఆ అమాయకు రాలు నిన్ను క్షమించినా, నేను క్షమించలేను' అన్నట్టు దేముడే పెద్దశిక్ష వేశాడు ఆయనకి.

తెల్లారి ఆరుగంటలకల్లా నిమ్మకాయ వేడినీళ్లు తెచ్చే భార్య ఆరున్నర అవుతున్నా లేపకపోయేసరికి, ఫోను చేసినా తీయకపోవడంతో తలుపు తీసుకుని బయటికి వచ్చిన ఆయన భార్యని శవంగా చూడాల్సి వస్తుందని కలలో కూడా అనుకోని ఆయన స్థాణువైపోయారు. మనిషి నిలువెల్లా వణికిపోయారు.

"నానీ, మీ అమ్మ... మీ అమ్మ యింక లేదురా..." నిలువెల్లా వణికిపోవూ రుద్ధకంఠంతో ఫోనులో అన్నారు.

ఒక్క క్షణం అటు నిశ్శబ్దం. తరువాత "అమ్మా!" అన్న కేక, "ఏమయింది అమ్మకి... ఎలా... ?"

"తెలీదురా, రాత్రి ఎప్పుడు జరిగిందో... తెల్లారి చూస్తే... అంబులెన్స్ పిలిస్తే అప్పటికే ప్రాణం లేదన్నారు... ఇరుగుపొరుగు ఎవరూ తొంగిచూడనన్నా లేదు. నేను ఒక్కడిని... ఏం చెయ్యను... నేనేం చెయ్యాలి... యింత దగా చేస్తుందని..." బావురుమన్నాదాయన.

"సుఖపడింది." వినిపించీ వినపడనట్టు గొణిగాడు కొడుకు. "ఏం చేస్తారు? మేము రాలేము, కొడుకుగా అమ్మకి తలకొరివి పెట్టే అదృష్టం నాకు లేదు. ఫ్లయిట్‌లు లేవని తెలుసుగా.. మీరే ఎలాగో అగ్నిసంస్కారం చేయండి. ఇక్కడ నేను తెల్సిన పురోహితుడున్నాడు. మిగతా కార్యక్రమాలు చేసే ప్రయత్నం చేస్తాను.. కొడుకు ఫోన్ పెట్టేశాడు.

ఆ తెల్లారిన ఉదయంలో తన బతుకే తెల్లారిపోతుందని గుర్తెరగని రామ్మూర్తిగారు వంటరిగా భార్య తమం దగ్గర కూర్చుని "ఏమిటే యిలా చేశావు? నేను ఏం చెయ్యాలి, యిలా వదిలి వెళ్లిపోయావేమిటి... చెప్పవైనా చెప్పకుండా యిలా దగా చేశావేమిటే..."

"వదిలిపోవాలని, పోతానని సుబ్బులేనాడు అనుకోలేదు. మూడు నాలుగు రోజులుగా కాస్త నలతగా వుంటే మూడు నెలలుగా పనిమనిషి లేదు, ఇంటెడు చాకిరి, వంట, ఆయనకి వేళవేళలకి అన్నీ అందించడం అలసట అనుకుంది. నడిస్తే, పనిచేస్తే ఆయాసం అనిపించినా అదంతా పని ఎక్కువై అనుకుంది. అంతకుముందే నాలుగైదు రోజులుగా నిశ్శబ్దంగా శరీరంలోకి ప్రవేశించిన కరోనా సుబ్బలక్ష్మికి కాస్త అనుమానం వచ్చేసరికే చేరాల్సిన చోటికి చేరిందని, మందులవి వేసుకోకపోవడంతో విజృంభించి చుట్టుముట్టింది. ఇంకో రెండు రోజుల్లో ఆయన టెస్ట్ అయి బాగయిందంటే అపుడు చెపుదాం. యిప్పుడు తను చెపితే భయపడతారు. తను మంచం ఎక్కితే యిన్నాళ్లు పడిన శ్రమ వృధా... ఓ రెండు రోజులు

ఓర్చుకుందాం అనుకుంది. అనుకున్నవి జరగడం మనిషి చేతిలో లేదని సుబ్బులుకి తెలియకుండానే జరగాల్సింది జరిగింది.

భార్య, తన తోడునీడ అని తెలుసుకునేవేళకి యిదే నీ శిక్ష అన్నట్టు దేముడు నిర్ణయం... "ఏమిటే, ఎలాగే, వంటరిగా నేనెలా బతకాలే... నన్నిలా వదిలి వెళ్లిపోయావేమిటే..." భార్య గుండెలమీద చిన్నపిల్లాడిలా వెక్కుతూ ఏడ్చారు రామ్మూర్తి - అంబులెన్స్ వచ్చేవరకు ఓదార్చేవారే కరవయ్యారు ఆయనకి.





# జీవిత పాఠాలు

విశాలాక్షికి నిన్నటినించి అంటే కూతురు వచ్చిందగ్గరనించి ఒకటే దిగులు, గాబరా పట్టుకుంది. కూతురు వచ్చిందంటే సంతోషించాలి గాని దిగులెందుకు అనకండి మీకు తెలియదు. ఆ కూతురు పెట్టే బేడా పట్టుకుని సామాను సహితంగా వచ్చిందంటే గాబరా ఉండదా ! అందులో ఎంత తిక్కపిల్లో... పిల్లేమిటి, ముప్పై ఏళ్ళు వచ్చినదాన్ని పిల్ల అని ఎలా అంటుంది. చేసుకోక చేసుకోక ఇదివరకయితే అవకతవక అనేవారు ఇపుడు ఆ పదాలు వాడకూడదు అమ్మాయిల దగ్గర. మేం చేసుకోలేదు, అనాలి అంతేగాని అవకపోవడమేమిటి ? మాకేం చదువులు లేవా, సంపాదనలు లేవా ?

అందం మాట ఎవరూ ఇప్పుడెత్తకూడదు. స్మార్ట్ వుంటే చాలు. 'ఏం అబ్బాయిలకి అందాలున్నాయా?' అని వాదిస్తారు.

ఈ రోజుల్లో ఏ మాటైనా అనే ముందు ఆలోచించి అనాలి, కడుపున పుట్టిన పిల్లలనయినా !

సరే ఇదంతా అలా ఉంచి ఎన్ని సంబంధాలు తెచ్చినా తిరగ్గొట్టి "ఇంకా మీరు సంబంధాలు తెచ్చి పెళ్లి చూపులంటూ నన్ను చంపద్దు, నాకు నచ్చినవాడు దొరికితే నేనే చేసుకుంటా !" అని అల్టిమేటం ఇచ్చేసింది.

"ఇంకెప్పుడు? ముప్పై నిండిపోతున్నాయి నీకు. భూప్రపంచంలో ఎవ్వడూ కంటికి ఆనడు" అని కోపగిస్తే, మింగేసేట్టు చూసి జవాబివ్వక్కరలేదన్నట్టు వెళ్లిపోయే, పిల్లని చూసి మనం తలలు బద్దలు కొట్టుకోవాలిగాని దానికి ఏం లెక్క !

తల్లీ తండ్రీ అంటే ఏం లెక్క ! వీళ్ళని కని పెంచి, చదువులు చెప్పించి, ఆడామగా తేడా లేకుండా పెంచినందుకు అనుభవించే రోజులొచ్చాయి. ఏం మా

రోజుల్లో మేమూ చదువుకున్నాం, ఉద్యోగాలు చేసి రిటైర్‌లు కూడా అయ్యేం. కానీ అమ్మానాన్న వెతికి తెచ్చిన వాళ్ళని చేసుకున్నాం. సంసారాలతోపాటు ఉద్యోగాలు చేసాం కానీ, ఈ మిడిసిపాట్లు లేవు. మాకేం తెలీదా? పిల్ల సుఖపడాలని కోరమా? అన్నీ వాళ్ళకే తెలుసు, మేము దద్దమ్మలం, అనే ఇప్పుడు మిడిసిపాట్లు వచ్చి పెట్రేగి పోతున్నారు' అంటూ కూతురుకి ఒకో సంబంధం తిరిగిపోతున్నప్పుడల్లా ఇంట్లో ఓ యుద్ధమే.

అరడజనుసార్లు అయ్యేక, అల్టిమేటం ఇచ్చేసారు. "ఈ ఏడాదిలోగా చేసుకోకపోతే నీ ఇష్టం ! ఇంక తరువాత అడగం. మా ప్లాన్స్ మాకున్నాయి, దేశాలు తిరగాలని, గుళ్ళు గోపురాలు చూడాలని, బంధువులందరినీ చూసి పలక రించాలని, ఇన్నాళ్లు ఉద్యోగ బాధ్యతలయి, కన్నందుకు మీ పెళ్లిళ్లు అయి, మీ బాధ్యతలు అప్పగించి వెళ్లాలనుకున్నాం. అన్నయ్య ఏమనకుండా, మేం తెచ్చిన పిల్లని చేసుకొని ముచ్చటగా ఉన్నాడు. ఆడపిల్లవి నీవేమిటి ఇలా కాల్చుకు తింటున్నావు" అంటూ దెబ్బలాడితే "ఇదిగో అదే... 'ఆడపిల్లవి' అని ఆ మాట అంటే ఊరుకోను" అంటూ ఎగురుడు. చాల్లేక తగ్గిపోవడం తమ వంతు.

టైమ్ వచ్చినట్టుంది. ఎవడినో తీసుకొచ్చి "మేం పెళ్లి చేసుకుంటాం" అంది ఆఖరికి. ఆయన ఈవిడ కొలీగ, యుపిట. ఒకరినొకరు బాగా అర్థం చేసుకున్నారట. ఇద్దరికీ అన్నీ కుదిరాయిట ... అంటే "సరే తల్లీ ! ఎవరో నచ్చి మెచ్చింది అదే చాలు !" అన్నట్టు తలాడించారు ఇద్దరూ.

ముప్ఫైకి చేసుకుంటున్నా సరదాలు ఎందుకు మానుకుంటాం, అని నలభై లక్షలు ఖర్చు పెట్టించి ప్రీవెడ్డింగ్ ఫోటోలు మొదలెట్టి, ఐదు రోజులు మెహందీలు, బ్యాచిలర్ పార్టీ, పెళ్లి, రిసెప్షన్, ఫైవ్‌స్టార్ హోటల్ ఫస్ట్‌నైట్, అన్ని ముచ్చట్లు జరిపించుకున్నారు. డబ్బు పోతేపోయింది గానీ, అమ్మాయి కదిలి కాపురానికి వెళ్ళింది, అంతే చాలు అని సంబరపడి, ఓ ఆరునెలలు అమెరికాలో బంధువుల్ని, ప్రదేశాల చుట్టి వచ్చి, గుళ్లూ గోపురాలు, విహారయాత్రలు చేసి ఒళ్ళు, పర్సులు నీరసపడి ఇల్లుచేరి సేద తీరేసరికి అమ్మాయి బౌల్ చేసిన బంతిలా ఇంట్లోకి వచ్చిపడింది.

"నన్నేం అడక్కు. నా మొగుడి గురించి, మా ఇద్దరికీ ఇంక సరిపోదు, కలిసి ఉండలేం అంతే !" కుండ బద్దలు కొట్టింది కూతురు.

"అదేమిటి, ఇద్దరికీ నచ్చి కదా చేసుకున్నారు పెళ్లి. అందులో ఆరునెలలు కలిసి తిరిగాక కదా నిర్ణయించుకున్నారు" తల్లి నిలేసింది కోపంగా. "ఇదేమి బొమ్మల పెళ్ళనుకున్నావా ? నాలుగురోజుల ముచ్చట తీర్చుకు వచ్చేయడానికి. ఏం జరిగిందో చెప్పు !"

"చెప్పడానికి ఏమీలేదు. ఈ మగాళ్లు పెళ్ళికి ముందు ఒకలా, పెళ్లయ్యాక ఒకలా ఉంటారని తెలియక మోసపోయా" రుస రుసలాడుతూ అంది తల్లి మీద చిరాకు చూపిస్తూ.

"లేకపోతే డ్యూయెట్లు పాడుతూ పెళ్ళికి ముందు తిరిగినట్టు, నీ చుట్టూ నీ కొంగు పట్టుకు ఎల్లకాలం తిరుగుతాడా ! బుద్ధి జ్ఞానం లేదా ? ఇన్నేళ్ళొచ్చాయి, ఇంత చదువుకుని ప్రపంచజ్ఞానం లేని చంటిపిల్లలా మాట్లాడడానికి ? డ్యూయెట్లు పాడుకుంటూ తిరిగితే, కడుపులు నింపడానికి, వేళవేళలా అమ్మలెవరూ వండి పెట్టడానికి ఉండరు. సంపాదించాలి, డబ్బులు తేవాలి. వండుకు తినాలి, ఆర్డర్ కొట్టి దేనికయినా డబ్బులుండాలి అని తెలుసుకో !" విశాలాక్షి కోపం పట్టలేక అరిచింది. "ఏదో చేసుకుని ఉద్ధరించావని సంతోషించినంత సేపు లేదు నీ కాపురం, అతన్నీ ఇలాగే బాధపెట్టి ఏదో అంటుంటే పోతే పో అని ఉంటాడు. నీది అతితెలివో, తెలియనితనమో అర్థం కావడం లేదు నాకు. నిన్ను భరించడం ఇంక కన్నవాళ్ళకి లేదు. కట్టుకున్నవాడికీ ఉండదని తేలిపోయింది. ఇంక చేస్తావో చేసుకో !" ఓ నమస్కారం పెట్టి లేచి వెళ్ళిపోయింది ఆ కన్నతల్లి.

చూడండి ! అమ్మలాగే మీరూ వినకుండానే తప్పు నాదే అంటారా?" నిలేసింది ముభావంగా చూసీ చూడనట్టు తల పేపర్లోకి దూర్చుకు కూచున్న తండ్రిని చూసి కూతురు.

తప్పు మాది. నిన్ను కని, ముద్దుగా పెంచి, ఆడినట్టు ఆడి, చదువుతా నన్నంతవరకూ చదివించి, ఆర్థిక స్వతంత్రం ఉండాలని ఆదర్శాలు వల్లిస్తూ నిన్ను

ఉద్యోగం చేయించి, ఏదో మంచివాడిని చూసి ఇద్దరూ సంపాదించుకుంటూ ఒకరి కొకరుగా నిలిస్తే మా బాధ్యత తీరిపోతుంది అని వెర్రికలలు కన్నాం చూడు అది మా తప్పు'' తండ్రి పేపర్లోనించి తలెత్తకుండానే ఏ గోడకో చెప్పినట్టు అన్నాడు.

అసలు ఏం జరిగిందో వినకుండానే, కూతురు తిరిగివచ్చి భారమై పోయిందని మీ బాధ ... ఇలాంటి తల్లితండ్రులు ఉండబట్టే ఆడవాళ్ళ బతుకులు ఇలా తగలడ్డాయి!'' విసావిసా వెళ్ళిపోయింది.

ఏమి చేద్దాం ? అతనితో ఒకసారి మాట్లాడదామా ? అసలేమైందో కనుక్కుందామా ?'' విశాలాక్షి అంది.

మాట్లాడే బాధ మీకెందుకు ? కట్టుకున్నందుకు నేనే మాట్లాడతా' అని అన్నట్లు అల్లుడే ఫోన్ చేసాడు. ఉపోద్ఘాతాలు ఏమీ లేకుండానే పాయింట్‌కి వచ్చేసాడు. "పెళ్లి అంటే ఇద్దరూ కలిసి ఆనందంగా ఓ ఇల్లు, సంసారం నడుపు కుంటూ, పిల్లల్ని కని జీవితం పంచుకోవడం అనుకున్నా. కానీ రెండునెలలకే మీ అమ్మాయి నా ఊహలు తప్పు అని తేల్చేసింది. సంపాదిస్తున్నందుకు అమ్మాయిలు ఇలా నెత్తికెక్కి ఆడిస్తారనుకోని నాకు మీ అమ్మాయి పెద్ద షాక్ ఇచ్చింది. అన్నిట్లోనూ వాటాలే ! 'చాయ్ నీవు చేసుకో, నీ బట్టలు నీవే ఉతుక్కో, నీకేం కావాలో నీవు వండుకో నాకు తెలీదు, అలిసిపోయాను నాకెపుడూ పని అలవాటు లేదు, 'చేసేద్దూ' అంటూ ముద్దులు గునిస్తే, కొత్తమోజులో పాపం కొత్త అని సరిపెట్టుకున్నా. కానీ అదే రొటీను కంటిన్యూ అయిపోతుందనుకోలేదు. మాటకి మాట రెడీగా ఉంటుంది ఆవిడకి. వాదనకి ఓపిక వుంటుంది పనికి ఉండదు. పెళ్ళికాక ముందు సరే పెళ్లి అయ్యాక కూడా తన ఇల్లు తానే చక్కదిద్దుకోవాలనే తపన నెలలు గడిచినా లేకపోతే, భర్త ఓ మాట అంటే స్త్రీ సమానత్వాలు, ఆత్మాభిమానాలు, అంతా ప్రయోగిస్తూ, "పెళ్ళికి ముందు కాఫీలు అందిస్తారు. ప్రేమగా ఇది ఇది తిను, అది నీకిష్టం అని తినిపిస్తారు. అది బాగుంది. కాదు అంటే, నెక్స్ట్‌డే కళ్ల ముందుకి వచ్చేస్తుంది ఆర్డర్. ఇప్పుడు డబ్బు తగలేసి దూబరా చేసినట్టు కేకలు, ఛ ఈ మొగుళ్ళు ఇంతే, తెలిసి తెలిసి మోసపోయా' అని ఏడుపులు. ఇదంతా నా తప్పులు కింద లెక్క ఒప్పుకున్నా కానీ అమ్మా నాన్నా వస్తే కప్పు టీ చేసి ఇవ్వడం తెలియని చిన్నపిల్లా ! వండి పెడితే, కుర్చీలో మామగారెదుట హాఫ్ ప్యాంటు వేసుకుని ఆయనతో కలిసి తినడం స్త్రీ అభ్యుదయం, స్వతంత్రం అనుకోవాలా? ఈపాటికి



మీకర్థమై ఉంటుంది సంగతి. 'అలా పెంచారు మీ అమ్మాయిని' అని నేను అనలేను, చదువుకుని ఉద్యోగం చేసే అత్తగారిని, మీ ఇంటిని చూసాక. సో మీ అమ్మాయి వెర్షన్ నాకు తెలీదు. నా తరఫునించి ఇది. నా ఓపిక అయిపోయింది. బై'' ఫోన్ పెట్టేసాడు అల్లుడు.

"ఏం చేద్దాం?'' అంది విశాలాక్షి తెల్లబడ్డ మొహంతో.

"ఆలోచిద్దాం!'' దీర్ఘంగా నిటూర్పు విడిచి అన్నారు తండ్రి. ఆలోచించారు రాత్రంతా.

***

వారం పది రోజుల్లో ఎప్పటినించో వెళ్లాలనుకున్న యూరోప్ యాత్రకి టికెట్స్ బుక్ చేసుకొని తల్లీతండ్రీ వెళ్లిపోయారు.

తెల్లబోయింది కూతురు. "ఎందుకింత హడావుడి ప్రయాణం కొంప మునిగినట్టు!'' కోపంగా అంది.

"ఎప్పటినించో కొనుక్కున్నాం టికెట్స్.''

"మరి ఇల్లు, నేను ... ఎవరు ఉంటారు ?'' అయోమయంగా చూసింది కూతురు.

"నీవు ఉండు చిన్నపిల్లవా ... పనిమనిషి వస్తుంది పని చేస్తుంది. వండుకోవాలంటే వండుకో ... లేదంటే తెప్పించుకో'' ముభావంగా అని ఇంటి తాళాలు ఒక సెట్ ఇచ్చారు.

***

"ఏమిటండీ, ఇదంతా?'' ప్లేన్ ఎక్కాక సావకాశంగా అడిగింది విశాలాక్షి. భర్త ఏదో ఆలోచించే ఇదంతా ప్లాన్ చేసాడని తెలిసినా మంచికే అని తెలిసేటప్పటికి మాట్లాడలేదు.

"దానికి మనం ఎంత చెప్పినా అర్థం చేసుకోదు. థియరీ లాభం లేదు, ప్రాక్టికల్స్ కావాలని. దానికి ఇల్లు, బాధ్యతలు, కష్టసుఖాలు, డబ్బు విలువ భర్తంటే ఏమిటో తెలిసి రావాలి'' పేపర్ తెరిచేరు. ఇంకా ఏదో అడగాలని, భర్త గంభీర ముఖం చూసి, పక్కన మనిషి వచ్చి కూర్చోవడం చూసి ఊరుకుంది.

ఇరవై ఐదు రోజులు గడిచాయి. సరదాగా చూడాల్సినవి అన్నీ చూసారు. ఒక్కసారి కూడా కూతురికి ఫోన్ చేయలేదు. "దానికి ఒక్కసారి ఫోన్ చేస్తానండీ! ఎలా ఉందో, ఏం చేస్తోందో ? తల్లి మనసు గొణిగింది.

"వద్దు, అది చేసిందా మనకు? ఈ మమకారాలు, సెంటిమెంట్స్ అన్నీ తగ్గించుకోవాలి మనం. అందుకే లోకువ చేసి ఆడిస్తోంది. తనకి కావలసింది మన చాకిరీ, డబ్బు తనకే ఉంది. చిరకాలం ఎవరూ కూర్చోపెట్టి చేయరు అని తెలియాలి ముందు. డబ్బు ఉంటే చాలు అన్నీ గుమ్మంలోకి వస్తాయి అనుకుంటోంది. డబ్బుతో కొనలేనివి కూడా ఉంటాయని తెలియాలి" సీరియస్‌గా అన్నారాయన.

ఈసారి భర్త కూతురిని క్షమించలేదని అర్థమై ఊరుకుంది ఆవిడ.

ఇంకో రెండు రోజుల్లో బయలుదేరుతారనగా ఫోన్ వచ్చింది. ఎవరిదో కొత్త నంబర్. మాట్లాడింది ఎవరో పోలీస్ ఆఫీసర్. ఆందోళనగా "ఎస్" అన్నారు మూర్తి. ఆయన చెప్పింది విన్నాక ముఖం పాలిపోయింది. మీ కారుకి యాక్సిడెంట్ అయిందని, అందులో ఉన్న స్త్రీకి బాగా దెబ్బలు తగిలాయని, స్పృహ తప్పిన ఆమె హాస్పిటల్లో జాయిన్ చేసి, కారు లైసెన్స్ నెంబర్ ద్వారా అడ్రస్, ఫోన్ నెంబర్ పట్టుకుని ఫోన్ చేస్తున్నానని ఆ పోలీసాఫీసర్ చెప్పాడు.

మూర్తిగారు కళ తప్పిన ముఖంతో వివరాలు అడిగి, తాను విదేశాల్లో ఉన్నానని, ఆసుపత్రి వివరాలు, ట్రీట్ చేస్తున్న డాక్టర్ నెంబర్ మెసేజ్ చేసి హెల్ప్ చేయమని కోరారు. మరో అరగంట ఫోన్ మీద గడిపి కూతురికి ప్రాణాపాయం లేదని, ట్రీట్‌మెంట్ ఇస్తున్నారని, కుడికాలు, ఎడమ చేయి ఫ్రాక్చర్ అయ్యాయని, ముఖంమీద, శరీరంలో చాలా చోట్ల చిన్నదెబ్బలు అని చెప్పారు డాక్టర్.

తాము వచ్చేవరకూ కొన్నాళ్ళు అక్కడే ఉంచి ట్రీట్ చేయమని, ఓ ప్రత్యేక నర్సుని కుదర్చమని డబ్బు ట్రాన్స్‌ఫర్ చేస్తానని అన్ని ఏర్పాట్లు చేసి, "ఒక రిక్వెస్ట్" అంటూ తమతో మాట్లాడిన వైనం, తాను అన్ని ఏర్పాట్లూ చేసినట్టు కూతురికి తెలియనీయద్దని, కొన్ని పర్సనల్ ప్రాబ్లమ్స్ ఉన్నాయని రిక్వెస్ట్ చేసారు.

వింటున్న విశాలాక్షి ఆశ్చర్యంగా, అర్థం కానట్టు చూసింది. "టికెట్



మార్చడానికి దొరికితే ప్రయత్నించండి'' అంటూ కళ్ళు తుడుచుకుంది. తల్లి ప్రాణం కూతురు అలా దిక్కూమొక్కూ లేనిదానిలా పడుండడం తట్టుకోలేక.

"దానికేం ప్రమాదం లేదు, భయమేమీ లేదు. వెనకనించి ఎవరో గుద్దారు. చిన్నదెబ్బలే'' అన్నారు ఓదార్పుగా భార్య వంక చూసి.

"అయినా టికెట్ దొరుకుతుందేమో చూడండి. ఊర్లో మీ అత్త కొడుక్కి మనం వచ్చేవరకు దగ్గర ఉండమని చెప్పండి'' ఆదుర్దాగా అంది ఆవిడ.

ఆయన సాలోచనగా "చూడు విశాలా ! దానికి మనుషుల విలువ, తోడన్నవారు లేకుండా, ఆదుకోడానికి నా అన్నవారు లేకపోతే ఎలా ఉంటుందో తెలియచెప్పడానికే ఈ యాక్సిడెంట్ జరిగిందేమో ! మనం ఇంకో మూడురోజులకు గాని వెళ్ళం. అప్పటివరకు రంగాని కూడా దానికి కనపడకుండా అన్నీ చూడమని చెప్పా. అల్లుడిని కూడా మనం వెళ్లేక చెప్పి రమ్మంటా... నర్సుని డబ్బిచ్చి చూడమని చెప్పా. దానికిం ఎవరూ తోడునీడా లేకుండా రోజులన్నీ ఒక్కలాగే గడిచిపోతాయన్న భావం తొలగాలి. నా అన్నవాళ్ళు ప్రతి స్టేజిలో ఉండాలి. దాన్ని కాచుకు చూసేందుకు ఎల్లకాలం ఉండం అన్నది అర్థం కావాలి. మనుషుల మధ్య సత్సంబంధాలు ఎంత అవసరమో ఈ సంఘటన ద్వారా అర్థం అయితేనైనా దానిలో మా వస్తుందేమో! మనం చెడ్డవాళ్ళం అయినా అది బాగుపడితే చాలు ! లోకం, అది కలిపి మనను మనసు బండరాళ్లు అనుకున్నా ఫరవాలేదు. మనం బండరాళ్ళమై ఉలిదెబ్బలు తిన్నా, దానికి కొత్తరూపం వస్తుందేమో ప్రయత్నిద్దాం. కొలిమిలో సమ్మెట దెబ్బలు తిని కొత్తరూపు సృష్టిద్దాం ! ఓ వారం నీ బాధ, ఆవేదన దాచుకో.

ఇది దాన్ని సంస్కరించడానికి దేముడిచ్చిన అవకాశం అనుకో. పక్షులు, జంతువులు ఎగరడం, వేటాడ్డం నేర్వగానే పిల్లల్ని పట్టించుకోడం మానేసినట్టు ఉండడం నేర్చుకోవాలేమో మనిషి కూడా. అప్పటికి కానీ తెలిసిరాదేమో ఈ తరానికి. మనిషి ఒంటరి అవడం శాపం అనుకోవాలి. నీవు ఊరికే బాధపడకు. అర్థంచేసుకో నన్ను'' భార్య భుజం మీద చెయ్యి వేసి లాలనగా అన్నారు మూర్తి.

***



ఐదారు రోజులకి ఇంటికి తిరిగొచ్చేసరికి అప్పటికే కాస్త తేరుకున్న కూతురు భర్తకి ఫోన్‌చేసి రప్పించుకుందన్న విషయం రంగా ద్వారా విన్న మూర్తిగారు సంతోషించి ఆస్పత్రికి బయలుదేరారు.

వెళ్లేసరికి అల్లుడి చేయి పట్టుకు తలగడకు ఆనుకుని కూర్చున్న కూతురు తల్లితండ్రుల్ని చూసి మొహం చిట్లించి భర్త చేయి మరింత గట్టిగా బంధించింది వదలకుండా.

ఆయన భార్య వంక అర్థవంతంగా చూసారు.

**వంశీ కొత్తకథలు - 5 : 2023**



# ఊరికి ఉపకారం

కొడుకుని చూసి తప్పు చేసిన దానిలా, తలదించుకుని కళ్ళు వాల్చింది అన్నపూర్ణమ్మ. మూసిన కళ్ళు నిండుకున్నాయి. అరవింద్ తల్లి చెయ్యిపట్టుకుని "ఏమిటమ్మా, ఎలా వున్నావు ? బాగా నొప్పిగా వుందా'' అనునయంగా అన్నాడు. "నా ఖర్మం నాయనా, యీ వయసులో యిదంతా నా కెందుకురా నాయనా ఈ బాధలు, అవస్థలు. నా బాధ సరే, మిమ్ముల్నందరిని బాధ పెడ్తున్నాను. అంత దూరం నుంచి అన్ని వేలు తగలేసుకుని శ్రమపడి రావడం, మొన్నే వచ్చివెళ్లావు మళ్లీ యిలా.. ఖర్మ. ఇంకా ఆ దేముడికి నా మీద దయలేదు. విలవిలలాడుతూ కన్నీళ్ళు పెట్టుకున్న తల్లిని చూసి బాధపడి అప్పటి వరకు రాత్రికి రాత్రి హఠాత్తుగా ప్రయాణం అయి వచ్చిన చిరాకు, అసహనం పోయి జాలిగా చూశాడు. ఎనభై ఎనిమిదేళ్ల వయసులోతుంటి ఎముక విరిగింది. ఆపరేషన్ తప్పదు. రెండు నెలలన్నా పక్కమీద తప్పదు. డబ్బుంది మనుషుల్ని పెట్టి చేయిస్తారు. కానీ యిక్కడీవిడ యీ పల్లెటూరిలో వంటరిగా, దేశాలవతల మేము ... ఎన్నాళ్లుండగలరు. రెండు నెలల క్రితం వచ్చి వెళ్లాడు. మళ్లీ రావాల్సి వచ్చింది. రేపు ఆపరేషన్ అన్నారు. అరవింద్ తలంతా బరువుగా, ప్రయాణ బడలిక, నిద్రలేమి అన్నీ కలిపి ఆలోచించే స్థితిలో లేకుండా దిగులు, అశాంతి కమ్ముకుంది.

"ఇంటికి వెళ్లి స్నానం, భోజనం చేసి నిద్రపో రేపుపొద్దుటే రా రాత్రికి మన వెంకట్ వున్నాడులే వెళ్లు'' అంది అన్నపూర్ణమ్మ ఆప్యాయంగా చూస్తూ. "సరే అమ్మా పొద్దుటే బయలుదేరి వస్తాను. డాక్టరుతో మాట్లాడాను. నీవు కాస్త తిని నిద్రపో అంటూ పక్కనున్న నర్సుతో 'జాగ్రత్తగా చూసుకో అమ్మా నీ పేరేమిటి' అన్నాడు'. 'సుగుణ' అంది ఆమె. 'మీరేం వర్రీకాకండి నేను చూసుకుంటా' భరోసా

యిచ్చింది. తల్లికి ఇరవై నాలుగు గంటలు తోడుగా వుండేందుకు కుదిర్చిన అమ్మాయి.

"పద నరేష్ వెడదాం. పక్కనున్న చిన్నాన్న కొడుకుని తీసుకుని బయటికి వెళ్లాడు అరవింద్. 'సారీరా, మీ కందరికి ట్రబుల్, యివ్వడం తప్పలేదు. సిటీలో వున్న మీకు యీ ఆస్పత్రి బంధువులు తప్పరు'' కారులో వెడుతూ అన్నాడు.

"అలా మాట్లాడకు అన్నయ్యా. బంధువులన్నది వున్నది యిలాంటప్పుడు కాకపోతే యింకెప్పుడు. పెద్ద దొడ్డమ్మ మమ్మల్నందరిని స్వంత పిల్లల్లాగా చూసేది. ఆవిడకి అవసరం వచ్చినపుడు ఈ మాత్రం అన్నా చెయ్యద్దా'' అన్నాడు నరేష్.

✲✲✲

అంబులెన్స్ పట్నం పొలిమేరలు దాటి పల్లెబాట పట్టింది. ఆపరేషన్ అయి తొమ్మిదో రోజున డిశ్చార్జ్ చేసి, డాక్టరు తీసుకోవలసిన మందులు, ఫిజియోథెరపీలు అన్నీ వివరంగా రాసి యిచ్చాక, ఆస్పత్రివారే ఏర్పాటు చేసిన అంబులెన్స్‌లో నర్సు సుగుణ నెల రోజులు ఇంట్లో వుండే ఏర్పాటులు చేయించుకుని తల్లిని తీసుకుని ఊరు బయలుదేరారు అరవింద్. వెంకట్ అంతకుముందే పందిరి మంచం తీయించి, అస్పత్రి మంచం అద్దెకి తీసుకుని, బెడ్ సోర్స్ రాకుండా వాటర్ బెడ్ వేయించి, కమోడ్ కొని అన్నీ ఏర్పాటులు ఆ పల్లెటూరిలో దొరకవని సమస్త మందులు, యింజక్షన్లు అన్నీ ఏర్పాటు చేసిపెట్టాడు. ఇంకో వారం తర్వాత మళ్లీ వచ్చి చూపించుకోవాలన్నారు. అప్పటి వరకు తనుండక తప్పదు. ఈ లోగా అరుణ వచ్చే ఏర్పాటు చెయ్యాలి. అది మాత్రం ఎన్నాళ్లుంటుందిరా, యీ సుగుణ చూసుకుంటుందిలే' అంది అన్నపూర్ణమ్మ.

ఊర్లో అంబులెన్స్ ప్రవేశించగానే ఊరంతా జనం, ఏమిటో గాభరాగా తిరుగుతూ, పిల్లలు పరిగెడ్తూ.. అంబులెన్స్‌కి అడ్డం పడ్డారు. "ఏమిటి ... ! ఏమైంది..? యీ జనం ఏమిటి వెంకట్'' అరవింద్ ఆశ్చర్యంగా అన్నాడు.

నేనూ పొద్దుటే వచ్చేశాగా తెలియదు. వుండు, అడుగుతా, కిటికీలోంచి తలబయట పెట్టి, నర్సయ్యా ఏమిటి ఏమయింది అన్నాడు వెంకట్.




"తమకి తెల్దాండి. మన సత్తెయ్యి మొత్తం ఫేమిలీ అంతా పురుగులు మందు తిని సచ్చిపోనారండి ...''

"అయ్యెయ్యో, అదేమిటి, ఎప్పుడూ..'' వెంకట్ గాభరాగా అన్నాడు.

"తెల్లారి పొలం ఎల్లడానికి కూలికి వచ్చినవాడు ఎంత పిలిచినా తలుపు తీయకపోతే, తలుపు బద్దలు కొట్టారండి పోలీసులొచ్చారండి.. గోలగోలండి''

"అయ్యో, యింటికెళ్లి అటు వస్తాలే.. అరవింద్ వంక తిరిగి' పాపం సత్తెయ్య మూడేళ్ల బట్టి పంట చేతికందక, అందిన దానికి గిట్టుబాటు ధర పలక్క ఒక ఏడాది పంటెండి, ఇంకో ఏడాది ధాన్యం మొత్తం తడిసి, తెచ్చిన అప్పులకి వడ్డీకూడా కట్టలేక అప్పులపాలయ్యాడు. అప్పు మూడు లక్షలు దాటిపోయిందని డీలాపడిపోయి మరో దారిలేక యింతకి వడిగట్టివుంటాడు.

"ఏమిటి సత్తెయ్యా..అయ్యో అయ్యో.. ఇంత పని చేశాడు'' కలవరపడ్తూ నీర్సంగా అంది అన్నపూర్ణమ్మ.

"మాట్లాడకమ్మా, నీర్సంగా వున్నావు. ఆయాస పడకు యింటికెళ్లాక మాట్లాడుదాం'' అరవింద్ తల్లిని ఆపాడు.

యిల్లు చేరి స్ట్రెచర్‌తో యింట్లో పక్కమీదకి చేర్చారు. నర్సు ఆవిడ తాలూకు వస్తువులు తీసుకుని దిగింది. రూములో నర్సుకి అన్నీ చూపించి, వెయాల్సిన మందుల లిస్ట్, ఆవిడ కాఫీ, ఫలహారాలు, భోజనం టైములు అన్నీ వివరంగా చెప్పి, వంటావిడ కమలమ్మ గారికి అప్ప చెప్పాడు. తమ ఫోను నెంబర్లు, డాక్టరు ఫోను, వెంకట్ ఫోను అన్నీ రాసిచ్చి చెప్పాల్సినవన్నీ చెప్పాడు. నేను చెపుతాలే చేయించుకుంటాలే అంది అన్నపూర్ణమ్మ. బాబూ మేమంతా వున్నాం ఆవిడకేం కావాలో మాకు తెలీదా. మీరేర బెంగపెట్టుకోవద్దు' నాలుగైదేళ్లుగా వున్న వంట ఆవిడ కమలమ్మ గారు, పనిమనిషి సీతలు భరోసా యిచ్చారు. "మీరంతా వున్నారన్న ధీమాతోటే మేం అక్కడ నిశ్చింతగా వున్నాం'' అన్నాడు అరవింద్ అందరిని అభిమానంగా చూస్తూ. బతికినన్నాళ్లు ఆవిడకి ఏ లోటు లేకుండా చూసుకోండి, మీ సంగతి నేను మర్చిపోను' తనూ భరోసా యిచ్చాడు. "ఏమిటోరా నాయనా,



దేముడు మాలాంటి వాళ్లకిలా ఆయుష్షు పెంచేస్తూ పిల్లల్ని దూరం చేసుకున్న మా బతుకులతో ఆడుకుంటున్నాడు. ఒంటరి బతుకులు అయిపోయాయి. అన్న పూర్ణమ్మ కళ్లు వత్తుకుంది.

"సరే, అమ్మా, ఏం చేస్తాం, కాస్త హార్లిక్స్ తాగి విశ్రాంతిగా పడుకో"

"వెంకట్ ఒక్కసారి వెళ్ళి సత్తెయ్య సంగతి కనుక్కురా బాబూ అన్ని విధాల రైతు బతుకులు చితికి పోయాయి, ఏదీ సబ్సిడీ అంటారు. ఏమూలకది. ప్రతి ఏడు ఏదో ఒకటి. వాళ్ల పొట్ట కొట్టడానికి ఆవేదనగా అంది.

"నీవు పడుకో అత్తయ్యా, నేను కనుక్కుంటాలే" వెంకట్ అన్నాడు.

***

"అరవింద్, వెంకట్ కాసేపు మీరిద్దరూ కూర్చోండి. మీతో మాట్లాడాలి" అంది మర్నాడు పొద్దుట పదకొండు గంటల వేళ అన్నపూర్ణమ్మ. నిన్న రాత్రంతా ఆవిడకి నిద్రపట్టలేదు. సత్తెయ్య సంగతి విన్న దగ్గిరనుంచి ఆవిడ మనసు పాడయింది. కళ్లముందు పుట్టి పెరిగినవాడు. వూరంతా ప్రతి గడప, ప్రతి మనిషి ఆవిడకి తెలీని వాళ్లు లేరు. 75 ఏళ్ల అనుబంధం ఊరంతటికి పెద్దమ్మగారే ఆవిడ. ఏ యింట ఆడపిల్ల పెళ్లి జరిగినా పుస్తె, పట్టుచీర పంపాల్సిందే. ఎవరి పొలం ఎక్కడో, ఎంతమంది రైతులో, కుమ్మరులు, వడ్రంగులు, చాకళ్లు ప్రతి వర్గం ఆవిడకి తెలుసు. మామగారి హయాంలో కట్టించిన పెంకుటిల్లు మార్చి కట్టించడం, చిన్న స్కూలు పెట్టించడం, ఊర్లో రామాలయ స్థాపన, ఊరికి తారురోడ్డు, బస్సు ఆగే సౌకర్యం అన్నీ భర్తకాలంలో జరిగి ఆ వూరికి పెద్దదిక్కుగా నిలిచారు. మరుదులు, ఆడపడుచులు పెళ్లిళ్లు శుభకార్యాలు పెద్దక్కగా అన్నీ ఆవిడ చేతిమీద జరిగాయి. ఊరంతా తనదేనన్నట్టు మూడు వేల జనాభాకి ఆవిడ తల్లి అనిపించు కుంది.

"అరవింద్, నేను పోయేలోగా యీ వూరి రైతులకి ఏదన్నా మంచిపని చేసి పోవాలనుందిరా. నా కళ్లెదుట ఎన్ని ఆత్మహత్యలు జరుగుతున్నాయో, కళ్లముందు

 

పుట్టినవారు, చిన్నవాళ్లు, ఎంతో బతుకు వున్నవాళ్లు బలవంతంగా ప్రాణాలు తీసుకుంటున్నారు రా, ఏదన్నా చేసి వాళ్ళను ఆదుకోవాలని వుందిరా''

''అవునమ్మా, నిజమే, కాని మనం ఏం చెయ్యగలం. ప్రభుత్వాలు చెయ్యాల్సిన పనులు, ఒకరా యిద్దరా ఆదుకోడానికి'' అరవింద్ తల్లివంక చూస్తూ అన్నాడు.

“సబ్సిడీలిచ్చామంటారు, ఋణాలిచ్చామంటారు. యిచ్చిన డబ్బులు చాలవు అప్పులు చేస్తున్నారు. విత్తనాల కొరకు, ఎరువుల కొరకు, సకాలంలో వానలు పడవు పంట చేతికి వచ్చే వేళకి వానలు ముంచెత్తి ధాన్యం తడిసిపోతుంది. వడ్డీలు పెరిగి అప్పుల భారం పెరుగుతుంది. పంట చేతికొస్తే దళారులు దోపిడి. గిట్టుబాటు ధర పలకదు, కల్లాంలో వేసిన గింజలు నీళ్లలో తేలిపోతుంటే రైతుల కన్నీళ్లేమో అనిపిస్తుంది. అన్నపూర్ణమ్మ ఆవేదనగా చెప్పుకుపోతుంది.

“అరవింద్, ఒక రైతుగా నాకు ఈ బాధలన్నీ తెలుసు. కాని నీవన్నట్టు మనలాంటి వారం, ఏం చెయ్యగలం'' వెంకట్ అన్నాడు.

“అందుకేరా, నే పోయేలోగా వాళ్లకి పండినపంట దాచుకోడానికి ఒక గోడౌన్ కట్టించి ఇవ్వాలని వుంది, ఏదో దేముడు దయవల్ల మీ యిద్దరూ చక్కగా పైకి వచ్చి అమెరికాలో ఆర్జించుకుంటున్నారు. నా డబ్బు....

“ఏమిటత్తయ్యా వందో రెండొందలా బస్తాలా దాచుకోడానికి, చిన్న గోడౌన్ కట్టించడానికి వూరందరి పంట, పదివేల బస్తాలన్నా వుంటాయి కనీసం తెలుసా అడ్డుకుని అన్నాడు వెంకట్.

“అవును నాకు తెలుసు, అందుకే వూర్లో రైతుల పంటలెక్కతీయి, సరిపోయేట్టు కట్టిద్దాం' ఆశగా చూసింది.

“గోడౌన్ అంటే స్థలం కావాలి, కట్టడానికి ఖర్చు నీ దగ్గిరున్న డబ్బు సరిపోతుందనుకుంటున్నావా..'' అరవింద్ ప్రశ్నార్థకంగా చూశాడు.

“అదీ ఆలోచించా రాత్రంతా.. డబ్బుసరిపోదు, పొలం కొంత అమ్మాలి, అంతకంటే నీవు వప్పుకుంటే ... ఆరాటంగా చెప్పబోతూ ఆగిందావిడ.

“ఏమిటి చెప్పు, నీ మనసులో మాట చెప్పు' అరవింద్ అన్నాడు.

“అదే పొలం అమ్మడం కంటే వున్న ఐదెకరాలలో మీరిద్దరూ చెరి రెండెకరాలు తీసుకుని ఆ ఎకరం పొలం మనల్ని నమ్ముకొని బతికే మన రైతుకిద్దాం. ఈ యిల్లు పాతబడింది. ఈ వూర్లో అమ్మినా పెద్ద ధరరాదు. మీరా యిక్కడ వుండరు. నా తరువాత ఎలాగో అమ్మిపారేస్తారు. అంచేత యీ యిల్లు రైతులకి పంట దాచుకోడానికిద్దాం. పెద్దకొంప, వరండాలు, అన్ని కలిపి ఎనిమిది గదులు, ధాన్యం కొట్టు అన్నీ కలిపితే పంటంతా దాచుకోవచ్చు. వాళ్లు మనకు స్థలం కొనడం, కట్టించడం శ్రమ, నీవుండవు ఇదంతా ఎవరు చూస్తారు అందుకని యిల్లు యిద్దాం. ఏమంటావు'' ఆశగా చూసింది.

‘అది సరే, యిల్లు యివ్వాలంటే నీ తదనంతరం కదా అదెప్పుడో మనకేం తెలుసు ఏమో యింకా ఏ ఐదారేళ్ల సంగతే అయితే యిప్పటి నించి ఆ ఆలోచన ఎందుకు' తేలిగ్గా కొట్టిపారేసాడు.

“అవునురా నాయనా, ఇంకా నాకు ఎంత ఆయుష్షు పోశాడో ఆ దేముడు అందుకే, నాకోసం ముందు భాగం వంట గది అట్టి పెట్టుకుని మిగతాదంతా వాళ్ళని వాడుకోమందామనుకుంటున్నాను, ఇల్లంతా ఖాళీగా పడుంది గదా''

“అబ్బ నీవుండగానే యిదంతా ఎందుకమ్మా తరువాత చూద్దాం' విసుగ్గా అన్నాడు అరవింద్. యింట్లో ఆ గోలంతా నీవు భరించలేవమ్మా''. “నా చేతులతో వాళ్లకిచ్చిపోతే మంచి పని చేశానన్న తృప్తి దక్కనీరా, నా కళ్ళతో వాళ్ళ కళ్ళలో ఆనందం చూడనీ'' ఇబ్బందిగా వెంకట్ వంక చూశాడు అరవింద్.

“సరేలే అత్తయ్యా అరవింద్ వెళ్లేలోగా చేద్దాం ముందు రైతుల వివరాలు, ఎకరాలు, బస్తాలు యివన్నీ తెలుసుకొని వచ్చి చెప్పుతాలే''

“వెంకట్ అరవింద్ ఉన్నప్పుడే, యిదంతా నీ చేతులమీద నీవే చేసిపెట్టాలి''
‘సరే అత్తయ్యా అలాగే అన్నా కదా'.

✲✲✲




"ఏమిటి అరవింద్ గారు జన్మభూమి పథకాలు ఏవో అమలు చేస్తారని విన్నాను ఊర్లో రైతులందరూ చెప్పుకుంటున్నారు.."

వీధి అరుగుమీద పాతకాలం పడక కుర్చీలో కూర్చుని వెంకట్‌తో మాట్లాడుతుంటే ఆ వూరి ఎమ్మెల్యే సత్యనారాయణ గారు నవ్వుతూ పలకరించారు.

"రండి, కూర్చోండి సార్ మీలాంటి పెద్దలు మా యిల్లు పావనం చేశారంటే..." అరవింద్ నమస్కారం చేశాడు.

"ఆ ... ఊరంతా చెప్తున్నారు. మీరేదో రైతులకి గొప్ప సాయంచెయ్యడానికి నడుం కట్టారని మా పాలిట దేవత అని అమ్మ గారికి దండాలు పెట్టేస్తున్నారు" కాస్త వ్యంగం జోడించి హాస్యంగా అన్నాడు.

"ఓ అపుడే మీ దాకా వచ్చేసిందా కబురు, ఏం చేస్తాం సార్ తాతలనాటి నించి వూరి మీద వున్న అభిమానం, అనుబంధం, రైతుల కష్టాలు చూసి తోచిన సాయం చెయ్యాలని అమ్మ ఆలోచన. ప్రభుత్వాలు చెయ్యాల్సిన పనులు చేస్తే ఆ ప్రశంసలు మీరే మూటకట్టుకోవచ్చు గదా" అరవింద్ కూడా చురక అంటించాడు నవ్వుతూనే.

"మీకేం సార్, మీ డబ్బు మీ యిష్టం వచ్చినట్టు చేసుకుంటారు. మేమేదన్నా చెయ్యాలంటే ఎన్ని రూల్సు, ఎన్ని లెక్కలు, యిటు ప్రజలు నిలబెట్టి మొహంమీదే దులిపేస్తున్నారు ఏం చేశావని, అటు ప్రభుత్వం లక్ష ప్రశ్నలు గ్రాంటు విడుదల చెయ్యడానికి ... ఎన్ని లెక్కలు అడుగుతారో ..." ఎమ్మెల్యే నిష్ఠూరంగా అన్నాడు.

"నిజమా మరిన్ని లెక్కలు శాంక్షన్లు, పర్మిషన్లువున్నా యింత అవినీతి ఎందుకు జరుగుతుందో" తెలీనట్టే అన్నాడు అరవింద్. మొహం మాడ్చుకున్నాడు. ఎమ్మెల్యే గారు.

"ఏదో మా కష్టాలు మావి. మా గడ్డి మేం తింటాం పని చేయడానికి.. అదంతా వదిలేయండి సార్, ఇల్లేందుకు యివ్వడం సార్ ... మీరలా యివ్వదలచిన డబ్బు యిచ్చేస్తే ఒక్కమాట అమ్మగారి చేత చెప్పిస్తే చందాలెత్తి, ప్రభుత్వం నెత్తిన కూర్చుని మిగతాది తెచ్చి గోడౌన్లు కట్టించేద్దాం సార్ ... అదంతా నే చూసుకుంటా

మీకెందుకు శ్రమ, అమ్మగారలా అందరిని పిలిచి మాట్లాడితే చాలు' ఆశగా, ఆరాటంగా అన్నాడు ఎమ్మెల్యే. వెంకట్ అరవింద్ మొహాలు చూసుకున్నారు.

"సరేలెండి, అమ్మతో మాట్లాడి ఏ సంగతి చెప్పులే"

"ఒక్కసారి లోపలికెళ్లి అమ్మగారి దర్శనం చేసుకుంటా ... మేల్కొనేవున్నారా...

"ఆ, వెంకట్ తీసికెళ్లు అమ్మ దగ్గిరకి" అన్నాడు అరవింద్.

"రైతులకోసం యింత కష్టపడి గోడౌన్ కట్టించాను. యీ వూరి బాగోగులు నావికావా ... అంటూ తనే అంతాచేసినట్టు చూపించుకుంటే ఎలక్షన్ వేళకి చెప్పుకోడానికి ... మన దగ్గిర డబ్బులు వసూలు చేసి, వూర్లో వాళ్ల దగ్గిర చందాలు పోగుచేసి, ఏదో ఎమ్మెల్యే ఫండ్ కింద కొంత లాగి ఏదో కట్టాననిపించుకోడానికి యిదంతా" వెంకట్ అన్నాడు వేళాకోళంగా.

""అంతేనా, ఏదో పోనీ మనం కష్టపడకుండా పని అవుతే అనుకున్నా ..."

"అరవింద్, వద్దురా బాబూ ... యిదంతా అయ్యేపని కాదు, అట్టహాసంగా ఆరంభించి ఫోటోలు, వార్తలు రాయించుకుని తరువాత పట్టించుకోర్రా, వాళ్ల వెనకాల మనం తిరగలేం, పని ఆగిపోవచ్చు, లేక ఏదో ఆషామాషీగా చేసాం అనిపించుకోవచ్చు ... మనకెందుకీ గోల అంతా"

"ఈ యింటిమీద ఆయన కన్నుపడినట్టుంది. మంచిపాతకాలం గట్టి ఇల్లు టేకు దూలాలు తలుపులు, ఎవరికీ అమ్మడం ఎందుకు నేనే కొనేస్తా, ఆ డబ్బుతో గోడౌన్ కట్టించవచ్చు. మీరు మాట్లాడండి పంతులు గారు అని హెడ్మాస్టర్ గారితో అన్నాడట" వెంకట్ అన్నపూర్ణమ్మతో అన్నాడు.

"నాకు తెలుసు ... ఏది జరగనివ్వరు. అరవింద్ మనం ఎవరితో పెట్టుకోవద్దు. నీవుండగా యీ యిల్లు నా తదనంతరం నీకు చెందేట్టు ... అది యీ వూరి రైతులందరికి ఉపయోగపడేట్టు వాడుకోడానికి యిచ్చినట్టు పత్రాలు రాయించి రిజిష్టరు చేయించు" అన్నపూర్ణమ్మ ధృఢంగా అంది.

"మళ్లీ నా పేరెందుకు, రైతుల పేరే యిచ్చేద్దాం. వాళ్లే చూసుకుంటారు'

"వద్దు వద్దు, అలా చేస్తే నేపోగానే వాళ్లకి డబ్బాశ చూపి తలో పదో పదిహేను



వేలు పడేసి యిల్లు లాగేయొచ్చు ఎవరన్నా. నీ పేరవుంటే ఏం చెయ్యలేరు. పదికాలాలపాటు రైతులకి ఉపయోగపడాలని నా ఆలోచన.

తల్లి అన్ని విషయాలు ఎంత అనుభవంతో, ముందాలోచనతో చూస్తుందో చూసి ఆశ్చర్యపడ్డాడు అరవింద్. ఆవిడ మాటా నిజమే.

"వెంకట్ ... యీ పనులన్నీ వాడు వెళ్లేలోగా సంతకాలు పెట్టించి రిజిష్టర్ చేయించే బాధ్యత నీదే. రైతులందరితో మాట్లాడి, అందరి పేర్లు రిజిష్టరులో ఎక్కించి, ఎవరి పంటకి వాళ్లకి నంబర్లిచ్చి, గదులలో దాచుకుని, నమ్మకమైన పెద్ద మనుషులిద్దరు ముగ్గురు, నీవు కమిటి వేసుకోండి. వెనక పాలేరుండే గదిలో ఒక కుటుంబం రాత్రి పగలు కాపలా వుండేట్టు ఆ ఏర్పాట్లన్నీ చూడాలి. ముందు రిజిష్టర్ పని చూడు ...

తల్లి కార్యదక్షతకి విస్తుపోతూ "అమ్మా యీ వూరికి నీవు సర్పంచివయితే బాగుందేమో''. నాకెందుకు రా అవన్నీ, ఏదో దేముడి దయవల్ల భగవంతు డిచ్చిందానితో యీ వూరి వాళ్లకి కాస్త మేలు జరిగితే చాలు అంది తృప్తిగా.

✲ ✲ ✲

"ఏమిటమ్మా, యీ సామాన్లన్నీ యిప్పుడు పంచి పెట్టడం ఏమిటమ్మా, నీ తరువాత మేం ఎలాగూ అమెరికా తీసికెళ్లలేం, యిక్కడే అందరికిపంచుతాం, నీవుండగానే యిచ్చేయమంటావేమిటి' కూతురు అరుణ తల్లిని మందలించింది.

"నీకు తెలీదమ్మా అరుణా, గదులన్నీ ఖాళీ చెయ్యాలి గదా, అటకలనిండా బోలెడు యిత్తడి సామాను, యీ మంచాలు, బీరువాలు, బల్లలు, కుర్చీలు యివన్నీ నేనేం చేసుకుంటా ... నా రోజులు దగ్గిరపడ్డాయని నాకు తెలుస్తుంది. నేనుండగానే నా చేతులతో ఎవరికేం యివ్వాలో యివ్వనీ, మీకేం తెలుస్తుంది యిదంతా. నేపోయాక మీకెక్కడ టైముంటుంది యివన్నీ సర్దడానికి. నాకు ప్రస్తుతం కావాల్సినవి వుంచి, మిగతావి యిచ్చేద్దాం. వెంకట్, నరేష్‌ని కావాల్సినవి తీసుకోమనండి. అటకమీద పెద్ద యిత్తడి సామాను గుడికి అప్పచెపితే వూరంతా కావల్సినపుడు తీసుకునే ఏర్పాటు చేద్దాం. బీరువాలు, బల్లలు, కుర్చీలు లాంటివి స్కూలుకి,

పంచాయతీ ఆఫీసుకి యివ్వండి. రైతులకి, మన కూలీలకి మామూలు వంట సామాను, చిన్న చితకా సామాను, పరుపులు అందరికి పంచి యిద్దాం. నా పట్టు, జరీ చీరలు నీవు, వదిన, వెంకట్, నరేష్ వదినలు ఎవరికి కావల్సినవి వారు తీసుకుని మిగతావి, పూజారి భార్య, స్కూలు మాష్టర్ల భార్యలు, పొలంలో ఆడవాళ్లకి బట్టలు పంచండి. నా దేముడిని నా తదనంతరం గుడికి అప్పజెప్పండి. అప్పగింతలు పెడుతూ అన్నీ వివరించింది అన్నపూర్ణమ్మ కూతురిని కొడుకుని కూర్చోపెట్టుకుని.

"ఏమిటమ్మా, యీ సామాను, తీసిన కొద్దీ వస్తున్నాయి పాతరులా' అలిసిపోతూ అన్నాడు అరవింద్. "మరి నూరేళ్ళ సంసారం సామాన్లు తరాలు వాడుకునేవారు ఇదివరకు. యిప్పటిలా పిల్లలంతా తలో చోటికి పోకుండా అంతా కలిసి వుండేవారు. మీ తాతల దగ్గరనించి పడివున్నాయి. గుండిగలు, గంగాళాలు, ఇత్తడి పాత్రలు వూరంతా పెళ్ళిళ్లకి ఇక్కడ నించే పట్టుకెళ్ళేవారు. ఒక్కో సంతానం పెరుగుతుంటే గదులు పెరిగాయి, సామాను పెరిగింది మరి. ఇంకా మరుదులు, ఆడపడుచులు కొన్ని పట్టుకెళ్లారు. యిప్పుడింక అమెరికా నచ్చాక ఎవరికి కావాలి యివి. అందుకే ఎవరికన్నా యిస్తే సంతోషంగా వాడుకుంటారు.

"అన్నయ్యా, యీ మంచాలు, సోఫాలు, బీరువాలు టేకుకర్రవి. యింకా పాలిష్ మెరుస్తోంది. అమెరికా కాపోతే తీసుకునేవాళ్లం. ఈ రవివర్మ పెయింటింగులు, కొన్ని పాతవాటికి పాలిషింగ్ చేయించితే మనం తీసుకుందాం అలాంటి నాణ్యత ... యిప్పుడు లేనేలేవు అంది అరుణ.

పదిమంది పనివాళ్లు, అరవింద్, అరుణ, వెంకట్ పర్యవేక్షణలో కుర్చీ వేసుకు కూర్చుని ఎవరికేది పంపాలో పంపేసరికి సాయంత్రం అయింది. ఊరంతా వచ్చి తమకి కావల్సినవి పట్టుకుపోతోంటే అన్నపూర్ణమ్మకి తృప్తి అనిపించి సంతోష పడింది.

***

రోజంతా పనిచేసిన అందరూ అలిసిపోయి ఆ రాత్రి గాఢనిద్ర పోయారు. అన్నపూర్ణమ్మ మాత్రం దీర్ఘనిద్రలోకి వెళ్లింది తెల్లవారుఝామున.



"మనం మళ్లీ రావడం యిబ్బందని, తన పనులన్ని చక్కబెట్టుకుని తృప్తిగా, నిశ్చింతగా దాటిపోయింది అమ్మ'' అరుణ కన్నీళ్లు పెట్టుకుంటూ అంది. అరవింద్ తలాడించాడు విషాదంగా.

'మా పెద్దమ్మ, మా అన్నపూర్ణ తల్లి చల్లని తల్లి వెళ్లిపోయింది. ఊరికి పెద్దదిక్కు పోయింది ముందే పోకడ తెల్సినట్టు, వున్నదంతా అందరికి పంచిపెట్టి పోయింది మహాతల్లి'' ఊరంతా కదిలివచ్చి కన్నీరుతో సాగనంపారు ఆవిడని. పెద్దావిడ పెద్దకర్మ రోజున ఊరంతా తరలివచ్చి భోజనం చేసి నివాళులర్పించారు. పంట కల్లంలో వుంది. తనుపోతే గాని యిల్లు ఖాళీ అవదనుకుని వెళ్లిపోయింది మహాతల్లి'' రైతులందరూ కంటనీరు పెట్టారు.

తాళాలు, కాగితాలు, రాతకోతలు, అప్పగింతలు, జాగ్రత్తలు చెప్పి, భారం వెంకట్‌కి అప్పచెప్పి బయలుదేరారు అరవింద్, అరుణ. అమెరికాలో ఎవరిల్లు వారు చేరేసరికి వెంకట్ నుంచి ఫోను. "అరవింద్ నిన్న రాత్రి ఎంతపెద్ద వాన కురిసిం దనుకున్నావు యిక్కడ''

"అయ్యయ్యో మరి ధాన్యాల బస్తాలు, పంట'' ఆరాటంగా అన్నాడు. మొన్నే మీరటు వెళ్లాక రైతులందరూ తమ తమ పంట ఇంట్లోకి చేరేసి, గదులకి తాళం పెట్టారో లేదో అత్తయ్య పైనించి ఆనందభాష్పాలు రాలుస్తున్నట్టు చినుకులతో మొదలై కుంభవృష్టి కురిసింది. ఆవిడ దీవెనలు ఆనందభాష్పాలు కురిసిందనుకున్న రైతుల మొహాల్లో సంతోషం చూడాలి. చల్లని తల్లి మా అన్నపూర్ణ. 'అన్నపూర్ణా ధాన్యాగారం' అని పేరు పెట్టేసుకున్నారు. అందరూ కలిసి ఉద్వేగంతో మాట తడబడ్తూ అన్నాడు వెంకట్.

**విశాలాక్షి కథలు : 2001**






# మాన్ ఈటర్

**మొ**దటి ఆట సినిమాచూసి పాతిక ముప్పైమంది ఇంజనీరింగ్ విద్యార్థులు జట్లు జట్లుగా నడుస్తూ చూసిన సినిమాలో కబుర్లు చెప్పుకుంటూ, నవ్వుకుంటూ పాటలు పాడుకుంటూ వస్తున్నారు. "సాహు" టీ దుకాణం దగ్గరికి వచ్చేసరికి సడన్ బ్రేక్ వేసినట్టు వాళ్ళ కాళ్ళు ఆగిపోయాయి. వాళ్ళ గోలమధ్య కూడా స్పష్టంగా వినిపించిన "గురువారీ" కేకలకి అందరూ ఒక్కసారి నిశబ్దం అయిపోయారు.

"బాబోయ్-అమ్మోయ్-నాన్నోయ్" అంటూ అరుస్తున్న గురువారీ కేకలు వింటూ అందరూ ఒక్కక్షణం తెల్లబోతూ నిలబడ్డారు. ఆ నిశబ్దంలో గురువారీ ఏడుపు, వెక్కిళ్ళు. "వదులు బాబూ, వద్దుబాబూ" అంటున్న మాటలు విన్నారు. ఆ వెంటనే సాహుబండ గొంతు "నోర్మూయ్- ఎందుకలా అరుస్తావు" అని గదమాయించడమూ వినిపించింది,

కొందరు విద్యార్థులు గబగబ అటు వెళ్ళారు. భాషసరిగా అర్థంకాని మూర్తి వెంకట్రావుని "ఏమిటి ?" అని అడిగాడు "గురడవారీని ఆ సాహుగాడు ఏదో చేస్తున్నట్లున్నాడు" అంటూ వెంకట్రావు పరిగెత్తాడు. అందరూ సాహు గుడిసె దగ్గరకివెళ్ళి రేకుల తలుపు బాదారు. లోపల ఒక్కసారిగా నిశ్శబ్దం అయింది.

"అరేయి, తీస్తున్నావా లేదా తలుపు తీయిముందు" అంటూ వాళ్ళ గ్రూప్ లీడరు నిరంజన్ పాత్రో బూటుకాలితో తలుపులు తన్నాడు,

ఒక్కక్షణం తర్వాత తలుపుదగ్గర "ఏటి బాబూ ఏం కావాలి" అన్న సాహు గొంతు వినిపించింది.

"తలుపుతీయి ముందు" అసహనంగా అరిచాడు శరత్ మిశ్రా. మరోక్షణం పోయాక తలుపు గడియ తీసి అందరిని ఆశ్చర్యంగా చూస్తూ "ఏమిటిబాబూ

యింత రాత్రికాడ వచ్చారు ఏం కావాలి?'' అన్నాడు. వాడిమాటలు వినకుండా "ముందు తలుపుతీయి'' అని గద్దించాడు సతోష్ నందా.

"ఏమిటిబాబూ రాత్రికాడ యీ గొడవ'' అంటున్న సాహుని తోసుకుని నిరంజన్, శరత్ లోపలికి వెళ్ళారు. వాళ్ళవెంట అందరూ లోపలికి జొరబడ్డారు. "మనకెందుకు ఈ గొడవ వెళ్ళిపోదాం'' అన్నాడు మూర్తి వెంకట్రావుతో. మూర్తి క్రొత్తగా వచ్చాడు. అంతా క్రొత్త. భాషరాదు. అన్నింటికి భయం.

"చాల్లే వెళ్ళిపోదామా, పావం గురువారిని యిలావదిలి'' అన్నాడు వెంకట్రావు- ఏమనలేక తనొక్కడూ వెళ్ళిపోతే అంతా ఏమంటారోనని మూర్తి జొరబడ్డాడు గుంపులో.

పాకలో మధ్యగా నులకమంచం వుంది. కుళ్ళుబొంత, కుళ్ళుదుప్పటి రేగి అడ్డదిడ్డంగా పడివున్నాయి. పాకలో ఓ రాటని కరుచుకుని పిల్లినోటి నించి తప్పించు కుని బయటపడిన చిన్న గోరంకలా వణికిపోతూ నిల్చుంది గురువారీ. ఆ పిల్లవళ్ళంతా చెమట పట్టేసింది. తలంతా రేగివుంది. మొహం అంతా కందగడ్డలావుంది. భయంతో వణికిపోతూ వెక్కివెక్కి ఏడుస్తాంది.

ఆ వాతావరణం చూడగానే అందరికి సంగతి అర్థంఅయింది. లోపలికి తోసుకొచ్చిన అందరిని చూసి'' ఏమిటి బాబూ యిది'' అన్నాడు కోపంగా సాహు.

"ఏమిట్రా, ఆ పిల్లనేం చేశావు, ఎందుకలా ఏడుస్తుంది గురువారీ ?'' అన్నాడు నిరంజన్. సాహు మొహం సిగ్గుతోనో కోపంతోనో ఎర్రబడింది. కాస్త తడబడి సర్దుకుంటూ "ఏదో మాగోడవ, మీకేం బాబూ'' అన్నాడు.

"నీ గొడవా, ఏమిటిరా నీ గొడవ, ఆపిల్ల ఎందుకలా కేక వేసింది, ఎందుకలా భయపడ్తోంది, చెప్పు, ఏంచేశావు?'' అంటూ హుంకరించాడు సంతోష్.

గురువార్ అందరినీచూసి ఏడుపు యింకా హెచ్చించింది వెక్కుతూ "వీడు... వీడు'' అంది.

"ఆ ... ఏంచేశాడు'' ఆరాటంగా అడిగారు కొందరు. గురువారీ ఏదో అనేలోపలే "నోరుముయ్యి. లోపలికెళ్ళు ముందు'' అంటూ గుడ్లెర్రజేసి కసిరాడు సాహు.



"చెప్పు. ఫరవాలేదు, చెప్పు ..." అన్నాడు నిరంజన్.

ఆడు ... ఆడు ... దొంగనచ్చినోడు, నన్ను ... నన్ను" భోరుమంది గురువారీ అంతకంటె చెప్పలేక.

ఈసారి పూర్తిగా అర్థమయింది. "ఏయ్ సాహు బుద్ధివుందా లేదా నీకు. మనిషివా రాక్షసుడివా, ఆపిల్లా నీకు దొరికింది ... ఆ చిన్నపిల్లలా నీకు ..." తీక్షణంగా అంటూ మీదమీదకి వెళ్ళాడు శరత్. నడ్డిన చేతులుంచుకొని వీరుల్లా నిలబడి తనని దబాయిస్తున్న వాళ్ళందరిని చూసి ఒక్కక్షణం తెల్ల మొఖం వేసినా తరువాత బింకంగా "నా గొడవ మీకెందుకు, దాన్నేంసేస్తే సేత్తాను, ఇది నాసొత్తు. మీరేటి సెప్తారు నాకు" అంటూ నిర్లక్ష్యంగా మాట్లాడాడు సాహు.

"అది నీ సొత్తా, దాని మొగుడి వేమిటిరా నీవు, దానికి తాళిగట్టావా ?" అంటూ రెచ్చిపోయారు ముగ్గురూ. తక్కినవాళ్ళు చోద్యం చూస్తూ నిలబడ్డారు.

"తాళేటి పెళ్ళేటి. అయన్నీ మీకు. మాకేటి, ఏంలేకపోతే రెండొంద లిచ్చి దీన్ని మేపడానికా కొన్నాను."

"రెండొందలిచ్చి కొని, నెలంతా చాకిరి చేయించుకుంటున్నావు. అది చాలక యింకా పట్టుమని పదమూడేళ్ళు లేని పిల్లని నాశనం చేద్దా మనుకున్నావా".

వాళ్ళ ఆరోపణలకి జవాబియ్యాల్సిన అవసరం లేనట్లు సాహు లుంగీ ఎత్తి కడ్తూ "ఎల్లండి బాబు, తీరికూకుని మీ కేల మాగోల-ఎల్లి సదూకోండి".

వాడి నిర్లక్ష్యానికి వాళ్ళందరికి పౌరుషం వచ్చింది. వాళ్ళని, స్టూడెంట్స్‌ని, అందులో ఇంజనీరింగ్ కాలేజీ స్టూడెంట్లని, ఓ టీ కొట్టు వెధవ గడ్డిపోచ చెయ్యని వాడు, వాళ్ళ దయా ధర్మం మీద బ్రతికేవాడు, వాళ్ళకి దండాలు పెడ్తూ వాళ్ళ ప్రాపు కోసం ప్రాకులాడే వెధవ యీనాడు వాళ్ళని తీసిపారేస్తు మాట్లాడుతాడా ! పొరపాటయింది క్షమించండి అనడానికి బదులు మీ కెందుకు నా గొడవ అనేదాకా వచ్చాడా ? అన్యాయాలు ఎక్కడ జరిగినా ఎదుర్కొనడానికి ముందుండే వాళ్ళు ఈనాడు ఓపసిపిల్లకి జరిగే దురన్యాయాన్ని చూస్తూ వూరుకుంటారా !

"ఏమిట్రా కూస్తున్నావు వళ్ళు పొగరెక్కిందా ? మర్యాదగా మాట్లాడటం తెలీదురా రాస్కేల్" సాహు పై గుడ్డ పట్టుకుని లాగుతూ అరిచాడు నిరంజన్,

సాహు అసలే తాగి వున్నాడు. దాంతోడు మంచి గ్రంధంలో వుండగా వచ్చి పాడుచేశారేమో వాడికి తిక్కరేగింది. నిరంజనే చేతినుంచి ఏసురుగా గుడ్డలాక్కుని "ఇదిగో మాటలు మీరకండి. బాబూ నేనెవరితో పడుకోడానికి మీ పర్మిషన్ కావాలా నాకు, నా యిష్టం వచ్చిన లంజతో పడుకొంటాను. దొంగముండా. మళ్ళా నోరెత్తితే సంపేస్తాను. లంజకానా నిన్ను రెండొందలు పెట్టి కొన్నది తిని కూకోబెట్టుకోడాని కనుకొన్నానటే. ఊ ! ఆ ! అన్నావంటే యీసారి మక్కెలిరగతంతాను. సిగ్గునేదే-నో రెట్టి వూరు వాళ్ళందరిని పిలుస్తావా" అంటూ గురువారీ జుట్టు పట్టుకున్నాడు. వాళ్ళమీద చూపలేని కోపాన్ని గురువారీ మీదచూపించి దాని నడ్డివంచి నాలుగు గుద్దులు గుద్దాడు?

అంతే ? అందరికి ఆవేశం వచ్చేసింది. "ఏయ్, ముందాపిల్లను వదులు" అంటూ శరత్ ముందుకు వురికి సాహు మెడ పట్టుకున్నాడు. సాహు వెర్రి ఆవేశంలో "ఎళ్ళండెహే, సూస్తున్నాను ఇందాకాడనించి, నా యింట్లోంచి పోతారా, తన్నమన్నారా, నానసలే మంచోడ్నిగాను, దాని గొడవ మీకెందుకు" అంటూ తాగిన కైపులో దాన్ని, వాళ్ళని కలిపి బండబూతులు తిడ్తూ అందరిని బయటికి నెట్టడానికి ప్రయత్నించాడు.

మీద మీదకి వచ్చి బలంగా తోస్తున్న సాహుని చాచిపెట్టి కొట్టాడు నిరంజన్. సాహు అంతదూరం తుళ్ళిపడ్డాడు. వెంటనే కోపంతో వణుకుతూ లేచి "మిమ్మల్నేం చేస్తానో చూడండి" అంటూ మీదకి వెళ్లాడు.

"ఒరేయ్ చూస్తారేమిటిగా ఆ వెధనని కట్టేయండిరా" అని అరిచాడు సంతోష్. నలుగురైదుగురు సాహుని కదలకుండా బంధించారు. మరికొందరు తాడుకోసం వెదికారు. తాడు కనపడక నులక మంచం తాడు పీకి సాహుని రాటకేసి కట్టేసారు. "నీకింత పొగరెక్కిందిరా, మాకు ఎదురు తిరిగి బ్రతుకగలనను కున్నావా, మేం తలుచుకుంటే ఏం చెయ్యగలమో నీకు తెలియదురా" అంటూ జుట్టు పట్టుకు ఎడా పేడా వాయించాడు పాత్రో.

సాహు తేరుకొని కేకలు పెట్టేసరికి అప్పటికే యీ గలాభాకి ఇరుగు పొరుగు గుడిసె వాళ్ళుచేరి భయంభయంగా చుట్టూచేరి చూడంమినహా ఏమీ చేయలేక

పోయారు. వాళ్ళంతా మాట్లాడటానికి నోరు తెరిచేసరికి జరగాల్సింది అంతా జరిగిపోయింది. గురువారీ మరింత భయంతో బిక్కచచ్చిపోయి గోడకి కరుచుకుని ఓ మూల వుండిపోయింది. గురువారీ కంటే భయంగా మూర్తి ఓ మూల నించున్నాడు, అంతా చూస్తూ.

అంతా అయ్యాక నిరంజన్ ఠీవిగా చేతులు దులుపుకుని జేబులోంచి రుమాలు తీసి మొహం తుడుచుకుంటూ "ఏం సాహు, మళ్ళీ ఆ పిల్లమీద చెయ్యి వేస్తావా, మేం అంటే ఏమిటో తెలిసిందా ? మళ్ళీ ఆ పిల్ల జోలికి వెడితే ప్రాణం తీసేస్తాం ! యీసారి" అన్నాడు. సాహు చూపులకే శక్తి వుంటే వాళ్ళని మాడ్చేసి వుండేవి ఆ చూపులు. "బుద్ధిగా వుండు యింక, ఎప్పుడు ఎదురు చెప్పక. మేం వెళ్ళాక దాన్నేమన్నా చేస్తావేమో జాగ్రత" హెచ్చరించాడు శరత్.

"బాబూ ! ... నేనిక్కడ వుండను బాబూ, మీ రెళ్ళాక ఆడు నన్ను సంపేత్తాడు" అంది గురువారీ భయంగా ఏడుస్తూ.

"అదీ నిజమేరా. ఈ కోపం దానిమీద చూపించి చితకకొడతాడుదాన్ని" అన్నాడు సంతోష్.

"ఏడశాడు మళ్ళీ యింకా తలెత్తుతాడా ?"

"అది సరేకాని దాన్ని చావగొట్టాక మనం ఏంచేసినా ప్రయోజనం ఏమిటి?"

సాహు మాట్లాడకుండా మిర్రిమిర్రి చూస్తున్నాడు. అందరినీ ఎగిసిపడే గుండెలతో వాడి కళ్ళలో క్రౌర్యం చూస్తే తనేమైనా సరే దాన్ని అంత సుళువుగా వదలను అన్న అర్థం కనిపించింది అందరికి. "మరేం చేద్దాం దీన్ని మనమెక్కడికి తీసుకు వెళదాం' సాలోచనగా అన్నాడు నిరంజన్,

"ఒరేయ్ - ఈ రాత్రి యీ పక్కవాళ్ళెవరి గుడిసెలోనన్నా పడుకోమందాం." పాత్రో అన్నాడు.

సాహుకి పోటీగా ప్రక్కనే టీ హొటల్ 'సదానంద్' వాళ్ళ పాపుకోసం ప్రాకులాడుతూంటాడు. అదే మంచి సమయం వాళ్ళని ఆకట్టుకోడానికని గ్రహించి ముందుకువచ్చి "ఆ పిల్లని మా గుడెసెలో పడుకోబెట్టుకొంటాం మరేం భయంలేదు. దాని వంటిమీద యీగ వాలనీయను" అన్నాడు. వాడికి పెళ్లాం పిల్లలున్నారు.



"ఆ ... అలాచేద్దాం. జాగ్రత. వీడేవన్నా గొడవచేస్తే మా హాస్టలుకి వచ్చి చెప్పు" అంటూ ముందుకి కదిలాడు నిరంజన్. అందరూ సాహు వంక గర్వంగా చూస్తూ బయటికి నడిచారు. వెళ్ళేముందర శరత్ సాహు కట్టునిప్పి 'యింక ఏడు' అన్నాడు.

"దొంగలంజా కొడుకు, మనం సమయానికి అడ్డుకోకపోతే పిల్లని నలిపి పారేసేవాడు ... బండవెధవ ..." తనో ఘనకార్యం చేసినట్లు అన్నాడు నిరంజన్.

"ఏమో ఏం చేశాడో, ఏం లేకపోతే ఆ పిల్ల అంతలా ఎందుకు భయపడ్తుంది. జరగాల్సింది జరిగిపోయిందేమో?"

"ఏమో, దొంగ రాస్కేల్. ఏంజేశాడో ఆ పిల్ల కేదన్నా అయితే వాడ్ని బ్రతక నీయను" కోపంగా అన్నాడు నిరంజన్.

వాళ్ళు నిజంగా అన్నంతపని చేస్తారన్న సంగతి తెల్సిన సాహు ఉదయం లేచేసరికి మాయమయిపోయాడు. ఆ వూళ్లో వాళ్ళని కాదని బ్రతకడం కష్టం అని వాళ్లు లేకపోతే ఒక్క క్షణం తన హోటలు నడవదన్న విషయం అర్థం చేసుకుని, యింక అ వూళ్లో బ్రతికేమార్గం లేదనిగ్రహించి విరగ్గా మిగిలిన గిన్నెలు, పాతబడ్డ బట్టలమూట తీసుకొని తెల్లారేసరికి వెళ్ళిపోయాడు. వెళ్ళేముందు సదానంద్ యింటికి వచ్చి గురువారీని లాక్కెళ్ళడానికి ప్రయత్నించాడు. అది ఏడ్చి గోల పెట్టేసరికి సదానంద్ హాస్టలుకి మనిషిని పంపేసరికి భయపడి గురువారిని కసిదీరా కొట్టి బండబూతులు తిడుతూ వెళ్ళాడు.

పీడా పోయింది అనుకున్నారంతా !

సాహుగాడి గొడవవల్ల సదానంద్ హోటలుకి గిరాకీ ఎక్కువయింది. అక్కడికి వెళ్ళే ఆ గ్రూపంతా సదానంద్‌కి ఖాతాదారులయ్యారు. ఓ రెండు రోజులు ఊరుకుని, గురువారీ విషయం ఎవరూ ఎత్తకపోయేసరికి సదానందే ఒకపూట "బాబూ, మరి గురువారీని ఏం చేస్తారు ?" అన్నాడు టీ తాగుతున్న వాళ్ళతో.

సాహు పని చేయించుకుని తిండిపెట్టి యింట్లో వుంచుకునేవాడుగా. నీవూ అలాగే వుంచుకో." అన్నాడు పాత్రో అదో పెద్ద విషయం కాదన్నట్టు.

"నా దగ్గరా ... నాకెందుకు బాబూ, నాకు పెళ్ళాం వుంది. ఎదిగిన పిల్లలున్నారు సాయానికి. యింక యిదెందుకు'' అన్నాడు సదానంద్.

"చచ్చాం. మరెలా ? ... ఎక్కడుంటుంది ?'' నిరంజన్ సాలోచ నగా అన్నాడు.

"మాకెందుకు దాని గొడవ, దాన్నే అడుగు'' అన్నాడు విసుగ్గా మిశ్రా.

"అలాగంటే ఎలా బాబూ అదేం చెపుతుంది. చిన్నగుంట. ఆ సాహుగాడు మీ వల్లేగదా వెళ్ళిపోయాడు. మీరనవసరంగా కల్పించు కోకపోతే అదోపూట, క్రొత్తలో గోలెట్టినా ఆడితో సర్దుకు బ్రతికేది, సిన్నతనంగా, మొదటిసారి క్రొత్తగదా అని గోలెట్టింది. ఆపాటి దానికి మీరు ఆడిని సితకబాదినారు. యిప్పుడు యింక దానికి దిక్కెవరు దానికి మీరుగాక'' అన్నాడు దాని భవిష్యత్తుకి వాళ్ళే జవాబుదారి అన్నట్టు.

అందరూ మొహాలు చూసుకున్నారు. యిదెక్కడి తద్దినం అన్పించింది అందరికి. "ఏమిటిరా బాబూ, యీ గొడవ, నేరకపోయి యిరుక్కున్నాం'' అన్నాడు సంతోష్ ఇంగ్లీషులో. అందరూ కాసేపు కూడబలుక్కున్నాక, సదానంద్‌కి నచ్చచెప్పారు. తామంతా సదానంద్ హొటలుకే వస్తామని ఆశ చూపించి. గురువారిని వుంచుకుని తిండిపెట్టడానికి వప్పించారు. వాళ్ళకి ఎదురుచెప్పే ధైర్యంలేక, ఎదురుచెప్పి బ్రతకలేనన్న భయంతో ఆఖరికి నసుగుతూనే అంగీకరించాడు సదానంద్.

వాళ్ళందరికి గురువారీ ఏమవుతుంది ? దానిమీద యింత అభిమానం ఇంటరెస్ట్ ఎందురో, వాళ్లకి దానికి ఏమిటి సంబంధం అని ఎవరన్నా అడిగితే ఏంలేదు అనే జవాబు చెప్పాలి. ఓ ముక్కూ మొహం తెలియని పనిపిల్ల మీద, కొండలలో పుట్టిపెరిగిన ఆ పిల్ల మీద వాళ్ళకి అభిమానం ఎందుకు అంటే. వాళ్ల గురించీ వాళ్ల చుట్టుపక్కల వాతావరణం గురించీ చెప్తే కొంత అర్ధం అవచ్చు.

✲ ✲ ✲

ఆ వూర్లో యింజనీరింగ్ కాలేజీ పెట్టాలన్న ఆలోచన వచ్చిన మహానుభావులు ఎవరోగాని, వాళ్ళని ఆ స్టూడెంట్సు తిట్టని రోజులేదు. యింకెక్కడా చోటు లేనట్టు ఎంచి ఎంచి మా ప్రాణాల మీదకి యిక్కడే పెట్టాలా అని రోజుకో సారన్నా అందరూ ఏడ్చుకునేవారు.




ఆ వూరు. వూరేమిటి అదో ఆఫీషల్ కాలనీ. అక్కడొక డామ్. డామ్ సిబ్బంది, ఓ యింజనీరింగ్ కాలేజి, మెడికల్ కాలేజి వున్నాయి. ఆ కాలేజిలో పనిచేసే మనుషులు మాత్రం వుంటారు. యీ మాత్రం మనుష్యులున్నారు కనక ఓ చిన్న బజారులాంటిది తప్పదుగదా! ఆ వూరికి చాల్లే అన్నట్టు కనిపించీ వినిపించని రేకుల షెడ్డు సినిమాహాలు ఒకటి, నాలుగైదు పాక టీ హెూటళ్లు, ఓ నాలుగు బట్టల దుకాణాలు, మరో నాలుగు పచారీ దుకాణాలు, ఓ రెండు ఫ్యాన్సీ షాపులు, ఓ బస్టాండ్ - యిదీ ఆ వూరు.

అందులో ఇంజనీరింగు కాలేజి వూరి చివర్న వుందేమో, ఎటు చూసినా వినీలాకాశం తప్ప మరోటి కనిపించక, ఎంతసేపు స్టూడెంట్స్ ఒకరి మొహాలు ఒకరు చూసుకుంటూ ఏం చెయ్యడానికి తోచనప్పుడల్లా అక్కడ కాలేజి పెట్టిన వాళ్ళని తిట్టుకునేవారు.

ఉదయం ఏడుకి లేచిందగ్గరనించి కాలేజికి పరిగెత్తడం, క్లాసులు వగైరాలతో ఉదయంపూట అందరికి ఏదో విధంగా గడిచిపోతుంది. ఎటొచ్చి వాళ్ళ అవస్థంతా సాయంత్రం ఐదునుంచి తొమ్మిదివరకు. ఎక్కడికి వెళ్ళడానికి ఏం చెయడానికి తోచక పిచ్చెత్తి పోయేవారు. అక్కడికి సాయంత్రం కాలేజినించి వచ్చి కాస్త రెస్టు తీసుకుని స్నానాలుచేసి, ముస్తాబయి, హాస్టలుకి ఎదురుగా వుండే పాక టీ హెూటళ్ళలో రసగుల్లాలు, సింగడాలుతిని, టీ తాగి అక్కడ నించి జట్లు జట్లుగా రోడ్డున పడి బజారుదాకా వెళ్లేవారు. రోడ్డంటె రోడ్డే తప్ప మనుష్యులు మాత్రం కనిపించరు. కనిపించినా ఏ ఆఫీసర్ల బంట్రోతులో ! అలా షికారుకి వెళ్ళే త్రోవలో డామ్ ఇంజనీర్ల బంగళాలు దాటుత్తూ ఏ బంగాళానించన్నా ఏ అందమైన ఆవిడో కనిపించితే కన్నుల పండుగ అయినట్లు వీక్షిస్తూ, కామెంట్లు చేసుకుంటూ జోకులు విసురుకుంటూ, తుళ్లుకుంటూ నవ్వుకుంటూ నడిచి బజారు చేరేవారు. అక్కడికి చేరాక హమ్మయ్య యిదీ ఒక వూరే. స్మశానంకాదనిపించేది వాళ్లకి. దానికి నిదర్శనంగా బస్సుల రొద, టాక్సీల హారన్లు, రేకులషెడ్డు సినిమావాడు అదరగొట్టే రికార్డుల మోత, కాకా హెూటళ్లనించి వచ్చే పకోడీల వాసన, బజారుకి ఏదన్నా కొనుక్కోడానికి వచ్చే మనుష్యులు కళ్ళపడగానే వాళ్లకి ప్రాణం లేచివస్తుంది. అక్కడ

నిలబడి జనాన్ని చూడడం, లేకపోతే సినిమా మారితే అదెంత చెత్తయినా, కనిపించకపోయినా, వినిపించకపోయినా మూడు గంటల కాలక్షేపానికి దాన్లో దూరేవాళ్ళు. అదీ లేకపోతే ఏ హోటలులోనో దూరి ఏదో తింటూ కబుర్లు చెప్పుకుంటూ గంటల కొద్ది గడిపేవారు. ఏ ఏడుగంటలకో తప్పదురా భగవంతుడా అన్నట్టు కాళ్లీడ్చుకుంటూ హాస్టల్ మొఖం పట్టేవారు.

అక్కడికి పదిమైళ్ళున్న టౌనుకి సినిమాకి ఆదివారం ఆదివారం వెళ్లడం వాళ్ళకున్న ఏకైక కాలక్షేపం ! ఆ సినిమాకి వెళ్ళడానికి ఆ వూరికి, టౌనుకి మధ్య తిరిగే టౌనుబస్సులో టాపుమీద కూడా ఎక్కి, టిక్కట్లు యివ్వకుండా ప్రయాణం చెయ్యడం ఏ కండక్టరన్న వాళ్ల సంగతి తెలియని వాడు-ఏనాడన్న టిక్కట్టు లేదని గొడవ పెడితే వాడిని తన్నడం. దాంతో బస్సు బందయి పోవడం, మళ్ళీబస్సులు నడపడం లేదని గోలచేసి ఎటునించీ ఏ బస్సు వెళ్ళనియకుండ కాపుకాసి అల్లరిపెట్టి మళ్లీ సాధించడం వాళ్ల ముఖ్యమైన ఎడ్వంచర్.

అక్కడికి నూరు మైళ్లున్న సిటీకి కొత్త సినిమా రిలీజయిందన్నది తెలిస్తేచాలు కనీసం ఓ వందమంది బయలుదేరి యిటునించి బయలుదేరే ప్యాసింజర్‌కు వెళ్లి మొదటి ఆట మ్యాటినీ చూసి తెల్లవారి వచ్చే రైలులో టిక్కట్లు లేకుండా ఫస్టు క్లాసులో ప్రయాణం చేసి, ఆ రైలు వాళ్లుండే వూర్లో ఆగదు కనక వాళ్ళ కాలేజి దగ్గరకు రాగానే గొలుసులాగి గెంతి పరిగెత్తి పోవడం వాళ్ల సాహసాలలో ముఖ్యమైంది. టిక్కట్టు వాళ్లని అడిగే ధైర్యం, వాళ్లతో కలపడగలిగే సాహసవంతుడు ఎవరూ వుండేవారు కాదు. చూసీ చూడనట్లు వూరుకునేవారు. ఏవడన్న ఏదన్నా అంటే ఆ రైలు నడవదని వాళ్లకి తెలుసు. వాళ్లకక్కడ మరీ బోర్ కొట్టి యింటికెళ్లి రావాలని బుద్ధిపుడితే ఏదో గొడవ లేవదీసి స్ట్రయిక్ చేసి కాలేజి బంద్ అయిందనిపించుకొని ఊరికెళ్లిపోయేవారు. ఆ వూర్లోవుండే మెడికల్ కాలేజీ, యింజనీరింగు కాలేజి విద్యార్థులు యిద్దరూ బద్ధ శత్రువులు. ఒకరి సుపీరియారిటీ ఒకరికి నిరూపించుకోవాలన్న తాపత్రయంతో ఒకరి నొకరు ఎప్పుడూ ద్వేషించు కుంటారు. మనసులో ద్వేషం అప్పుడప్పుడు బయటపడితే కొట్టుకోవడం, వాళ్ళ



ప్రొఫెసర్ల యిళ్ళమీదకి వీళ్లు, వీళ్ళ ప్రొఫెసర్ల యిళ్ళమీదకు వాళ్లు రాళ్లు రువ్వుకోవడం, పోలీసులు, గొడవ, హడావిడి - యిలాంటివన్నీ వాళ్ళకి కాలక్షేపాలు.

ఇదీ వాళ్ళ కాలేజి. ఇలాంటి కాలేజిలో చేరడానికి మూర్తి ఆంధ్రదేశం నడిగడ్డ మీదనించి అక్కడ సీటుదొరక్క వచ్చాడు. యితరులకిచ్చే నాలుగు సీట్లలో వకటి సంపాదించుకుని రాగానే ఆవూరు వాతావరణం చూసి బెంబేలు పడిపోయాడు. వారానికి రెండు రిలీజయ్యే సినిమాలు చూసే అలవాటున్న మూర్తి ఆ డొక్కు హాలులో ఎప్పటివో పాత హిందీ సినిమాటు చూడాల్సి వచ్చిన దురదృష్టానికి గాభరా పడిపోయాడు. భాషన్నా తెలియని ఆవూర్లో మాట్లాడుదామన్నా మనిషి లేక బెంబేలు పడిపోయాడు. కాలేజి మొత్తానికి పాతిక ముఫై మంది తెలుగు విద్యార్థులు వుండేవారు. వాళ్ళంతా సీనియర్స్. జూనియర్ మూర్తిలో మాట్లాడడం వాళ్ళకి నామోషి. మాట్లాడినా ఆప్యాయత వుండేదికాదు. మిగతా వాళ్ళు వాళ్ళతో వాళ్ళ భాష మాట్లాడుకుంటూంటే మూర్తి ఒక్కడూ వెర్రివాడిలా తిరిగేవాడు. నా అన్న వాళ్ళందరికి దూరమై అమ్మ కమ్మగా వండిపెట్టే భోజనానికి దూరమై, భాషన్నా తెలీని ఆ వూర్లో పరభాష, పరదేశపు అలవాట్లకి అలవాటు పడలేక గిలగిల లాడిపోయాడు. ముఖ్యంగా భోజననానికి మొహం వాచిపోయాడు నెలరోజులకే.

భోజనం ... దాన్ని భోజనం అనడానికి వీలులేనంత అధ్వాన్నంగా వుండేది. ఆ రుచులకు అలవాటుపడిన వాళ్ళవాళ్ళే ఆ తిండి తినలేకపోయారు. నీళ్ళ పప్పు ఆళుతర్కారి - అంటె మసాలా రసంలో తేలే నాలుగు బంగాళాదుంపలు, ఓ 'భజా' అంటే వేపుడు, వేపుడంటే రెండు నిలువుగా తరిగిన వంకాయ ముక్కలు, లేక కాయపళంగా వేయించిన రెండు బెండకాయలు ఇదీ. సరే, పెరుగన్నది వాళ్ళకి అలవాటు లేదేమో కావాలన్నా దొరికేదికాదు. ఉప్పు కారంలేని ఆ భోజనం తినడానికి కళ్ళమ్మట నీరువచ్చేది మూర్తికి. తక్కిన తెలుగుమిత్రులు అప్పటికి కాస్త అలవాటుపడి వున్నారేమో పెట్టిందేదో మింగకతప్పదు అన్నట్టు తినేసేవారు. హొటలుకి వెళ్ళినా నాలుగు రకాలుపెట్టే తెలుగు భోజనానికి అలవాటుపడిన మూర్తి అవస్థ వర్ణనాతీతం. శాఖాహారం కంటే మాంసాహారం కాస్త నయం అని కొందరది తినేవారు.

 

హాస్టలులో భోజనంతప్ప టిఫిను యిచ్చేవారుకాదు. అంచేత ఉదయం కాలేజీ ఎదురుగావుండే పాక హోటళ్ళలో ఏ సింగడాలో, వడలో, పకోడీలో తిని టీ త్రాగడం తప్పనిసరి. కొన్నాళ్ళు బ్రెడ్ కొనుక్కునితిని అది విసిగెత్తితే మళ్ళీ ఆ హోటలులో తినడం తప్పేదికాదు. సాయంత్రమూ తప్పేది కాదు. ఆ పెట్టే భోజనం రాత్రి పదిలోపల పెట్టరేమో, కాలేజివించి రాగానే టిఫిన్ తినడం తప్పనిసరి. అలాంటి దురవస్థలో ఆ కాలేజి విద్యార్థులందరూ హాస్టలు కెదురుగావుండే పాక హోటళ్ళమీదే ఆధారపడేవారు.

అలాగే ఆ హోటళ్ళవాళ్ళు వీళ్ళమీదే ఆధారపడేవారు. వూరికి దూరంగా వుండే ఆ హోటళ్ళకి యీ విద్యార్థులు తప్ప యితరులు వచ్చే అవకాశం లేదేమో కేవలం స్టూడెంట్సుమీదే వాళ్ళ బిజినెస్సు ఆధారపడివుండేది. అంచేత వాళ్ల అంటే హోటళ్ళ వాళ్ళకి భయం, భక్తివుండేది. వాళ్ళతో తగువు తెచ్చుకుంటే అక్కడింక వాళ్ళు బ్రతకలేరన్నది వాళ్ళకి తెలుసు. అంచేత స్టూడెంట్సు అరువులు పెట్టినా ఓపిగ్గా డబ్బిచ్చేవరకు వుండేవారు,

హాస్టలుకి ఎదురుగావున్న నాలుగైదు హోటళ్ళలో 'సాహు' హోటలుకి మంచి గిరాకీ వుండేది. సాహు అసలు పేరు 'జుధిరిష్టో సాహు'. జుధిరిష్టో అంటే యుధిష్టురుడు? అంటే ధర్మరాజు. ధర్మం వాడి పేరులో తప్ప మనిషిలో ఏంచేసినా కనపడదు. వాడి బుద్ధి ఎలాంటిదై తేనేంగాని వాడి ఆకారం చూసినవాళ్ళకి మాత్రం ఆ హోటలులో టిఫిను దిగనంటుంది. మొదట్లో సాహు నల్లగా ఎద్దులా వడ్డ పొడువుగావున్న నలభై ఏళ్ళ మనిషి. మొఖం అంతా స్ఫోటకం గంట్లు-పచ్చటి పళ్లు, ఆ నల్లటి మొహంలో వికృతంగా కనిపించేవి. ముందు రెండు పళ్ళు ముందుకు తోసుకువచ్చి వికృతంగా కనిపించేవి. కారాకిళ్ళీతో గారపట్టిన ఆ పళ్ల చూస్తేచాలు తిన్నది వాంతవుతుంది. కాకులుపీకిన తాటిపండులాంటి జుట్టు, అసలే ఎర్రటి కళ్ళకీ తాగుడు మరింత తోడయి ఎప్పుడూ ఎర్రగా వుంటాయి కళ్ళు. మనిషి మాట్లాడుతూంటే నోటమ్మట కిళ్ళీ రసం కారుతూంటుంది. మనిషి దగ్గరికి వస్తే చాలు కంపు ! చమట, సారా, కిళ్ళీ అన్నీ కలిసిన ఆ వాసనని యిలా అని వర్ణించనలవి కాని కంపు !

అలాంటివాడి హోటలుకి మిగతా వాళ్ళెవరకీలేని గిరాకీ ఏమిటా అని ఆశ్చర్య



పోతారు ఎవరన్నా. మూర్తికీ అర్థంగాలేదు మొదట్లో. తెలుగు మిత్రులని ఓ రోజు ఆ మాట అడిగాడు. 'అబ్బ యిలాంటివాడిని చూస్తూ యీ హెూటలులోనే ఎందుకు తింటున్నారు. మరో దానికి వెళ్ళకూడదూ' అంటూ అసహ్యాన్ని వ్యక్తంచేశాడు. 'నీకు తెలియదులే' అంటూ మూర్తి అమాయకత్వానికి వాళ్ళలో వాళ్లు నవ్వుకున్నారు తప్ప, సరి అయిన జవాబు చెప్పలేదు. కొత్తగా కాలేజిలో చేరినవాళ్ళని వట్టి అమాయకులుగా తీసిపారేసి ఏడిపించడం సీనియర్స్‌కి అలవాటు. కొన్నాళ్ళు గడిచాక ఎవరూ చెప్పకపోయినా మూర్తికి సంగతి అర్థం అయింది. ఆ హెూటలులో అందరిని ఆకర్షించేది సాహు పెట్టే ఫలహారాలు కాదని, సాహువుంచుకున్న 'లొక్కి' (లక్ష్మికి వికృతి) అని అర్థం చేసుకున్నాడు. అది బోధపడ్డాక, ఓ రోజు వెంకట్రావుని అడిగితే అతను చెప్పిన సారాంశం యిది.

లొక్కికి యిరవైకి పాతికకి మధ్య వుంటుంది వయసు. లొక్కిని చూస్తే అందగత్తె అని ఎవరూ అనరు. కాని దాన్ని చూశాక ఎవరైనా సరే మరోమాటు దాన్ని వాళ్ళకి తెలియకుండానే కళ్ళెత్తి చూస్తారు. ఏదో చెప్పలేని ఆకర్షణ. ఆ ఆకర్షణ ఎక్కడుందో కూడ తట్టదు. దాని వంటి రంగు నలుపు. ఆ నలుపులోనే ఏదో ఆకర్షణ, అందం. జమజట్టీలా వడ్డు పొడుగున్న ఇనుప కడ్డీలాంటి శరీరం- జాకట్టు తొడుక్కోని దాని సౌష్టవం, దాని పొంకం అనే దానికి ముఖ్య ఆకర్షణలు. చక్రాల్లాంటి కళ్ళలో అదో మెరుపువుంది. చిన్నముక్కు, దానికి వంటి గాజు రాయి ముక్కుపుడక - ఆ పెదవులు బండగా, నల్లగావున్నా దాని అందం పెదాలలోనే ఎక్కువ వుందేమో అనిపిస్తుంది. ఆ పెదవి ఎరుపులో ఏదో కవ్వింపు. కళ్ళతో నవ్వేది కొంటెగా ? మాట్లాడకుండానే పెదవి విరుపుతో కవ్వించేది. ఎవరయినా ఒక్కసారి చూస్తే మళ్ళీ మళ్ళీ కనీసం కళ్ళతోనైనా చూడాలని కోరతాడు. నీటుగా నున్నగా తలదువ్వి పక్కకి కొప్పుపెట్టేది, తప్పకుండా ఏ కాలంలో ఆ కాలం పువ్వులు పెట్టేది. మొహానికి ఏదో పౌడరుపూసి, యింత బొట్టుపెట్టి ఎప్పుడూ నీటుగా వుండేది. చేతికి వెండిగాజుల మధ్య గాజు. గాజులు మామూలు కొండవాళ్ళలా కాకుండా లోపల పరికిణీకట్టి మరీ చీర కట్టేది. మొత్తంమీద ఎప్పుడూ నలగని మాయని మనిషిలా వుండేది.



ఆడపురుగులు కనిపించని ఆ కాలేజిలో ఆ 'లొక్కి'యే వాళ్ళకి ఆముదం వృక్షం. తెలిసీ తెలియని నూతన యవ్వన 16, 17 సంవత్సరా వయసు నించి ఆ అమాయకత్వాన్నించి దాటి గడుసు దేరిన, ఉరకలు వేసే వయసు వాళ్ళది. అలాంటి వయసులో, ఆడదన్నది కన్పించని ఆ వాతావరణంలో లొక్కి వాళ్ళనను(గహించి దేముడు పంపిన దేవతలా అనిపించింది ! దానికితోడు దాని చూపులు, కవ్వింపు. కనీసం దాన్ని కళ్ళతో జూసి ఆనందించే అవకాశానికి ఉదయం సాయం(త్రం తప్పనిసరిగా సాహ హొటలుకి వెళ్ళేవారు అందరూ. తాగేది కప్పు టీ అయినా సరే ఓ అరగంట అక్కడ బైఠాయించి తనివిదీరా చూస్తూ, దానికి అర్థంకాకుండా యింగ్లీషులో మాట్లాడుకుంటూ, అది వాళ్ళన్ని చూసి కొంటెగా నవ్వినప్పుడల్లా ఐసు అయిపోతూ, అది కావాలని ఏ చెయ్యో తాకిస్తే కరిగిపోతూ రోజూ రెండు గంటలు దాని సందర్శన భాగ్యంతో సంతృప్తి పడేవాళ్ళు ! (ప్రతీవాడు తనమీదే లొక్కి ఎక్కువ ఇంటరెస్ట్ చూపిస్తున్నట్టు గర్వపడి, సంతోషపడేట్టు అందరిని చాకచక్యంగా ఆకర్షించి ఆకట్టుకునేది.

"అమ్మ ముండా, చూడరా, చూడూ దాని కులుకు," "లంజముండ ఏదో వుందిరా దీన్లో." దీని సిగతరగ యిదే ఏ సినిమా తారో అయితే రాజ్యం ఏలేదిరా". యీ సాహుగాడు, వెధవ మొహం వాడూనూ ఏం ఛాన్సు కొట్టాడురా" అంటూ దాన్ని గురించి మాట్లాడుకుంటు సాహు అదృష్టానికి అసూయపడేవాళ్లు.

లొక్కిని సాహు ఓసారి 'కోరాపుట్టి' సంతకెళ్ళినప్పుడు తీసుకొచ్చాడుట. దాని తల్లి తం(డి కొండలోపుట్టి అడవిలో క(రలు కొట్టుకుని కొండ దిగువకి తీసుకొచ్చి కట్టెలు అమ్ముకుని జీవించే అతి బీదవాళ్లు. లొక్కి చిన్నప్పటినించి, అంటే పదేళ్ళప్పటినించి తల్లిదం(డుల వెంట అడివికి వెళ్ళడం, కట్టలు కొట్టడం, ఆ మోపు నాలుగు మైళ్ళు కొండ దిగువకి మోసుకొచ్చి అమ్మే కష్ట జీవితానికి అలవాటు పడింది. పనిలో మోటు దేరిపోయింది. అలా (బతుకుతూనే యిరవై ఏళ్ళదయింది. పదిహేడేళ్ళప్పుడు వాళ్ళ జాతివాడితో మనువయింది. మూడేళ్ళు కాపురం చేశాక వాడు మరొకరిని తగులుకుని దీన్ని వదిలేశాడు. ఆ సమయంలో కోరాపుట్టి సంతకెళ్ళిన సాహు దీన్ని చూసి 'నాతో వస్తావా, నాకు హొటలుంది, కట్టలు కొట్టి



కష్టాలు పడాల్సిన భయంలేదు. నీకు కావాల్సినంత తిండి పెడతాను. వెండి కడియాలు, బంగారు కమ్మలు చేయిస్తాను అని ఆశ పెట్టాడట. కొండలలో పుట్టిపెరిగిన లొక్కి బస్తీ జీవితానికి మోజుపడి వప్పేసుకుని అప్పటికప్పుడు తల్లిదండ్రులకి కూడా చెప్పకుండా వీడితో బస్సెక్కి వచ్చేసింది. మూడేళ్ళనించి సాహుదగ్గిరే వుంటూంది.

లొక్కి వచ్చిందగ్గిరనుంచి సాహుగాడి పని మూడు పువ్వులు ఆరు కాయలుగా వుంది. జమజట్టీలా వుంటుందేమో కర్రలు కొట్టిన శరీరానికి హొటలులో పప్పు రుబ్బడం, పకోడీలు వేయడం ఏం కష్టం. ఆడుతూ పాడుతూ సునాయాసంగా పనంతా అదొక్కతే చేసేసేది. సాహుగాడు అన్ని పనులకు తర్ఫీదు యిచ్చాడు. ఇదివరకులా వాడు పొయ్యి దగ్గిర కూర్చుని మాడనక్కర లేకుండా అన్నిపనులు దాని నెత్తిన పెట్టి గల్లాపెట్టి దగ్గిర కూర్చునే స్థాయికి మారాడు. పగలంతా చచ్చే చాకిరి చేసేది. రాత్రి స్వర్గం చూపించేది. తన అదృష్టానికి పొంగిపోయేవాడు సాహు. అంతేకాక లొక్కి వచ్చిందగ్గిరనుంచి హొటలుకి గిరాకీ పెరిగింది. ఆ గిరాకీ ఎందువల్లో తెలుసుకోలేనంత అమాయకుడు కాదు సాహు.

లొక్కి వచ్చిన ఓ ఏడాది వరకు మొద్దులా చాకిరి చెయ్యడం మినహా గడుసుదనం లేకుండా అమాయకంగా వుండేది. తర్వాత తర్వాత చుట్టూ ప్రపంచాన్ని చూసి తెలివి మీరింది. అడవిలో పెరిగిన అమాయకత్వాన్ని వదిలి గడుసు మీరింది. ఆ హొటలుకే అందరూ ఎందుకు వస్తున్నారో, తను ఎంతమందిని ఆకర్షించగలుగుతూందో అర్థం చేసుకునేటంత తెలివి మీరింది. ఏణ్ణర్థం గడిచే సరికి దానిలో చాలా మార్పు వచ్చింది. నీటుగా ముస్తాబవడం, చిరునవ్వులు ఒలక బోయడం, ఓరగా చూస్తూ కళ్ళతో కవ్వించడం, ఎవరన్నా ఏదన్నా హాస్యానికి అంటే "పో బాబూ" అంటూ ముద్దులు గునవడం వరకూ నేర్చేసుకుంది. సాహుకి ఇది వరకులా భయపడటం. వదిగి వదిగి ఉండడం మానేసి వాడేదన్నా అంటే జవాబు చెప్పడం, కసిరితే నిర్లక్ష్యంగా దులిపేసు కోవడం, యింకావాడు గట్టిగా అంటే తిరగబడి జవాబు చెప్పేంత రాటు దేలింది.

స్టూడెంట్సు హొటలుకు రాగానే ఏపని చేస్తున్నా వదిలేసి వచ్చేది.

"ఏం కావాలి బాబూ. ఏం తింటారు ?''

అంటూ కుర్చీలు బల్లలు శుభ్రంగా దులిపి ఎటన్షన్ చూపేది. సాహు దాని కులుకులు కోపంగా చూస్తూ "నీవెళ్ళి పప్పురుబ్బు, ఆళ్ళకేం కావాలో నే చూస్తాలే'' అనేవాడు. అది పట్టించుకోకుండా "రుబ్బుతాలే, యింత సేపు రుబ్బిరుబ్బి చేతులు పడిపోయాయి'' అని నిర్లక్ష్యంగా వాళ్ళకేం కావాలో అమర్చేది. వాళ్ళకి చాలా సంతోషంగా వుండేది. ఆఖరాఖరికి అందరూ సాహు పలహారం పెడితే తినమని మొరాయించారు.

"అబ్బ ! నీ హొటలులో సలహారాలు యింత రుచిగా వుంటాయి. వాటి రుచి నీ వెదురుగా కనిపిస్తే పోతుంది. మమ్మల్ని కాస్త హాయిగా తిననీయి''.

అంటూ హాస్యంగా అంటున్నట్టే అని వాడి రూపుని వెక్కిరిస్తూ వాడిని గల్లాపెట్టి దగ్గిరకి పంపేవారు. వాళ్ళ కెదురు చెప్పలేక చెపితే రారేమోననే భయంతో మొహం మాడ్చుకుని గల్లాపెట్టి దగ్గిర కూర్చునేవాడు. అయినా ఓ కన్ను లొక్కిమీద, ఓ కన్ను స్టూడెంట్లు మీద వేసే వుండేవాడు. అయినా ఏదో సందులో లొక్కి వాళ్ళని కళ్ళతో కవ్విస్తూ ముద్దులు గునుస్తూ మాట్లాడుతూ, చేయి తాకించాలని తాకిస్తూ వాళ్ళందరికి పెద్ద ఆకర్షణ అయి కూర్చుంది.

సాహు ఏ బజారుకో వెళ్ళాడంటే దానికి వాళ్ళకి యిద్దరికీ పండుగే. వాళ్ళతో నవ్వుతూ గల గలా మాట్లాడేది. వాళ్ళు హాస్యాలాడితే ముసిముసి నవ్వులు నవ్వేది. "బాబూ యీ పౌడరేమిటి ? ఎక్కడ దొరుకుతుంది అనేది. "కావాలా రాసు కుంటావా,'' అనేవాడు ఒకడు. "నాక్కాదు బాబూ ఆ సచ్చినోడి కింత పాముదామని ఉత్తి కంపు బాబూ ! ఎదవ'' అంటూ మొహం అసహ్యంగా పెట్టేది.

"అబ్బ ! మీ దగ్గిరెంత మంచి వాసన, బాబూ ఏటి రాసుకుంటారు ? అమ్మో ! యీ నూనె ఎంత చక్కగా వుందో వాసన'' అంటూ వాళ్ళ తల నూనెనో సెంటువాసనో చూడడానికన్నట్లు దగ్గిరిగా వచ్చి తాకుతూ చూసేది. వాళ్ళకు మతులు పోయేవి. "ఆ దొంగ సచ్చినోడు యీయన్న రాసుకున్నా బాగుండు. ఛస్తున్నా'' అనేది కొంటెగా. దాంతో వాళ్ళు దాన్ని కవ్వించడానికి సానుభూతి చూపిస్తున్నట్లు



"అబ్బబ్బ, ఆ సాహుగాడిని ఎలా భరిస్తున్నావు, నీ వింత చక్కగా వుంటావు వాడో ఎద్దు, గాడిద ... ఛా నీవు కాబట్టి వుంటున్నావు'' అని కిర్రెక్కించేవాళ్ళు.

"ఏం చెయ్యను బాబూ ... అడవిలో పడుందేదాన్ని ... అప్పుడేం తెలీక వెంటబడి వచ్చాను. యిప్పుడెక్కడికిపోను'' అనేది జాలిగా.

అంతకంటే యింకేదన్నా అంటే తమతోలేచి వచ్చేస్తానంటుందేమోనని భయం అందరికి.

సాహు నెలకోసారి సరుకులు చవగ్గా దొరుకుతాయని రాయగడా సంతకి వెళ్ళేవాడు. ఆ రెండు రోజులు దానికి ఆటవిడుపు. ఆ సదవకాశాన్ని స్టూడెంట్లలో కొందరు సాహసవంతులు, రసికులు వినియోగించుకొనేవారు. పాపం స్నోలు, పౌడర్లు, గాజులు యిలాంటి చిన్న బహుమతులంటే ఆశపడేదికాదు లొక్కి.

లొక్కి వ్యవహారం ముందులో కనిపెట్టలేకపోయినా తరువాత పసికట్టాడు. సాహు పిచ్చి వేషాలేస్తే మక్కెలిరగ తంతాను అని బెరించాడు. అది లక్ష్యపెట్టలేదు, ఆఖరాఖరికి స్టూడెంట్లని ఏమనే ధయిర్యంలేక ఆ కోపం అంతా లొక్కి మీద చూపించి రోజూ తన్నడం ఆరంభించాడు. అది నోరిప్పి వాళ్ళతో ఏం మాట్లాడినా కసిరేవాడు. వాళ్ళతో పూర్వంలా కాకుండా ముభావంగా మొహం గంటు పెట్టుకుని మాట్లాడేవాడు. వాడి హొటలు దివాళ తీస్తుందన్న భయం. లేకపోతే దాన్ని వాళ్ళని కలిపి పాతేసేవాడేమో. తనే వూరన్నా వెడితే లొక్కికి ఓ ముసలిదాన్ని కాపలా పెట్టేవాడు. ముసలిదాని కళ్ళుకప్పి యధాప్రకారం ఆటలు ఆడే లొక్కి సాహు రాగానే ముసలిది కంప్లైంటు చేయగానే కుళ్ళ బొడిచేవాడు సాహు. ఆఖరాఖరికి సంతలకి తను వెళ్ళడంమాని మరెవరినో పంపి దాని ఆట అన్ని వైపులనుంచి కట్టేయించాడు. రోజురోజుకి వాడు పెట్టే బాధలు, వాడిచేత తన్నులు తినలేక రాజుని చూసిన కళ్ళకి సామెతలా లొక్కికి సాహుగాడి సహచర్యం భరించడం దుర్లభ మయింది. అప్పుడప్పుడు అవకాశం దొరికితే రహస్యంగా తన బాధలు వాళ్ళతో చెప్పుకుని కళ్ళనీళ్ళు పెట్టుకునేది. దాని అందాన్ని పొగడడం తెలుసుకాని దాని కన్నీళ్ళని తుడిచే శక్తి వాళ్ళకేది.

ఆఖరికి ఓరోజు తెల్లారేసరికి లొక్కి మాయమయిపోయింది. కొన్నాళ్ళ తరువాత తెల్సింది. ఏమంటే ఎవడో లారీ డ్రైవరుతో లేచి పోయిందని ప్రక్క పూరిలోనే వుందని ...'' ఆ లారీ డ్రైవరు పేంటు, షర్టు, చేతికి వాచి వాడి ఉంగరాల జుత్తు అన్ని చూసి మోజుపడింది ముండ, నాలుగు రోజులుంచుకుని తన్నేస్తాడు రోగం కుదురుతుంది ముండకి'' అని తిట్టుకున్నాడు సాహు కసిగా ... అంతకంటే ఏం చేయలేక.

లొక్కి వెళ్ళిపోయాక స్టూడెంట్లందరికి కొన్నాళ్ళు మతిపోయినట్లయింది. కాలక్షేపం లేక కొట్టుకు పోయారు. వాళ్ళ ఉత్సాహాన్నంతా లొక్కి లాక్కుపోయి నట్లనిపించింది. సాహు హొటలుకి అడుగు పెట్టాలంటే చిరాకనిపించేది. లాభాలు తగ్గిపోవడం అందరూ మరో హొటలుకు వెళ్ళటం చూసి తన వ్యాపారం దెబ్బ తింటుందని ఓరోజు ... "లంజముండ పోతేపోయింది దీని బాబులాంటిదాన్ని మరొత్తిని తెస్తాను'' అంటూ వెళ్లాడు.

ఈసారి ఎలాంటిదాన్ని తెస్తాడో అని అందరూ ఆరాటంగా ఎదురు చూశారు. మూడోరోజున వచ్చిన సాహు వెంట "గురువారీ'' వచ్చింది. దాన్ని చూడగానే అందరూ నిరుత్సాహపడ్డారు. గురువారీ బొత్తిగా చిన్న పిల్ల . పట్టుమని పదమూడు నిండాయో లేదో ? చామనచాయ రంగులో బక్కపలచగా అమాయకంగా వుంది, కళ్ళుమాత్రం పెద్దవి. ఆ కళ్ళలో క్రొత్త బెదురు, కొండలలో పుట్టి పెరిగిన ఆపిల్ల ఒక్కసారిగా పట్టణ వాతావరణంలో క్రొత్తగా అర్థం కానట్టు యిమడలేక బితుకు బితుకుమని చూసింది. గురువారీ ... (పొరజా ... వాళ్ళు అంటే కొండజాతులలో ఒక తెగ. వాళ్ళు ఏ వారం పుడితే ఆవారం పేరు పెట్టేస్తారు పిల్లలకి) ని రెండొందలు యిచ్చి కొని తెచ్చాడట సాహు. పిల్లల్ని అమ్ముకునే తల్లిదండ్రులు యింకా వున్నారా అని ఆశ్చర్యపడ్డారు అందరూ. "వాళ్ల కేటి బాబూ, వాళ్ళకివన్నీ ఏటితెలుసు, పిల్లలకి కొదవా వాళ్లకి, డబ్బిస్తే ఎక్కడో అక్కడ పిల్ల తన పొట్టపోసుకోగలదన్న ధైర్యం వాళ్ళకి మనువు చేసుకోవాలన్నా డబ్బిచ్చి పిల్లని కొనుక్కోవాలి. ఎవడు డబ్బిస్తే వాడితో పంపేస్తారు అన్నాడు సాహు.

"అదిసరే, మరీ యింత గుంటని తెచ్చావు యిదేంచేస్తుంది'' అన్నారు



నిరుత్సాహంగా కొందరు. "గుంటేం, పధ్నాలుగేళ్లున్నాయి. మరో ఏడాదిపోతే అదే చూడండి ఎలా తయారవుతుందో ? కాస్త చిన్నపిల్ల అయితే భయభక్తులుంటాయి బాబూ, ఆ ముండని చూశారుగా ఏం చేసిందో, అందుకే యిదయితేనే లొంగి పడి వుంటుందిని తెచ్చాను'' అన్నాడు సాహు.

అప్పుడే విడవబోతున్న మొగ్గలా అమాయకంగా వుండే ఆ పిల్లని చూస్తే ఎవరికీ లొక్కిలా అన్పించేది కాదు. ఆ పిల్ల అంత పెద్ద రుబ్బు రోలుముందు కూర్చుని రుబ్బలేక కష్టపడి రుబ్బుతూంటే, పొయ్యి సెగకి ఎర్రబడిపోయిన మొఖంమీద చెమట తుడుచుకుంటున్నప్పుడు, అందరికి భయభక్తులతో ఫలహారాలు అందిస్తున్నప్పుడు పాపం వయసుకి మించి శ్రమపడ్తోంది అని జాలి అనిపించేది, "సాహు పాపం చిన్నపిల్ల చేత అంతపని చేయిస్తావేమిటి'' అని మందలించేవాళ్ళు. "చిన్నపిల్లేటి, అయినా దీని బాబుకి రెండొందలు యిచ్చి వూరకే కూర్చోపెట్టటానికి తెచ్చానా'' అనేవాడు. సాహు ఆ పిల్లని కసిరినపుడు, పని సరిగా చెయ్యలేదని తిట్టి నప్పుడు, తన పెద్ద కళ్ళనిండా నీరునింపుకుని చాటుగా అటు తిరిగి తుడుచుకునే ఆ పిల్లనిచూసి అందరూ చాటుగా జాలిపడేవారు. ఒకసారి గాజుగ్లాసు బద్దలు కొట్టిందని సాహు గురువారి చెంపమీద కొట్టాడు. ఆ పిల్ల బిక్క చచ్చిపోయి, కళ్ళనిండా నీళ్ళు నింపుకుని ఎవరివంకా చూడలేక తలవంచుకుని లోపలికి వెళ్ళిపోయింది. దెబ్బతిన్న బాధ కంటె నలుగురిముందు అవమానం ఆ పిల్లకి ఎక్కువ బాధ కల్గిందని అర్థం అయింది. ఆవేశపరుడైన నిరంజన్ కోపంగా సాహుమీద ఎగిరిపడ్డారు. గుడ్లెర్రచేసి, మరోమాటు గురువారిని ఏమన్నా అన్నా, చేయిచేసుకున్నా వూరుకోం అని బెదిరించాడు. ఆ పిల్లని యిలా బాధలు పెడితే నీ హోటలు గుమ్మం ఎక్కం అని బెదిరించాడు. గురువారిమీద వాళ్ళకంత అభిమానం ఏమిటో అర్థంకాక, ఎదురు చెప్పలేక గొణుక్కుని వూరుకున్నాడు సాహు. ఆ తర్వాత వాళ్ళు లేనప్పుడు గురువారిని ఏమనేవాడు కాదు సాహు. ఆ మాత్రానికే గురువారి కళ్లనిండా వాళ్ళపట్ల భక్తి, గౌరవం. అప్పటినించి వాళ్ళనిచూచి సిగ్గుగా చిరునవ్వు నవ్వుతుండేది. ఆమె మొహంలో ఆ నవ్వు, ఆ అమాయకత చూస్తే అందరికి ముచ్చట అన్పించేది. దూరంగా వున్న వాళ్ళ చెల్లెళ్ళు గుర్తు వచ్చేవారు.



గురువారీ వచ్చిన నెలరోజులకి ఆ రాత్రి సంఘటన జరిగింది. ఇంట్లో చాకిరీకి రాత్రి పక్కలోకి పనికి వస్తుందని తెచ్చాడు సాహు. ఆరాత్రి స్టూడెంట్లు కల్పించుకోకపోతే ఏడ్చి గోలపెట్టి అఖరికి వాడి బలముందు చాలలేక వాడి కోరికకు అంత పసిపిల్ల బలి అయిపోయేది. చేసేదేంలేక ఆ బండవెధనతో జీవితానికి అలవాటు పడివుండేది గురువారి. వాళ్ళు కల్పించుకోవడం వల్ల, మంచే జరిగిందో చెడే జరిదిందోకాని, ఆ గొడవ వల్ల వాళ్ళకి తెలియకుండానే గురువారీ బాధ్యత వాళ్ళ నెత్తిన వేసుకొన్నట్లయింది.

✲✲✲

సదానంద్ దగ్గిర ఓ రెండు నెలలుంది గురువారి. ఆ తర్వాత ఒకరోజు హాస్టలు గేటుదగ్గిర అందరూ సాయంత్రం షికారు వెళ్ళే సమయానికి తచ్చాడుతూ కనిపించింది. నిరంజన్ కాస్త ఆశ్చర్యంగా ఏం కావాలంటూ అడిగాడు. అడగడమే తడవు అన్నట్టు గురువారీ ఏడుస్తూ తను సదానంద్ దగ్గిర వుండలేనని, తనిచేత రోజంతా చచ్చే చాకిరి చేయించుకుని తిండన్నా సరిగ్గా పెట్టటంలేదని, అతని భార్య గురువారీని అతి హీనంగాచూస్తూ తిడుతూందని, ఈ తద్దినం నా నెత్తి కెక్కించావు అని భర్తని కేకలేస్తుందని చెప్పి నేనింక అక్కిడ వుండలేననీ ఏడుస్తూ అంది. యింత తిండిపడేస్తే మీదగ్గిరే ఏదన్నా పనిచేసుకు బ్రతుకుతాను. మీ గదులూడుస్తాను, బట్టలుతుకుతాను, ఏ పని చెప్పినా చేస్తాను యింక అక్కడ వుండలేనంటూ గోలపెట్టింది.

అందరూ మొహాలు చూచుకున్నారు. యిదియెక్కడి బాధరా బాబూ ! దాని బ్రతుక్కి మనం జవాబుదారి అన్నట్టు మాట్లాడుతుందేమిటి. నేరకపోయి ఈ గొడవ తగిలించుకున్నాం అన్పించింది అందరికి. తాము కల్పించుకోకపోతే ఏడ్చో మొత్తుకునో ఆ సాహుగాడితోనే వుండేది. కోరికూర్చుని ఈ గొడవ నెత్తిన వేసుకున్నాం అనుకున్నారందరూ.

"మా దగ్గిరేం పని చేస్తావు. మా హాస్టలుకి నిన్ను రానీయరు" అంటూ తప్పించుకోబోయారు. గురువారీ కాళ్లు పట్టేసుకుంది. ఏడ్చింది. దాని ఏడుపు చూచి జాలనిపించినా, ఏం చెయ్యాలో ఎవరికి అర్థంకాలేదు. తలో రూపాయి యిచ్చి



ఏదోపని చేయించుకోవచ్చుగాని ఆడపిల్ల గదుల్లోకి రావడానికి వార్డెను వప్పు కుంటాడా ? తర్వాత ఆలోచించి ఏదో చెప్తామని అప్పటికి వదుల్చుకున్నారు. వార్డెన్‌తో మాట్లాడారు. "అదెలా కుదురుతుంది ఆడపిల్ల" అన్నాడు వార్డెను. 'చిన్నపిల్ల దానికేమిటి' అన్నారందరూ. 'చాలు ఆ వయస్సు' అన్నాడు. వార్డెను నవ్వి కొంటెగా అందరూ నవ్వుకున్నారు.

గురువారి గొడవ ఆఖరికి అందరికి తలనొప్పిగా తయారయింది. దాని కంటబడకుండా తప్పించుకున్నారు. కొన్నాళ్లు కొన్నాళ్లు 'మాకేం తెలీదు పో' అని కసిరారు. రోజూ హాస్టలు గేటుదగ్గిర కాపుకాసి నాగతి ఏమిటి బాబూ అని అడిగే గురువారీని చూస్తే ఓ పక్క జాలవిపించినా ఏం చెయ్యాలో యెవరికి అర్థంకాలేదు.

ఆఖరికి నిరంజన్ ఆలోచించి 'పోనీ దాన్నే ఓ హొటలు పెట్టమందాం' అన్నాడు. అందరూ ఆ ఆలోచన ఆమోదించారు. మనిషికి రూపాయి చొప్పున హాస్టలంతా తిరిగి నాలుగొందలు వసూలు చేశారు. ఓ పాక తయారుచేయించి హొటలుకి కావల్సిన సరంజామా కొనిచ్చారు. గురువారీ కృతజ్ఞతతో వాళ్ళ కాళ్లు పట్టేనుకుంది. పన్నెండేళ్ళ కుర్రాడిని సాయం పెట్టుకుని హొటలు మేనేజ్ చేయడానికి తయారయింది. సాహు సదానంద్ యిచ్చిన తర్ఫీద్ వుండనేవుంది. నిరంజన్ గ్రూపు ముప్పైమంది దానికి రెగ్యులర్ కాతాలు. ఒక నెల రోజులకే గురువారీ పనిలో నిల దొక్కుకుని రొటీనులో పడింది. దాని గొడవ వదిలిందని అంతా సంతోషించారు.

✲ ✲ ✲

చూస్తుండగనే రోజులు దొర్లిపోయాయి. కాలంతోపాటు గురువారీ కదిలింది. గురువారీ ఇప్పుడు విడవబోయే పసిమొగ్గకాదు. అప్పుడే విడిచిన వికసిత కుసుమం. యవ్వనం యెలాంటి మనిషికైనా అందాన్నిస్తుందన్నది ఎంత నిజమో గురువారీని చూస్తే తెలుస్తుంది. యవ్వనం కరూపి. ఆడదానికై నా వరం గురువారీ కురూపికాదు, ఓ ఛాయ తక్కువన్నమాటే గాని అందమైనదే మరింక ఆకరణకి ఏం లోటు? గురువారీ ముఖంలో ఆమాయకతస్థానే చిలిపితనం చోటుచేసుకుంది ? ఆ కళ్ళల్లో పూర్వపు పిరికితనం పోయి గడుసుదనం కొంటెతనం వచ్చాయి. అందరియెడ

ఆమెకివున్న భక్తి, కృతజ్ఞతతోపాటు ఆరాధన చోటుచేసుకుంది. మగాణ్ణి పిచ్చెత్తించే విధంగా తయారయింది. గురువారీ వేషంలో, భాషలో అన్నిటా నాజూకు నేర్చింది. యివరకు లొక్కికి మించి కవ్విస్తూ తయారైంది గురువారీ. వయసే పాఠాలు నేర్పుతుంది కాబోలు ! ఆ కులుకులు, ఆ తళుకులు చూస్తూ 'అమ్మముండ ఎలా తయారైందిరా' అనుకుంటూ దాని హొయలని చూస్తూ ఆనందిస్తున్నారు అందరూ. యిప్పుడు వాళ్ళెవరికీ దాన్ని చూస్తే వాళ్ళ చెల్లెల్లు గుర్తురావడంలేదు.

ఒకరోజు రాత్రి మొదటిఆట సినిమాచూచితిరిగి వస్తున్నారు కొందరు. గురువారీ గుడిసె దగ్గిరికి వచ్చేసరికి వాళ్ళ కాళ్లు ఆగిపోయాయి. ఈసారి గురువారీ ఏడుపుకాదు - నవ్వు వినిపిస్తుంది. వాళ్ళ గోలలోకుడా కిలకిల నవ్వే గురువారీ నవ్వు విని అందరూ ఒక్కక్షణం నిశబ్దంగా నిలబడిపోయారు. ఆ వెంటనే వినవచ్చిన మగ గొంతు విని ఆశ్చర్యపోయారు. వాళ్ళ కాళ్ళు వాళ్ళకి తెలియకుండానే ముందుకు వెళ్ళబోయి అంతలోనే ఆగిపోయాయి. ఏడ్చేవాళ్ళకి సహాయం, సానుభూతి అవసరంగాని నవ్వేవాళ్ళకి కాదన్న సంగతి ఎవరూ మాట్లాడుకోకపోయినా ప్రతి వాళ్ళకి తట్టింది.

ఆ గొంతు నిరంజన్ పాత్రోది: ఒక్క నిరంజన్ దేకాదు - ఆ తరువాత శరత్ మిశ్రా, సంతోష్ నందా, గోకుల్ సాహు, చటర్జీ వెంకట్రావు వగైరా చాలా గొంతులు వినిపించసాగాయి ఆ గుడిసెలో. ఒకరోజు మూర్తిదీ వినిపించవచ్చు - ఫరవాలేదు. ప్రక్కనే మెడికల్ కాలేజీ హాస్పిటల్ వుందన్న నిబ్బరం వుంది వాళ్ళకి.

* * *

మనిషి పెద్దపులికి ఎంత భయపడతాడో, పెద్దపులీ మనిషికి అంతే భయపడ్తుంది. కాని ఒకసారి మనిషి రుచిమరిగిన పెద్దపులి తరువాత 'మాన్ ఈటర్'గా మారుతుంది.

**ఆంధ్రప్రభ వారపత్రిక (70, 75 మధ్య)**






# నగరంలో నాలుగిళ్లు

సాయంత్రం ఐదున్నరయింది. వడగాడ్పు కాస్తతగ్గి చల్లగాలి తిరిగింది. ఎండకి భయపడి ఇళ్ళలోంచి బయటికి రావడానికి భయపడ్డ వాళ్ళందరూ నెమ్మదిగా బయటికి బయలుదేరుతున్నారు. ఆఫీసులనించి ఉరుకులు పరుగులతో ఇళ్ళకి చేరేవారు, బజార్లకి, సినిమాలకి బయలుదేరిన వాళ్ళు ... ఎక్కడచూసినా జనం! ఎటు చూసినా హడావిడి! ఏదో ప్రళయం ముందుకొస్తున్నట్టు ఎవరికి వారే హడావిడిగా పరుగులు పెట్టే జనంతో రోడ్లన్నీ నిండిపోతున్నాయి,

ఫ్యాక్టరీ కూతి పెట్టింది. బిలబిలలాడుతూ జట్లుజట్లుగా కూలీలు చేతిలో క్యారియర్లతో హుషారుగా బయటికి వస్తున్నారు.

రంగి, నర్సింలు నవ్వుకుంటూ మాట్లాడుకుంటూ ఇంటికి బయలు దేరారు. త్రోవలో జనాన్ని, సినిమా పోస్టర్లనీ, దుకాణాలలో నగలు, చీరలు చూస్తూ గబగబ నడవసాగారు. బజారుదాటి కొంతదూరం వెళ్లాక మామూలుగా సరుకులుకొనే పచారీ దుకాణంముందు ఆగారిద్దరూ. రంగి చీరకొంగు నించి మడతలు పడిన మూడురూపాయలు తీసింది. బియ్యం, అణా చింతపండు, అణా మిర్చి, అణా ఉప్పు అవీ కొంది. వెంట తెచ్చుకొన్న సీసాకాయలలో పావలా నూనె, బేడ కిరసనాయిలు పోయించుకుంది. నర్సింలు పదిపైసల బీడీలు కొని ఒకటి అంటించుకున్నాడు. దిక్కులు చూస్తున్న రంగిని “ఏటేస్ చూత్తండావు ... నడు” అన్నాడు. రంగి బుర్ర గోక్కుంది. “వుండుమాఁవా, ఏందో మరిచిపోయాను” ఇంకేది కొనాలో ఆలోచిస్తూ నిల్చుంది ... “ఆ ... ఆ ... సావుకారూ, పది పైసల సోడా కారం యీయి. మరిగంట రెండణాల ఉల్లిపాయలు కూడా గట్టు ... అదిగో ... ఆ ఉప్పు బిస్కత్తులు ఓ పదిపైసలవియ్యి” అంది. షావుకారు ఇచ్చిన పొట్లాలు అన్నీ చీరకొంగున కట్టుకుంది. బియ్యం నర్సింలు పైపంచలో మూటకట్టింది. సీసాకాయలు, క్యారియర్ పట్టుకుని, షావుకారికి డబ్బిచ్చి బయలుదేరింది.

"పద మాఁవా!"... నాలుగడుగులు వేశాక మార్కెట్టు రాగానే ..."

"రంగీ, సాపలు కొందారేటి" అన్నాడు నర్సింలు.

"ఏటిమాఁవా, సాపలు, మాంసం రోజూ కొండానికి మనం లచ్చాది కార్లమా ..." అంది.

"కొనేస్, రొయ్యలు కొని, యిన్ని ఉల్లిపాయలేసి, కమ్మగా పులు పెట్టేయియాల!" పులుసు గుర్తొచ్చి నర్సింలు నోట్లో నీరూరుంది. బీడీ తీసి కుసుక్కున ఉమ్మాడు. రంగి పావలా రొయ్యలుకొని క్యారియర్ గిన్నెలో పెట్టుకుంది.

"నడు మాఁవా, చీకట్టడ్డాది ... గుంటలేం సేస్తున్నారో ..." ఆడుగులు త్వరగా వేస్తూ అంది.

"ఉండే, పదిపైసలు మల్లెపూలు కొనకూడదంటే రంగీ !" రంగి వద్దని వాదించేలోపలే నర్సింలు ఓ దండ కొని వాసనచూసి రంగికి ఇచ్చాడు.

ఇద్దరూ గుడిసె చేరేసరికి దీపాలు పెట్టారు. తల్లినిచూసి రంగి ఆరేళ్ళ కూతురు, నాలుగేళ్ళ కొడుకు మట్టిలో యిరుగు పొరుగు పిల్లలతో ఆడుతున్న వాళ్ళు పరిగెత్తుకు వచ్చారు. రంగి కొంగువిప్పి తెచ్చిన బిస్కట్లు ఇద్దరి చేతుల్లో పెట్టింది. బిస్కట్లు చేతిలో పడగానే ఇద్దరిమొహం విప్పా రింది. మళ్ళీ ఆడుకోడానికి పరిగెత్తారు. రంగి చూరులోంచి తాళంతీసి గుడిసె తలుపు తెరిచింది. తెచ్చినవన్నీ క్రిందపెట్టి తడుముకుని దీపంబుడ్డి తీసి కిరసనాయిలు పోసి వెలిగించి గూట్లో పెట్టింది. నర్సింలు గుడిసెలోంచి రెండు నులకమంచాలు తీసికెళ్ళి వెనకాల దడికట్టిన ఖాళీ జాగాలో పడేసి, కాళ్ళు చేతులు జాడించుకుని ఓ మంచం వాల్చుకు పడుకున్నాడు.

రంగి గబగబ పెరట్లో ఇటికల పొయ్యిమీద నీళ్ళకుండ పెట్టి రెండు చితుకులు మంట పెట్టింది. ప్రొద్దుట గబగబ యింత అన్నం వండుకుని తామిద్దరికి ఇంత క్యారియర్లో పెట్టుకుని పిల్లలకి ఓ కుండలో ఇంత ఉప్పేసి అన్నంలో నీళ్ళుపోసి పెడ్తుంది. పిల్లలిద్దరూ దగ్గర్లోని ఎలిమెంటరీ స్కూల్లో చదువుకోనికిపోయి మద్యాహ్నంవచ్చి ఆ గంజన్నం తింటారు. ఆ కుండలు, మూకుళ్ళు అన్నీ తోమ్మి,

పొయ్యి రాజేసి ఎసరు పెట్టింది రంగి. చాటలో బియ్యం పోసుకుని పెరట్లో కూర్చుని మొగుడితో కబుర్లు చెప్పుతూ రాళ్ళేరింది. రొయ్యలన్నీ శుభ్రంగా కడిగి బాగుచేసి పెట్టుకుంది. నీళ్లు కాగగానే మట్టిలో పొర్లుతున్న పిల్లలిద్దర్ని లాక్కొచ్చి సబ్బుబిళ్ళతో తోమి గోరువెచ్చటి నీళ్ళు పోసింది. తరువాత తనూ రెండుచెంబులు చీర చుట్టబెట్టుకొని పోసుకొంది. తరువాత మాఁవని పిలిచి వీపుతోడు నీళ్ళు పోసింది. ఆ కుండలో మరికాసిని నీళ్ళు మరిగాక తెచ్చిన సోడాకారంచేసి విప్పిన కుళ్లు బట్టలన్నీ నాన బెట్టింది. ఎవరు మరిగాక బియ్యంపోసి అన్నం వార్చి, గబగబ రొయ్యల పులుసు కాచింది. సావకాశంగా కొప్పు ఊడదీసి నున్నగా దువ్వుకొని, మల్లెపూలు పెట్టుకుంది. పొయ్యి ఆర్పేసి పిల్లలకి, మొగుడికి అన్నాలు పెట్టింది. వాళ్ళు అవురావురు మంటూ అన్నల తింటూంటే తన కడుపు నిండిపోయి నట్లనిపించింది రంగికి. “పులుసు మా కమ్మగా వుందే రంగీ'' అంటూ మరే యింత అన్నం పులుపేసుకొని కలుపుకొన్నాడు. అందరూ తిని లేచాక ఆ మూకుడులోనే తనూ తింది. మిగిలిన అన్నంలో నీళ్ళుపోసి ప్రొద్దుటికి ఉట్టిమీద పెట్టింది. కుండలు కడుక్కుని, దీపంబుడ్డి ఊదేసి, తడిక కట్టేసి పెరట్లో మంచం దగ్గరికి వచ్చింది. పిల్లలిద్దరూ పగలల్లా ఆడి, సాయంత్రం నీళ్ళు పోసుకొని వేడన్నం తిని వళ్ళుమరిచి నిద్రపోతున్నారు. రంగి రావడంచూసి కాలుస్తున్న బీడి దమ్ములాగి అవతల పారేశాడు నర్సింలు, తన ప్రక్కన పడుకున్న కొడుకుని, అవతల కూతురు పడుకొన్న మంచంమీద పడుకోబెట్టాడు. “ఏ వెండలు మాఁవా ! మండ బెట్టేస్తాంది. అబ్బ ... అబ్బ ... కాస్త సల్లగాలి తిరుగుతోంది యిప్పుడే !'' రంగి చీర దులుపుకొని మంచం మీద కూర్చుంది.

“మాఁవా, రేపు సినిమా కెళ్తామా ! అదేందో సానా బాగుందట అప్పి చెప్పింది.''

“సినిమా వూసు ఇప్పుడెందుకోస్ ... రేపు సూద్దాంలే ...'' అన్నాడు నర్సింలు రంగి చేయిపట్టుకొని లాగుతూ.

“ఉండు మాఁవా, నీకెప్పుడూ ఇదే మాలోకం !'' అంటూ గునిసింది రంగి. “మావాఁ ... మరిగంటేం ... ఆ పొద్దు సీతాలు కట్టుకుందే ... అలాంటి లైలాను



సిల్కుకోక కొనుక్కొంటాను. అమ్మోరి జాతరికి ...'' కోరిక బయటపెట్టడానికి మంచి సమయం ఏదో రంగికి తెల్సు. ఇలాంటప్పుడు అడిగితే మాఁవ కాదనడని తెల్సు రంగికి.

"కొనుక్కోందువుగానిలే ... ఏపాటి డబ్బు కూడబెట్టినావేటి !'' అన్నాడు నర్సింలు రంగి తలలో మల్లెలు వాసనచూస్తూ.

"వుఁదిలే మాఁవా, సీరకి సరిపోతది ! ఒక్క సీర కాస్త మంచిదుంటే ఏ సినిమాకో ఎల్లినప్పుడు కట్టుకుందారని ...''

రంగి, నర్సింలు ఇద్దరూకలసి రోజుకి నాలుగురూపాయలు ఆర్జిస్తారు. మూడురూపాయలు బియ్యం, ఉప్పు, కూర నారకి సరిపోతుంది. ఓ అర్ధరూపాయిలో నర్సింలు బీడిలు, చా ఖర్చు, కర్రపుల్లలు ఏవో ఖర్చుకి సరిపోతుంది. ఆ మిగిలిన అర్ధరూపాయి రంగి ఓ ముంతలో వేసి దాస్తుంది. ఆ డబ్బులోనే సినిమాలకి, నర్సింలు వారానికోసారి చుక్కేసుకోడానికి, అప్పుడప్పుడు బట్టా పాత కొనుక్కోడానికి దాస్తుంది రంగి. "సరేలే, కొందూగాని ...'' మాటలతో జాప్యం చేయడం ఇష్టంలేక రంగిని దగ్గరికి లాక్కున్నాడు నర్సింలు ... నర్సింలు చుక్కేసుకున్నప్పుడు తప్ప మిగతా సమయంలో రంగిని నెత్తిమీద పెట్టుకుంటాడు. ఆ నిషాలో తన్నిన తన్నులు రంగీ ఆ వెంటనే మరిచిపోతుంది ... "వుండుమాఁవా ఓరన్నా సూస్తారు''... ముద్దులు గునుస్తూనే, రంగి దగ్గర చేరింది.

✲✲✲

ఆరుగంటలు ఠంగు ఠంగున కొట్టింది. సుబ్బారావు రాస్తున ఫైళ్ళలోంచి తలె త్తి చూశాడు. ఆరుగంటలు ! ఇంకా రాయాల్సినవి, అర్జంటనబడేవి అరడజనుపైన వున్నాయి. కాళ్లుచేతులు లాక్కుపోతుంటే కుర్చీలో వెనక్కి జారపడి కాళ్ళు చేతులు దాచుకుని ఆవలించాడు బద్ధకంగా సుబ్బారావు ... అతనికి కడుపులో ప్రేగులు అరుస్తున్నాయి ... పొద్దుట తొమ్మిదింటికి తిన్న తిండి. మధ్యలో టీ అనబడే వేడినీళ్ళుతప్ప కడుపులో ఏం పడింది ? ... లాభంలేదని ఫైళ్లు మూసేసి, రాయాల్సినవి చంకన పెకుని, సైకిలుకి కట్టుకుని కాళ్ళీడ్చుకుంటూ త్రొక్కుకుంటూ బయలుదేరాడు ఇంటికి సుబ్బారావు.




గుమ్మంలో తనకి స్వాగతం పల్కడానికి నిల్చున్న పెళ్ళాన్ని చూసేసరికి గుండె గుభేలుమంది సుబ్బారావుకి. బియ్యం, పాలడబ్బా ! ... ఆ మాటలు గుర్తొచ్చే సరికి భార్యమొహం చూడడానికి భయంవేసి వెనక్కి తిరిగి పారిపోవాలనిపించింది ... ప్స్, లాభంలేదు. ఎన్నాళ్ళు ఎక్కడికి పారిపోగలడు? బెదురుతూనే సైకిలు దిగాడు. సైకిలు వంక ఆశగా చూసిన సత్యవతికి ఫైళ్లతప్ప ఏం కనపడలేదు, కొరకొరచూస్తూ లోపలికి వెళ్ళింది.

"పాలడబ్బా తేలేదన్నమాట. మనం ఇన్ని నీళ్ళుతాగి పడుకోగలం గానీ, నోరు వాయిలేని ఆ పసిదాన్ని ఎలా వూరుకోబెట్టను ! అన్నింటికి గంగిరెద్దులా తల ఊపి, వెళ్ళి ఆ ఆఫీసులో కూర్చుంచారు. ఇంట్లో పెళ్ళాం పిల్లలు చచ్చిందీ బ్రతికిందీ మీకక్కరలేదు. ప్రొద్దుట వెళ్ళి సాయంత్రం ఇంటికొచ్చే మీకు నాచావెలా తెలుస్తుంది ..." దండకం ఆరంభించింది భార్య. ఆ మాటలు క్రొత్తవి, విననివిగావు, కనక సుబ్బారావు జవాబు చెప్పలేదు. చెప్పడానికేముంది ? బట్టలువిప్పి లుంగీ చుట్టబెట్టుకున్నాడు.

"మాట్లాడకండి. నేను వాగి వాగి చావడంతప్ప మీకేం బాధ. పసిపిల్లకి పాలులేవని చెప్పినా మాట్లాడకుండా బెల్లంకొట్టిన రాయిలా వూరుకునే మీరు మనిషా, బండరాయా ? బియ్యంలేవు ... ఇంకాసేపటికి ఆవురావురుమని పిల్లలొచ్చి పడతారు ... ఏం పెడతాను వాళ్ళకి నా శ్రాద్ధం ? ... మాట్లాడరేం ..."

"ఏం మాట్లాడమంటావు ? డబ్బుంటే తేవాలని నాకు తెలీదా ? డబ్బుకోసం అందర్నీ అడిగాను. ప్రతినెలా ఇరవై తారీకునించి మన బ్రతుకు అప్పుల బ్రతుకే. ఎవరిస్తారు అస్తమానూ ... అవి తీరవని వాళ్ళకి తెలిసి ఎలా యిస్తారు ..." నీర్సంగా అన్నాడు సుబ్బారావు.

"మరెలా ? ... పిల్లలకేం పెట్టను ? ... ఏ నీళ్లో ఆ నీళ్ల ఆవుపాలు పడదామన్నా, పాలది రెండు నెలలు బకాయి ఇస్తేనే గాని పాలుపోయనంది. దాని కాళ్ళా వేళ్ళా పడితే అర్ధశేరు ఇస్తుంది. కాఫీకి, మజ్జిగ నీళ్ళకి సరిపోతున్నాయి అని ... నేనేం చేస్తాను ..." దిక్కుతోచక తలకొట్టుకుంది సత్యవతి.

"వెధవ సంసారం, వెధవ పిల్లలు ... అందరం కలిసి కట్టగట్టుకు చద్దాం.

అప్పటికిగాని మనకి విముక్తిలేదు. వెధవపిల్లలు. పిల్లలా నా శత్రువులు గానీ, ఎక్కడలేని డబ్బూ వీళ్ళ పాలడబ్బాలకి, మందులకే చాలడంలేదు''.

"అవునవును ... పిల్లల్ని కనడం తెలుసుగానీ, పోషించేసరికి శత్రువులవుతారు ... పదండి వాళ్ళ పీకా, నా పీక కలిపి నొక్కేయండి ... తర్వాత హాయిగా వుందురు గాని ...'' అరుస్తూ కళ్ళొత్తుకుంది సత్యవతి.

"నోరు ముయ్యి కాసేపు, వెధవ గోల. అక్కడ చచ్చీ చెడి యింటికొచ్చేసరికి యిక్కడ నీ గోల. వెధవ సంసారం ఒక్కనాడూ సుఖంలేదు. మీరు కాదు నేనే చావాలి ఉరెట్టుకుని ... ఎక్కడ సుఖపడి పోతానో అని పీకకి నిన్ను కట్టబెట్టారు గుదిబండలా; చావటానికన్నా లేకుండా ...'' చాతకాని ఉక్రోషంతో అరిచాడు సుబ్బారావు.

"అనందనండి ... ఇంట్లో వస్తువులు లేదనడం నా తప్పు; ఎక్కడనించి తెచ్చి మీ అందరికి వండి వారుస్తా ననుకున్నారు. ఇరుగింటి నించి, పొరుగింటినించి పూట గడుపుకొస్తూంటే మీకు తెలీకుండా వుంది. యింక నా వల్ల కాదీ బదుళ్ళు తేవడం. ఎలా తెస్తారో, ఎక్కడనించి తెస్తారో బియ్యం తెస్తేనే వండుతాను ... లేకపోతే పస్తులుండండి ...'' విసురుగా వెళ్ళిపోయింది సత్యవతి.

సుబ్బారావుకి ఈ సంసారం గురించి తలుచుకోటానికి భయం. నలుగురు పిల్లలతో నూటఎనభై రూపాయల జీతంతో ఈ సంసారం ఎలా యీదాలో సుబ్బారావుకి తలబద్దలు కొట్టుకున్నా తెలియదు. చాలీచాలని జీతం, ఆకాశాన్నంటే ధరలు, ఆకలి, ఏడ్పు, రోగాలు, రొచ్చులు, మొత్తుకోళ్ళు, వీటన్నిటినించి తనకి విముక్తి ఎలాగో పాపం సుబ్బారావుకి అర్థంగాని విషయం. 'లేదు' 'లేదు' అన్న పదం తప్ప 'వుంది' అన్న మాట సుబ్బారావు డిక్షనరీలో ఎంత వెతికినా కనపడదు...

'లేదు' యీ పూట అన్నం లేదు గాబోలు, ఆ మాట అనుకుంటే సుబ్బారావు ఆకలి మరింత పెరిగింది. సాయంత్రం ఇంటికొచ్చాక ఆ పోసే కాఫీనీళ్ళన్నా పోయలేదు భార్య. ఉదయం రెండు చెంచాలు కాఫీ గుండ అప్పుతెచ్చి కాఫీ చేసింది. కాఫీపొడి లేదని నిన్ననే చెప్పేసింది. తెలుసుండి అడిగి చివాట్లు తినడం ఎందుకని ఊరుకున్నాడు సుబ్బారావు. సత్యవతి ఎక్కడో అప్పుతెచ్చి అన్నం వండి వుండదా



అన్న చిన్న ఆశ వుంది అతనికి. భోజనానికి పిలుపుకోసం వళ్ళంతా చెవులు చేసుకుని ఎదురు చూశాడు. ఎంతకీ సత్యవతి పిలవలేదు, నిజంగానే చేయలేదా ఏమిటిఖర్మ! వంటింటివైపు వెళ్ళి చూడాలంటే అభిమానం అనిపించింది. చాపేసుకుని, కాళ్ళు ముడుచుకుని పొట్టలో పెట్టుకుని పడుకున్నాడు సుబ్బారావు. చిన్న కునుకు పడుతూండగా 'అన్నానికి దయచేయండి' అన్న సత్యవతి పిలుపు వినిపించింది. దిగ్గున లేచాడు సుబ్బారావు. ఆ పిలుపులో ఆప్యాయత, ఆదరణ లేదని తెలిసినా పౌరుషం అన్న మాటకి అర్థం మరిచిపోయిన సుబ్బారావు వెంటనే లేచివెళ్ళి విస్తరిముందు కూర్చున్నాడు. ఆవురావురుమంటూ వెళ్ళిన సుబ్బారావుకి విస్తరి చూసేసరికి ఆకలి చచ్చి పోయింది. ఇంత పెసర పచ్చడివేసి అన్నం వడ్డించింది భార్య. "కూరేం చెయ్యలేదూ?" భయపడుతూనే అడిగాడు సుబ్బారావు. "ఆ.... చేస్తాను ... సంచులతో కూరలు తెచ్చి నా మొహాన దిమ్మరిస్తున్నారు ... రెండు పూటలా కూరలు వండి వారుస్తాను..." చేతులు తిప్పుతూ పెళుసుగా అంది సత్యవతి. పచ్చడి కలిపి నోట్లో పెట్టుకుంటే గొంతు దిగనంది. "ఓ నెయ్యి చుక్కో, నూనె చుక్కో వెయ్యి" అందామని నోరు తెరిచి మళ్ళీ మూసుకున్నాడు సుబ్బారావు వచ్చే జవాబు తెలిసి.

"మధ్యాహ్నం పాదున కాసిన నాలుగు దొండకాయలు మీ మట్టుకు కూరచేశాను, పిల్లలకైనా ఓ ముక్క వేయకుండా. గుప్పెడి పెసర పప్పుంటే యీ పూటకి పచ్చడన్నా చేశాను. రేపు అదీ వుండదు ..." సత్య పతి ఏదో చదువుతూనేవుంది. సుబ్బారావు పచ్చడి ముద్దలు గుటుకు గుటుకు మింగి చారు అనబడే వేడినీళ్ళు పోసుకుని రెండు ముద్దలు తిని, మజ్జిగ అనే చల్లనీళ్ళు వేసుకున్నాడు "యింత ఉప్పన్నా తగలెయ్యి" మొగం చిట్లించి అన్నాడు మజ్జిగ అన్నం నోట్లో పెట్టుకుని.

"బావుంది విసుగు, గడ్డ పెరుగు వేస్తాను, మీరు రెండు చేతుల్తో డబ్బు పోస్తున్నారని ... డబ్బు మాట ఎత్తితే నా అంత ఎత్తు ఎగురుతారు గానీ, విస్తరి ముందు కూర్చునే సరికి విస్తరి నిండాలి ..."

"నోరు మూద్దూ ... యీ తిండన్నా తిననిస్తావా, వెధవ సొదా నీవూ ..." కసిరాడు సుబ్బారావు. చెయ్యి కడుక్కుని గదిలోకి వెళ్ళేసరికి పిల్లలు చింకి

చాపలమీద, కుళ్ళు బొంతలమీద ఒకర్నొకరు కరుచుకుని నిద్రపోతున్నారు. వాకిట్లో వున్న మంచి ప్రక్కమీద నడుం వాల్చాడు. గట్టిగా కాళ్ళు చాచుకుంటే ఏ పెట్టెలో, సామానులో కాళ్ళకి తగుల్తాయి. ఒకేగది - సామాను గది, పడకగది అన్నీ అదే. ఇంకోటి వంటగది. నలుగురూ ఒక్కసారి కూర్చుని భోజనం చెయ్యడానికి సరిపోదు ... అదే ముప్ఫై రూపాయలద్దె ! ... నిద్రపోతున్న పిల్లలవైపు చూడడానికికూడ సుబ్బారావుకి భయం; వాళ్ళ భవిష్యత్తు భూతంలా ఎదుట నిలబడి భయపెడ్తోంది. వెధవ బ్రతుకు ! కన్నపిల్లలే శత్రువుల్లా కనబడుతున్నారు. తనలాంటివాళ్ళు అసలు పెళ్ళిచేసుకోడానికి వీలులేదని గవర్నమెంటు రూలు పెట్టాలి. పెళ్ళి చేసుకున్నా పిల్లల్ని కనరాదని. రూలు ఉల్లంఘించిన వారికి ఉరిశిక్ష వేయాలి. అప్పుడుగాని తనలాంటివారికి విముక్తిలేదు. తన ఆలోచనలు తనకే విపరీతంగా కనిపిస్తాయి సుబ్బారావుకి. చాతకాని చవట ఆలోచనలు ! ... చంటిదిలేచి ఆకలి గాబోలు గీపెట్టి ఏడుస్తూంటే సుబ్బారావు ఆలోచనలు చెదరిపోయాయి.

లేచి సముదాయించడానికికూడా ఓపికలేనట్టు అలా చూస్తూ వుండి పోయాడు. భోంచేస్తున్న సత్యవతి విసురుగా వచ్చి మొగుడివైపు తీక్షణంగా చూసింది. "చంటిపిల్ల ఏడుస్తున్నా వినిపించడంలేదా ? ... ఆహా ... హా ! శత్రుత్వం ... కన్న పిల్లలమీద శత్రుత్వం సాగించే తండ్రిని మిమ్మల్నే చూశాను. నోరుముయ్యవే ముండా, ఏడిచావంటే చంపేస్తాను యీసారి ... రెండు మెతుకులు తినడానికికూడా నోచుకోలేదు యీ కొంపలో ... ఎంత పాపం చేసుకుని యీ కొంపలో పడ్డానో ! ఏ నోములు, ఏ పూజలు చేసుకుంటేనో యిలాంటి మొగుడు ... యీ పిల్లలు ... రామచంద్రా ! పగవాళ్ళకికూడా వద్దు యీ సరకం ! ...'' తన నెత్తి బాదుకుంది. అంటచేత్తోనే పిల్లవీపున రెండు బాదింది. తీసికెళ్ళి వంటింట్లో కూలేసింది పిల్లని. సుబ్బారావుకిదేం కొత్తకాదు. ఒక్కర్తి చేసుకోలేక, యీ సంసారం యీదలేక విసుక్కుంటుంది. ఆ అరుపులు, కేకలు లెక్కచెయ్యకుండా నిర్వికారంగా వుండడం ఏనాడో అలవాటు చేసుకున్నాడు సుబ్బారావు.

ఎప్పటికో ఇల్లు సద్దుమణిగింది. "వెధవ దోమలు, ఉక్క ... అబ్బబ్బ రాత్రన్నా సుఖంగా పడుకోడానికి లేదు గదా. ఆరుబయట పడుకోడానికన్నా అదృష్టంలేదు

యీ కొంపలో ... "పగలంతా చాకిరిచేసి రాత్రన్నా సుఖనిద్రకి నోచుకోడానికి లేదని ఆపసోపాలు పడుతూ విసురుకొంటున్న భార్య దగ్గిరికి జరిగాడు సుబ్బారావు. "వెళ్ళండవతలికి" విసిరికొట్టింది చెయ్యి సత్యవతి. "ఏం వున్నా లేకపోయినా, దీనికి లోటులేదు. నా దగ్గిరికి రాకండి ... చెపుతున్నాను, వెళ్ళండవతలకి సిగ్గులేకపోతే సరి ..." విదిలించి కసిరింది సత్యవతి. అన్ని విషయాల మాదిరిగానే యీ విషయంలోనూ భార్య మాటలు విదిలింపులు లెక్కచెయ్యడం మానేశాడు సుబ్బారావు. ఆ కసుర్లు లెక్కచేసి, తన బ్రతుకులో డబ్బవసరం లేని ఏకైక సుఖాన్ని, ఆ కొద్ది క్షణాల ఆనందాన్ని, ఆ స్వర్గాన్ని దూరం చేసుకొలేదు సుబ్బారావు !

✲ ✲ ✲

"సారీ ! శాంతా ... అయిదు గంటలకి బయలుదేరేవేళకి అర్జంటుగా ఏదో పనుందని ఛీఫ్ ఇంజనీరు ఫోనుచేసి ఆఫీసుకి రమ్మన్నారు. లేటయిపోయింది." కారు గోరేజిలో పెట్టి లోపలికి వస్తూనే అన్నాడు కృష్ణమూర్తి, మొహం ముడుచుకుని లోపలికి వెళ్ళిపోతున్న శాంతతో, వెడుతూ. శాంత మాట్లాడకుండా లోపలికెళ్ళి కాఫీ తెచ్చి టేబిల్ మీద పెట్టింది. ముస్తాబు చేసుకుని రడీగా వున్న శాంతని నిరుత్సాహపరచవలసి వచ్చినందుకు నొచ్చుకున్నాడు మూర్తి. "కోపం వచ్చిందా శాంతా ! .... ఏంచెయ్యమంటావు చెప్పు, హెడ్ ఆఫీసుకి వెళ్ళి ఆ కాగితాలు చూపించి పని పూర్తిచేసుకుని వచ్చేసరికి ఆలస్యం అయింది. రేపు వెడదాం."

"ఇవాళ ఆఖరి రోజనిగాదూ, మీతో అంతలా చెప్పాను" మొహం ముడుచుకొనే అంది శాంత.

"అయితే నన్నేం చెయ్యమంటావు. పోనీ సెకండ్‌షోకి వెడదామా ?"

శాంత మొఖం ఒక్కక్షణం వెలిగింది. అంతలోనే నిరుత్సాహంగా - "పిల్లలో" అంది.

"పోనిద్దూ ... యీ సినిమా చూడకపోతే ఛస్తామా. ఇది కాకపోతే మరోటి రేపు చూద్దాం. ఈ నగరంలో సినిమాలకేం కొదవ. రేపు దేనికోదానికి వెడదాం. ఓకే" భుజంమీద చెయ్యివేసి దగ్గరకి తీసుకొని భార్యామణి ఆలక పోగొట్టడానికి ప్రయత్నిస్తూ అన్నాడు కృష్ణమూర్తి.



"సర్లెండి. వదలండి ..." చీర మార్చుకోడానికి లోపలకెళ్ళింది శాంత.

కాఫీ తాగి, ప్రొద్దుట పూర్తిచేయని పేపరు చేతిలోకి తీసుకున్నాడు. ఆడుకోడానికి వెళ్ళిన ఎనిమిదేళ్ళ రవి, ఆరేళ్ళ బేబి తండ్రి రావడంచూసి పరుగెత్తుకు వచ్చారు. ఇద్దరూ చెరోవైపు తండ్రిమీద పడ్డారు. "డాడీ బొమ్మల పుస్తకాలు తెచ్చావా? డాడీ నా బూట్సు చాలడంలేదు. క్రొత్తవి కొనాలి డాడీ," అంది బేబి. "ఆ ... నీకేనేంటి క్రొత్తవి, నా బూట్లు చిరిగిపోతున్నాయి. నాకూ కొనాలి డాడీ" రవికూడా గొడవ చేశాడు."

"అలాగే ... అలాగే ... కొంటానన్నాగా. ఫస్టు రాగానే కొంటానుగా ... మరి అల్లరి పెట్టకండి ఇంక. యిప్పుడు గొడవ చెయ్యకండి. జీతం రాగానే కొంటాను ... ఏం" ఇద్దర్ని దగ్గరికి తీసుకుని మద్దుపెట్టుకుని అభయం ఇచ్చాడు మూర్తి.

"బాగుంది ... బొమ్మల పుస్తకాలకి కూడా ఫస్టు రావాలా ఏమిటి ? బొత్తిగా గుమస్తాలా మాట్లాడుతారు" నవ్వింది శాంత.

"పేరుకి గెజిటెడ్ ఆఫీసర్ని. క్లాస్‌వన్ ఆఫీసర్ని. తొమ్మిది వందల జీతం అన్న పేరేగాని మనదగ్గర ఏముంది ? నెలాఖరికి దమ్మిడీ వుండదు చేతిలో ... ఎంత చెట్టుకు అంతగాలి. రెండొందల జీతగాడికి అది చాలదు, వెయ్యి వచ్చినా మనకు చాలదు ... వెధవది ఓ స్టేటస్ అంటూ ఏడ్చిందిగా, అది మైన్‌టైన్ చెయాలంటే ... వెయ్యి రూపాయలనగా ఎంత ?..."

"అవునులెండి గానీ ....యివాళ పేపర్లో చూశాను. కొత్తగా ఆల్విన్ ఫ్రిజిడేర్లు వాయిదాలమీద కొనుక్కోవచ్చని వుంది ... మనమూ కొందామా ?"

"మనకు రిఫ్రిజిరేటరెందుకు?" అన్నాడు మూర్తి.

"మనకెందుకేమిటి ? బాగుంది. చల్లని నీళ్ళు త్రాగుతాం. కూరలకి, పళ్ళకి రోజూ బజారుకి పరుగెత్తకుండా వారానికోసారి కొని దాచుకోవచ్చు ... కొందామండీ ... ఒకసారంటే డబ్బు పోగవదుకానీ, నెల నెలా తీర్చుకోవచ్చుగా ... ఉత్సాహంగా అంది శాంత.

"అబ్బ ఇప్పుడు ఎందుకు చెప్పు, కోరికలకి అంతంటూ ఎక్కడ వుంది.



కారు కారన్నావు దాని లోను యింకా తీరలేదు ... యిప్పుడు మళ్ళీ దీనికి కూడా జీతంలో నెల నెలా కోత అవుతూంటే యింక మిగిలింది మనం ఏం తింటాం?''

"మీరెప్పుడూ యింతే ! ఏ సరదా లేదు ... ఎప్పుడూ ఏదో తిండికి మాడి పోతున్నట్టు మాట్లాడతారు ... చేసేది ఆఫీసరు పని. ఆ మాత్రం ఫ్రిజిడేరు కొనుక్కునే తాహతు మనకు లేదా ? ... ఆ రామ్మూర్తి మీ కంటె పెద్ద ఆఫీసరా ఏమిటి ?''

"రామ్మూర్తికేం ... ఫ్రిజిడేర్లూ కొంటాడు ... ఎయిర్ కూలర్లు పెట్టిస్తాడు ... అతనితో మనకేమిటి వంతు ... అడ్డదార్లు తొక్కితే ఏదన్నా చెయ్యొచ్చు ...''

"పెద్ద సత్యసంధులు బయలుదేరారులెండి .... ఏదిచెప్పినా యిలాగే అంటారు....'' కోపంగా లేచి వెళ్ళిపోయింది శాంత.

ఈ ఆడవాళ్ళకి బొత్తిగా ముందుచూపుండదేమిటో ఖర్మ చిరాకు పడ్డాడు మూర్తి. యీ కోరికలకి అంతెక్కడ. స్కూటర్ అంది ముందు. తరవాత పిల్లలు ముగ్గురయ్యారు. స్కూటర్ చాలదు, కారు కొనాల్సిందే అంటే లోను తీసుకుని కారుకొన్నాడు. పోనీ కారుంటే టిఏ వస్తుంది, కారు లోను తీరిపోతుందిలే అని ఒప్పుకున్నాడు. ఇప్పుడు ఫ్రిజిడేరు అంటుంది ... తరువాత టేపురికార్డర్, రేడియోగ్రా అంటుంది. ఇంకొన్నాళ్ళుపోతే ఎయిర్ కూలరు లేకపోతే వుండలేనంటుంది ... ఆఫీసరన్న పేరు తప్ప గవర్నమెంటు జీతాలెంత ? ఏం సరిపోతుంది ? ఇంటద్దె రెండు వందలు. సరే, హోదాకి తగినట్టు ఇంట్లో ఫర్నిచరుండాలిగదా! సరే, వంటవాళ్ళని యీ రోజుల్లో భరించలేంగదా అని శ్రీమతి కష్టపడకుండా గ్యాస్‌స్టవ్‌లు, ప్రెషర్ కుక్కర్లు మొదలైన ఆధునిక సామాగ్రి కొన్నాడింట్లో ... పిల్లలు ముగ్గురు. ఇద్దరికి కాన్వెంటు స్కూలు జీతాలు, బస్సు ఖర్చులు, తిండి ఖర్చు ఏది తగ్గించుకోలేరుగా. వాళ్ళకి పాలు, పళ్ళు, గ్రుడ్లు ఏదీ మానలేరు. పిల్లల్ని సవ్యంగా పెంచాలనిగాదూ ముచ్చటగా ముగ్గురుని కన్నది. వాళ్ళ ఆరోగ్యం కంటే ఏది ముఖ్యం? ఇంక సరే సినిమాలు, మాగజైన్సు .... చిల్లర ఖర్చులు ఎన్నో. ఏందీ మానలేదు. నెలాఖరికి దమ్మిడీ మిగలదు ! క్రింద తరగతివారితో కలవలేరు, పై తరగతి వాళ్ళని అందుకోలేరు. ఎటూకాని త్రిశంకు స్వర్గం తమది.



యీ బాధలేం ఆడవాళ్ళకి అర్థంగావు. పెళ్ళయిందగ్గర నించి సినిమా సెట్టులాంటి యిల్లు, సినిమా జీవితం లాంటి జీవితం కావాలి వినుగ్గా అనుకున్నాడు మూర్తి.

శాంత వంటింట్లో దబదబ గిన్నెల చప్పుడు చేస్తూంది. అంటే కోసం వచ్చిందన్నమాట ! ఇంక, యీ ఫ్రిజిడేరు కొంటాననేవరకు ప్రాణం వున్న వాటిమీద, లేనివాటిమీద కంబయిండ్‌గా కోపం తీర్చుకుంటుంది. భోజనం దగ్గరకూడా ఏం మాట్లాడకుండా విసురుగా వడ్డించింది. పిల్లలేదో అడిగితే 'నోరుమూసుకుని అన్నం తిని వెళ్ళండి' అని కసిరింది. పలకరిస్తే మరింత చిందులు తొక్కుతుందని మాట్లాడకుండా తిని లేచి వెళ్ళిపోయాడు కృష్ణమూర్తి.

పిల్లలకి నైట్ డ్రస్సులు తొడిగి, దోమతెరలు దించి, ఫానువేసి, గుడ్‌నైట్ చెప్పి, టేబుల్ లైటు వేసుకుని పుస్తకం తీసుకున్నాడు చదవటానికి కృష్ణమూర్తి. శాంత వంటిల్లు సర్దివచ్చి మాటా మంతీలేకుండా తనూ ఓ పు స్తకం తెరిచింది.

కృష్ణమూర్తి పుస్తకంమీద దృష్టినిలవలేదు. శాంత అలామాట్లాడకుండా ముభావంగా వుంటే ఏదోలా అనిపించింది. ఉదయం పదిగంటలలోపున పని తొందరలో హడావిడిగా వుంటుంది శాంత. తామిద్దరూ ఏం మాట్లాడుకున్నా రాత్రి భోజనం అయ్యాక ఓ గంటా రెండు గంటలు. శాంత ఏవేవో కబుర్లు చెపుతూంటే యిట్టే గడిచిపోయేది కాలం. శాంతతో మాట్లాడకుండా తనొక్క క్షణం వుండలేడు.

"శాంతా .. అలా వున్నావేం ..." చేయిపట్టుకుని అడిగాడు.

"ఎలా వున్నాను!" పుస్తకంలోంచి దృష్టి మరల్చకుండానే అంది శాంత.

"కోపంగా వున్నావు ... మాట్లాడవేం ... కోపం వచ్చిందా ?"

"వస్తే మీకేం ?"

"ఏమిటి శాంతా ! మరీ చిన్న పిల్లలా అవుతావు ... ప్రతిదానికీ అలకేనా ... నాకు బోలెడు కోరికలున్నాయి. కానీ మన అంతస్తు చూసుకోవద్దూ ..."

"ఏం నేనేం కోరరాని కోరికలు కోరాను ... వజ్రాలు, వైఢూర్యాలు కావాలన్నానా? ఎయిరోప్లేనులలో త్రిప్పమన్నానా? ఎయిర్ కూలర్లు కావాలన్నానా,



ఏం మన తాహతు ఫ్రిజిడేరు కొనుక్కునే పాటిదిగాదా ... '' పుస్తకం ప్రక్కన పడేసి గయ్‌మంది శాంత.

"ఆ ... ఇదయ్యాక ఒక్కొక్కటీ అవీ కావాలంటావు'' నవ్వాడు.

"కావాలంటే అన్నీ కొనేస్తున్నారు కాబోలు. ప్రతిదానికీ ఇన్నిసార్లు అడిగితేగాని ఏదీకాదు, అన్నీ అడగ్గానే అమరుస్తున్నట్టు మాట్లాడకండి ... కొనకపోతే మానేయండి ... సరదా నా కొక్కదానికేనా ? యిప్పుడు కాకపోతే ముచ్చట ఎప్పుడు తీరుతుంది? వస్తువు యింట్లో వుంటుందిగదా అనిగానీ ...''

"అవుననుకో. కాని డబ్బేది ... చూస్తున్నావుగా ఖర్చులు ... పిల్లలు పెద్దవాళ్ళవుతున్నారు. రేప్పొద్దున వాళ్ళ చదువులు, పెళ్ళిళ్ళు అన్నీ జరగాలి ... ఈ రోజుల్లో చదువులు, ఉద్యోగాలకి అవస్థలు ఎలా వున్నాయో చూస్తున్నావుగా. వాళ్ళ భవిష్యత్ ఏమిటా అని ఆలోచిస్తే బెంగగా వుంటుంది ... వాళ్ళకి పెద్ద చదువులు చెప్పించాలంటే యిప్పుడు మనం జాగ్రత్తగా వుండాలి.''

"అబ్బ ! ... ఏదో పిల్ల పెళ్ళికి ఎదిగి కూర్చున్నట్టు, మొగపిల్లలిద్దరూ ఏ మెడిసనో, ఇంజనీరింగో చదువుతున్నట్లు మాట్లాడతారేమిటి ? ... పట్టుమని పదేళ్ళయినా లేని పిల్లలగురించి యిప్పటినించీ బెంగ ?''

"యిప్పటినించీ లేకపోతే అప్పుడెలా వస్తుంది ? ...''

"బాగుంది ... ఎల్లకాలం మీరీ జీతంతోనే వుంటారా. పిల్లలు పెద్ద వాళ్ళయినట్లే మీ జీతం పెద్దదవదా ? అయినా, నేనేదడిగితే వెంటనే చేశారుగనక .. వద్దులెండి ... మానేయండి. సరదాకి అడిగాను అంతే ...'' మొహం ముడుచుకుని అంది శాంత.

"అదిగో ఆ కోపమే వద్దన్నాను ... అంత కోపం అయితే ఎలా ? సరే ... నాకేం పోయింది. కొనమంటే కొంటాను ... నా ఆరాటం అంతా మీ గురించేగా ... మీ భవిష్యత్తు గురించి నీకంత నిబ్బరంపుంటే నాకు మాత్రం ఏం భయం ? ... అలాగే రేపువెళ్ళి కొందాం ... సరేనా ? ...''



భార్య మొహంలో విరిసిన ఆనందంచూసి తృప్తిగా నవ్వాడు కృష్ణమూర్తి. శాంత యీసారి భర్తచేయి తీసేయలేదు.

***

పోర్టికోలో కాడిలాక్ కారాగింది. డ్రైవరు తలుపుతెరిచి పట్టుకున్నాడు. రాజారావు చిరాగ్గా ఏదో ఆలోచిస్తూ కారు దిగి, ఎదురొచ్చిన నౌకరు మీదికి చేతిలో కోటు విసిరాడు. బెడ్‌రూమ్‌లోకి వెడుతూనే కేకలు పెట్టాడు బంట్రోతుమీద ...'' నీకెన్నిసార్లు చెప్పాను, నేనొచ్చేసరికి యీ గది చల్లగా వుండాలని ? యిప్పటివరకు ఏం చేస్తున్నావు ?''

నౌకరు నీళ్ళు నమిలాడు. గబగబ వెళ్ళి ఎయిరూలర్ స్విచ్ ఆన్ చేశాడు.

"గెటౌట్!'' విసుగ్గా అరిచాడు రాజారావు. వాడు అతివినయంగా "చా తెమ్మంటారా సాబ్ !'' అనడిగాడు. రాజారావు ఫోమ్‌సోఫాలో ఫోమ్ తలగడాకి జారగిలబడి కాళ్లూ చేతులూ జాచుకుని కూర్చున్నాడు. వాచి చూచుకున్నాడు ... ''అక్కరలేదు....'' అన్నాడు. వాడు వెళ్ళిపోతుంటే మళ్ళీ ఏదో గుర్తువచ్చి "అమ్మగారేరి?'' అడిగాడు.

"క్లబ్బుకి వెళ్ళారు సాబ్ ! ...''

"ఎవరితో ?''

"తులానీసాబ్ వచ్చారు ... ఇద్దరూ వెళ్లారు ...''

"హు'' రాజారావు చేతిలో సిగరెట్టు వేళ్ళమధ్య నలిగిపోయింది. కసిగా నలిపి ఏష్ట్రేలో పారేశాడు. "తులానీ !'' ఆ పేరు తలుచుకుంటే రాజారావు వళ్ళు మరింత చిటపటలాడింది. లేచి విసురుగా పచార్లు సాగించాడు. మళ్ళీ కూర్చుని తల రెండుచేతులతో నొక్కుకున్నాడు. కణతలు బ్రద్దలవుతున్నాయి. ఫ్యాక్టరీలో యింతసేపూ రెండొందలమంది కూలీలు ఘెరావో చేసి కదలనీయలేదు. తలనొప్పి మరింత ఎక్కువయింది ఇంటికొచ్చేసరికి. ఎప్పుడూ అంతే. తన తలనొప్పి యింటికొచ్చేసరికి మరింత ఎక్కువవుతుంది ? శారీరకబాధ ... మానసిక ఆవేదన రెండూ మరచిపోవాలంటే ఒకటే దివ్యౌషధం.''ఖుషీరామ్'' పెద్ద కేకపెట్టాడు




రాజారావు. నౌకరు చేతులు కట్టుకు నిలబడ్డాడు. "గ్లాసులు, ఐసు తీసుకురా!" అన్నాడు. బీరువాలోంచి వాట్ 69 తీసి ఐసు వేసుకుని కలుపుకున్నాడు రాజారావు. సోడా వేసి ... ఒక పెగ్ త్రాగేసరికి మనసు చల్లబడింది ... అలా సిగరెట్టు త్రాగుతూ రెండు మూడు పెగ్‌లు పూర్తిచేశాడు. అలవాటయిన కారణంగా అతనికేం కాలేదు. కానీ ఈ లోకంలోంచి కాస్త మైమరపించింది. ఆవేదన తగ్గిందనిపించింది. ఓ గంట అయ్యాక మళ్ళీ నౌకరుని పిలిచాడు. "స్నానం చేస్తాను, టబ్ నిండా నీళ్ళు నింపు !" ఆజ్ఞాపించాడు. ఖుషీరామ్ టబ్‌నిండా నీళ్ళునింపి, టవల్స్ రెడీచేశాడు. ఆయ్యగారి బూట్లువిప్పి, బాత్‌రూము శాండల్సు కాలికి తొడిగాడు. చన్నీళ్ళలో లవండర్ సబ్బుతో స్నానం చేశాక కాస్త సేదదీరి, అతని వళ్ళు, మనసు చల్లబడింది. అలా టబ్‌లో పడుకునే సిగరెట్టు వెలిగించుకున్నాడు. ఎదురుగా తీసిన తలుపు సందులోంచి గదిలోని రమ బస్టుసైజు ఫొటో నవ్వుతూంది. రాజారావు మొఖం తిప్పుకున్నాడు. రమ రమాదేవి లక్షల కధికారి రాజారావు భార్య. లోకానికి అంతే తెలుసు. పేరుకి మాత్ర మే తన భార్య. రాజారావు క్రూరంగా నవ్వుకున్నాడు! ఆవిడకి తనడబ్బు, తన హోదా పనికొస్తుంది ? తను పనికిరాడు? ఆవిడ లోకం వేరు, తనలోకం వేరు. ఆవిడ లోకం క్లబ్బులు, కాక్‌టైల్సు, పార్టీలు, డాన్సులు, ఫ్రెండ్సు ... తనలోకం ఫ్యాక్టరీలు, కూలీలు, ఘోరావోలు, స్టయికులు, లాభ, నష్టాల బేరీజులు. ఆమె లోకంలోకి తన లోకంనించి వెళ్ళలేదు. వెళ్ళడానికి మనసూలేదు, టైమూలేదు. తన లోకంలోపడి శ్లేష్మంలో ఈగలా కొట్టుకుంటున్నాడు. ఆవిడాలోకంలో విహంగంలా విహరిస్తుంది.

అలా అరగంట నీళ్ళల్లో కూర్చుని లేచి పైకి వచ్చాడు రాజారావు. నైటు సూటు తొడుక్కుని పిల్లల గదిలోకి వెళ్ళాడు. తొమ్మిదిన్నర. పిల్లలిద్దరూ సిల్కు నైట్‌డ్రస్సులలో ఫోమ్‌బెడ్లమీద, ఎయిర్ కూలర్ చల్లపరిచిన గదిలో నిద్రపోతున్నారు ప్రశాంతంగా. వాళ్ళ ఆయా క్రింద పడుకుని గుర్రుపెడుతూ నిద్రపోతూంది. అదృష్టవంతులు నిట్టూర్చాడు రాజారావు. వంగి, పిల్లలిద్దర్ని ముద్దు పెట్టుకున్నాడు. కర్టన్లులాగి నెమ్మదిగా గదిలోంచి బయటికి వచ్చాడు. అంతామరచి పిల్లలతో హాయిగా కాసేపు గడపడానికన్నా నోచుకోలేదు తను. వాళ్ళటైము తన టైము



కుదరదు. కా సేపు ప్రొద్దుట ఎనిమిది గంటలకేలేచి తయారై బ్రేక్‌ఫాస్ట్ తీసుకుని పైకి వచ్చేసరికే ఇద్దరూ కారులో కాన్వెంటుకి వెళ్ళిపోతారు. రాత్రి తను వచ్చేసరికి నిద్రపోతారు. ప్స్ ... ఏం బ్రతుకో ! పిల్లలకి, మంచి ఇంగ్లీషు సినిమా ... పిల్లల సినిమా వచ్చింది తీసికెడతానని ప్రామిస్ చేశాడు. రోజూకంటే ముందు బయలుదేరాడివాళ. వెధవలు కూలీలందరూ కట్టకట్టుకుని ఘెరావో చేశారు రెండు గంటలు. రాస్కెల్స్, డర్టీరోగ్స్ ! షూట్‌చేసి పారెయ్యాలి వెధవల్ని. రోజూ స్ట్రయికులు, ఘెరావులు. రోజుకోసారి జీతం పెంచాలి. తిండిలేని వెధవల్ని పిలిచి కూలీయిస్తే తల తిరుగుడు. వాళ్ళకోరికలు తీరుస్తున్నకొద్దీ పెరుగుతుంటాయి. వాళ్ళనని ఏం లాభం: వాళ్ళని నెత్తె క్కించుకుని తమమీదకి ఉసికొల్పే ప్రభుత్వాన్ని అనాలసలు. వెధవ ఫ్యాక్టరీలు మూసిపారేసి, ఏదో ధరకి అమ్మిపారేసి, ఆ ఉన్నడబ్బుతో ఎక్కడో ప్రశాంతంగా జీవితం గడపాలనిపిస్తుంది. కానీ ! ... లాభంలేదు. యిదో ఊబి. యిందులో దిగాక మరి లేవలేరు; యీ జీవితం అందించే సౌఖ్యాలపై లోభం తమని ఆ ఊబిలోంచి పైకి రానీయదు !

పదిగంటలు కొట్టింది! ఆవిడగారి కోసం ఎదురుచూడడం దండగ! రాజారావులేచి డైనింగ్ రూములోకి వెళ్ళాడు. కునికిపాట్లుపడుతున్న వంటవాడు గాభరాగా లేచి అన్నీ అమర్చాడు టేబిల్‌మీద. భోజనం అయిందనిపించుకుని ఇవతలికి వచ్చాడు. బెడ్ ప్రక్కన లాంప్ స్విచ్ నొక్కి ఓ యింగ్లీషు నవల తీసుకున్నాడు చదవడానికి. పదకొండు కొట్టాక కాసేపటికి బయట కారు చప్పుడు వినిపించింది. దాంతోపాటు నవ్వులు, బైబైలు, గుడ్‌నైట్లు వినిపించాయి. కూనిరాగంతీస్తూ కులాసాగా లోపలికి వచ్చిన రమని పుస్తకంలోంచి చూశాడు రాజారావు. రమతోపాటు ఖరీదయిన వింత సెంటు పరిమళం గదంతా అలుముకుంది. ఆ సెంటు తమది కాదు ! ఎవరిదో రాజారావుకి తెలుసు! రాజారావుని చూసి కూనిరాగం ఆపింది రమ. బ్యాగు డ్రస్సింగ్ టేబిల్ మీదికి విసిరి, అద్దంలో వయ్యారంగా తన అందం చూసుకుంది. సావకాశంగా ఫ్యాషన్‌గా చుట్టిన సిగలోంచి పిన్నులన్నీ లాగింది. జుత్తు బుజాలమీదికి జారేట్టు బ్రష్ చేసుకుంది. కర్టెనులాగి బట్టలు మార్చి నైలాన్ నైట్‌గౌను తొడుక్కుంది. బాత్‌రూమ్‌కి



వెళ్ళి ముఖం కడుక్కొని పొడరద్దుకుని వచ్చింది. డైనింగ్ రూములోకి వెళ్ళి భోజనం చేయనని వంటవాడితోచెప్పి వచ్చింది. ప్రక్కదగ్గిరికివచ్చి తలగడలు సర్దుకుని పడుకోబోయింది. అంతా ఒకవంక కనిపెడ్తున్న రాజారావుకి వళ్లు ఉడికిపోయింది. ఎంత నిర్లక్ష్యం ! ఎంత తలతిరుగుడు. మొగుడన్న మనిషి ఎదురుగావుంటే చూడనైనా చూడనట్టు, పలకరించకుండా ఎంత తలబిరుసుగా ప్రవర్తిస్తుంది. ఇంట్లో కట్టుకున్న మొగుడుండగానే బయట ఎలాంటి వేషాలు వేస్తూంది ! హు ... తనే కొమ్ములు యిచ్చాడు మొదట. యీ రోజు విచారించి ప్రయోజనం ఏమిటి ? ... పరువు, ప్రతిష్ఠ కోసం అన్నీ సహిస్తున్నకొద్దీ మరింత చెలరేగుతూంది ... ఎన్నాళ్ళిలా! రాజారావు ఎంత అణుచుకుందామని ప్రయత్నించినా ఆవేశం అణగలేదు. నెమ్మదిగా పుస్తకం ప్రక్కన పెట్టాడు.

"టైమెంతయిందిప్పుడు ?" రమ మొహంలోకి సూటిగా చూశాడు రాజారావు.

"పదకొండున్నర ..." అతి వినయంగా జవాబిచ్చింది.

"ఇంతవరకు యిల్లు గుర్తులేదా?" కోపం వస్తున్నా సౌమ్యంగానే అడిగాడు.

"వచ్చింది కాబట్టే వచ్చాను ..." నిర్లక్ష్యంగా పడుకుంది రమ.

"ఏం, పాపం తులానీ యింట్లో పడుకోలేకపోయావా, ఇంత రాత్రి రాకపోతేనేం..."

రమ గిరుక్కున తిరిగి తీక్షణంగా చూసింది ... ఏదో విసురుగా అనబోయి పూరుకుంది.

"ఏం మాట్లాడవు ... అర్ధరాత్రి వరకు యిల్లుపట్టకుండా తిరగటంలో నీ ఉద్దేశం ఏమిటి ?" తీక్షణంగా అడిగాడు.

"ఇంట్లో తోచకపోతే క్లబ్బుకి వెళ్ళడం తప్పా ? తమరు వెళ్ళి ఆ ఫ్యాక్టరీలో కూర్చుంటే నేనిక్కడ గోళ్ళుగిల్లుకుంటూ కూర్చోవాలా ? రమ గొంతు హెచ్చించింది.

"తోచకపోతే ... అర్ధరాత్రి వరకు పరాయి మగవాళ్ళతో త్రాగి తందనా లాడుతున్నారా అందరాడాళ్ళూ ... నీకో మొగుడున్నాడన్న సంగతి గుర్తుందా అసలు ? ..."

"ఏం గుర్తుండకపోవడానికి నా మతి సరిగానే వుంది యింకా ..."



"రమా. నీ ప్రవర్తన నాకేం నచ్చలేదు ... ఇదివరకు చాలాసార్లు చెప్పాను ... మళ్ళీ చెపుతున్నాను ... ఇలా చూస్తూ నే నూరుకోను. ఎన్నాళ్లో ... అనవసరంగా నన్ను రెచ్చగొట్టకు ... హు ... నా యింట్లో నా ఉప్పు తింటూ నా ఎదురుగానే నీ నాటకాలు ఆడుతున్నావు ... ఇది ఎంత మాత్రం సహించను ..." కోపంగా అరిచాడు రాజారావు.

రమ ఆడపులిలా ఆవేశంగా లేచి కూర్చుంది. "ఏం బెదిరిస్తున్నారా నన్ను. ఈ బెదిరింపులకు దడవడానికి నేనేం చిన్నపిల్లని కాను. మీ క్రింద దాసీదాన్ని కాను. మీకంత కష్టంగా వుంటే మీకెలా వచ్చితే ఆవిధంగా చేసుకోండి. అంతేగాని ప్రతిరోజూ ఈ బెదిరింపులు మానండి ..." విసురుగా పడుకుంది రమ.

రాజారావు నిట్టూర్చాడు. లాభంలేదు? రమని తనేం చెయ్యలేడు ? తనది ఉత్త బెదిరింపు మాత్రమేనని రమకి తెలిసిపోయింది. అందికే అంత నిర్లక్ష్యం. లక్షల కధికారి రాజారావు భార్యని వదిలేశాడని లోకం చెప్పుకోడం తను భరించలేడు. పరువుకోసం, ప్రతిష్టకోసం హాలాహలం అమృతంలా మింగుతాడు ? ఆ సంగతి రమకి తెల్సు. అందుకే లెక్క చెయ్యటంలేదు తనని ? సంఘంలో హెూదాకోసం, పరువు కోసం రమ, తను భార్యాభర్తలలాగ ... అన్యోన్య దంపతులుగా నటించాలి. తప్పదు ! ఈ సొసైటీ లైఫ్. ఈ ఆడంబరాలకి దాసోహమనక తప్పదు తనలాంటివారు?

రమ ... ఎంత నిశ్చింతగా నిద్రపోతూంది. అదృష్టవంతులు అందరూ ! ఎయిర్ కూలర్లు, డన్‌లప్ పిల్లోల మధ్యకూడా నిద్రకి నోచుకోని దురదృష్టవంతుడు తాను. ఎందుకీ లక్షలు తనకి ! ఇంటా బయటాకూడా సౌఖ్యములేని బ్రతుకు. ఈ సంగతి ఎందరికి తెలుసు ? ....

ఆలోచనలకి స్వస్తిచెప్పి, లైటార్పి బలవంతాన కళ్ళు మూసుకున్నా నిద్ర పట్టని రాజారావు కళ్ళముందు ... రమ, తులానీ, ఫ్యాక్టరీ ఘెరావ్ చేస్తున్న కూలిలే కన్పిస్తున్నారు. పాపం లక్షాధికారి రాజారావుకి నిద్ర ఎలాపడ్తుంది ?

యువ

# మనిషి మారలేదు



ఆరోజు సీతకి రోజులా ఆరుగంటలకికాక ఐదుగంటకే తెల్లవారింది. పెరట్లో ఆరుబయట మంచం వేసుకొని పడుకున్న సీతకి ఆ రోజు లేవగానే రోజూ మామూలుగా కనిపించే మల్లెచెట్టు, మందారచెట్టు, పారిజాతంచెట్టు అన్నీ సినిమాలోలాగా సంతోషం పట్టలేక ఊగిపోతున్నట్టనిపించాయి. రోజూ గోలగా అనిపించే పిచికల కాకుల గోల ఆరోజు కిల కిలారావాలుగా వినిపించాయి. రోజూ నీర్సంగా నిర్లిప్తంగా లేవక తప్పదన్నట్టు లేచే సీత చెంగున మంచం దిగి లోపలికి నడిచింది.

కాఫీ కుంపటి, బొగ్గుల డబ్బా, బిందెలు, గిన్నెలు, కూరలబుట్టా, బియ్యం డబ్బా, మాసిన వాయిల్ చీరలు, కుక్కి మంచంలో పడుకుని మూలిగే పక్షపాతం తల్లి విసుగ్గా కనిపించే యీ దృశ్యాలేవీ సీతకి విసు గనిపించలేదు ఆరోజు.

చక చక కాఫీపని, వంటపని, తల్లికి స్నానం చేయించి భోజనం పెట్టడం, తన స్నానం, భోజనం అన్నీ పూర్తిచేసి తొమ్మిదిన్నరకల్లా ఆఫీసుకి బయలు దేరిపోయింది. ఏనాడూ పదిన్నరలోపల ఆఫీసుచేరని సీత ఆనాడు.

పది గంటల తరవాతే ఆరుగంటలయి పోతుందేమోనంత ఉత్సాహంతో గబ గబ అడుగులు వేసి బస్టాప్ చేరింది సీత.

ఆరుగంటలు : సాయంత్రం ఆరుగంటలు : సీత జీవితంలో ఆరోజు ఆరుగంటలకి ప్రాముఖ్యం వుంది.

"ఆరు గంటలకి గార్డెన్స్ దగ్గర మీకోసం చూస్తుంటాను ... వస్తారా, వస్తారుకదూ!'' అన్న మూర్తి మాటలు తప్ప సీతకి రోడ్డుమీద కోలాహలం ఏం వినిపించడంలేదు.



సీతని గార్డెన్‌కు రమ్మని పిలిచాడు !

ఇన్నాళ్ళకి, ఇన్నేళ్ళకి ఆమెను ఓ స్త్రీగా గుర్తించి ఓ పురుషుడు మాట్లాడాడు, ఆహ్వానించాడు. ఆనందంతో సీతకి మతిపోయింది ఆరోజు.

పుట్టిన ముప్ఫైఏళ్ళకి సీత ఓ పురుషుడి దృష్టిని ఆకర్షించింది. అంటే సామాన్యమైన సంగతి కాదు ?

మగవాళ్ళని ఆకర్షించే ఏ అందమూ లేదు సీతకి. ఛామనచాయ రంగుతో ఐదడుగులు దాటని పొడుగుతో, ముందుకు తోసుకువచ్చిన పళ్ళతో భుజాలు దిగని జడతో, ఏ కళాకాంతీ లేని ముఖంతో వుండే సీతని ఏ మగాడూ వలచలేదంటే ఆశ్చర్యమక్కరలేదు.

సీత తండ్రి బ్రతికుండగా తల తాకట్టు పెట్టి అయినా ఓ మూడు నాలుగువేలు తెచ్చి సీత పెళ్ళిచేసి బరువు దించుకుందామని విశ్వ ప్రయత్నంచేశాడు. అంత తక్కువ ధరకి సీతలాంటి ఆడపిల్ల మెడలో పుస్తె కట్టడానికి ఏ నాధుడూ కనపడకపోవటంతో, ఆ దిగులుతోనే ఆయన కన్ను మూశాడు. ఆ వున్న ఒక్క ఆధారం తెగిపోవడంతో, మెట్రిక్ చదువు ఆధారంతో ఆడపిల్లలు ముగ్గురిలో ఆఖరిదయిన సీత ఆ యింటి భారం చేపట్టక తప్పలేదు.

ఐదారేళ్ళనుంచి ఉద్యోగం చేస్తున్నా మగవాళ్ళ మధ్య రోజూ మసలుతున్నా సీత అనే అమ్మాయి వున్నట్టు ఏమగాడూ ఏనాడూగుర్తించ లేదు ఆఫీసులో. టైపిస్టు సుమతి, స్టెనో వాసంతితోనే అందరూ ఎందుకు మాట్లాడతారో, టీ, కాఫీలు వాళ్ళిద్దరికే తెచ్చి అందరూ ఎందుకు అందిస్తారో, వాళ్ళిద్దరి పని నేనంటే నేనని ఎందుకు పోటీలుపడి చేస్తారో, తనతో అందరూ ఎందుకు అలా వుండరో సీతకి చాలా రోజులకిగాని అర్థం గాలేదు. అర్థం అయ్యాక ఉక్రోషం వచ్చింది. ఆ ఉక్రోషం ఎవరిమీద చూపాలో తెలియక తనని తానే అసహ్యించుకోసాగింది. ఆ అసహ్యం కొన్నాళ్ళకి నిర్లిప్తత, ఉదాసీనంగా మారింది. ఈ గానుగెద్దు జీవితం ఎంత రోతపుట్టించినా, బ్రతకాలనే యిచ్ఛలేకపోయినా, చావడం ఎలాగో తెలియని సీత అలాగే రోజులు నెట్టుకొస్తుంది.

సీతకి ముప్పైనిండి యేడాది దాటింది. తనకింక పెళ్ళవుతుందని, తన జీవిత చరిత్రలో మొగుడు, పిల్లలు, సంసారం అన్న చాప్టర్లు ఎన్నటికి నిండవని సీతకి ధృవపడిపోయింది.

అలాంటి సీత చీకటి జీవితానికి ఓ చిన్న వెలుగురేఖ కనపడింది. ఆ రేఖ మూర్తి !

మూర్తి ఆ ఆఫీసుకి వచ్చి రెండు నెలల అవుతూంది. ఎవరు వస్తున్నారో ఎవరు వెడుతున్నారో సీతకి అక్కరలేని సంగతులు. ఎవరు వచ్చినా వెళ్ళినా సీతకి సంబంధించని సంగతులుగా సీతేకాక తక్కిన వాళ్ళుకూడా నిర్ణయించడంతో ఆ ఆఫీసుకి మూర్తి వచ్చిన సంగతి సీతకి చాలా రోజులకిగాని తెలియలేదు. ఓనాడు ఏదో కాగితం రిఫరెన్స్‌కోసం మూర్తి వచ్చి మాట్లాడాక మూర్తి అన్న మనిషి ఆ ఆఫీసుకి వచ్చినట్టు తెల్సింది సీతకి. సీత దృష్టిలో ఏ ప్రాముఖ్యతా లేదు.

తర్వాత ఓ నెలకి గాబోలు బస్‌స్టాప్ దగ్గిర మూర్తి యధాలాపంగా పలకరించాడు. 'మీరు ఎక్కడండీ వుండడం' అంటూ మాట్లాడింది. నాలుగు మాటలే అయినా జవాబు చెప్పడానికి సీత తబ్బిబ్బు అయిపోయింది. బహుశా ఓ మగాడు తనతో మాట్లాడడం అదే మొదటిసారి అవడంవల్ల, చెమట పట్టింది. మాట తడబడింది. ముఖంలోకి చూడకుండానే ఎలాగో చెప్పింది.

మరోసారి, "ఏమండీ, మీరేం మరీ అంత ముభావంగా వుంటారు. ఆఫీసులో ఎవరితోనూ మాట్లాడరేం !'' అని మామూలుగా అడిగిన ఆ ప్రశ్నకి సీతకి దుఃఖంతో గొంతులో ఏదో అడ్డంపడింది. "నాతో ఎవరూ మాట్లాడరు, నేనేం చేసేది,'' అంటూ ఆవేదన అంతా వెళ్ళబోసుకోవా లన్నంత ... ఆప్తుడుగా మూర్తి ఆ క్షణాన కనబడ్డాడు. కాని ఆ మాట ఎలా చెప్పాలో తెలియక అదేదో తన స్వభావం అన్నంత తేలిగ్గా చిన్న నవ్వు నవ్వింది.

ఓ నాలుగైదుసార్లు మూర్తి ఏవేవో మామూలు మాటలు మాట్లాడాడు. సీతకి ఏదో చిన్న ఆశతోపాటు కాస్త ధైర్యం కూడా వచ్చింది. ఆఫీసులో రోజులో ఎప్పుడో ఒకప్పుడు మూర్తి పలకరించకపోతే తనే చొరవచేసి, కలుగ చేసుకొని మాట్లాడేంత

ధైర్యం వచ్చింది సీతకి. ఓనెల రోజులు గడిచేసరికి మూర్తి, సీత చనువుగా మాట్లాడుకునే స్టేజికి వచ్చారు.

మూర్తి కాఫీకి పిలిస్తే నిస్సంకోచంగా, నిరభ్యంతరంగా, సంతోషపూర్వకంగా వెళ్ళింది. తరువాత బస్‌స్టాండ్ వరకు జంటగా వెళ్ళేందుకు ఏ మాత్రం సందేహించలేదు సీత.

ఆఫీసులో గుసగుసలు, వెక్కిరింతలు, వేళాకోళాలు అన్నిటినీ భరించి, నిర్లక్ష్యం చేయగలిగింది సీత.

మూర్తి ఉద్దేశం ఏమిటో సీతకి తెలియదు. మూర్తి గురించిన వివరాలు ఆరాతీసే ఓపిక, పట్టించుకునే స్థితిలో లేదు. కాని మూర్తి వంటరిగా ఓ గదిలో అద్దెకుంటున్నాడన్న విషయం మాత్రం సీతకి తెలుసు.

అందరూ హేళన చేస్తున్నా, వ్యంగ్యంగా విసుర్లు విసురుతున్నా లెక్క చేయకుండా తనతో మాట్లాడుతూనే వున్నాడంటే నిజంగానే తనమీద ఇంటరెస్టు వుందనడానికి ఇంతకన్న ఏం నిదర్శనం కావాలని నమ్మింది సీత. పొంగిపోయింది. ఎండి నేల రాలిపోతుందన్న తన జీవన లతకి లభ్యమయిన యీ కాస్త ఆలంబనాన్నీ దూరం చేసుకోకూడదని నిర్ణయించుకుంది సీత మనసులో.

సీత ఆరాటం అర్థం చేసుకోలేనంత అమాయకుడుకాడు మూర్తి. నవ్వుకున్నాడు మనసులో. ఏ మూలో కాస్త జాలికూడా తొంగిచూసింది.

ఆరుగంటలయింది. అంతకు అరగంట ముందుగానే సీత పబ్లిక్ గార్డెన్సు గేటుదగ్గర మూర్తి కోసం ఆరాటంగా ఎదురుచూస్తూ నిల్చుంది. రావల్సిన దానికంటె ముందు వచ్చానని తెల్సినా క్షణక్షణానికి వాచి చూసుకుంటూ రోడ్డుమీదికి దృష్టి సారించి అశాంతిగా నిల్చుంది సీత.

ఆరు ఇరవైకి మూర్తి కనపడగానే హృదయం మీదనించి పెద్ద బరువు దిగినట్టు ఫీలయింది సీత. సంతోషంతో మొహం వెలిగింది.

"సారీ. కాస్త ఆలస్యం అయింది, చాలాసేపటినించి వెయిట్ చేస్తున్నారా'' అన్నాడు.

సీత అంతవరకు తనుపడ్డ బాధమరిచి "లేదు ... లేదు నేనూ ఇప్పుడే వచ్చాను" అనేసింది.

"పదండి, లోపలికి వెళ్ళి కూర్చుందాం."

నడుస్తూండగా "ఇలా పిల్చినందుకు మీరేం అనుకోలేదుగా ..." సీత మొహంలోకి చూస్తూ అన్నాడు మూర్తి.

సీత కళ్ళరెప్పలార్చింది. తడబడుతూ నవ్వింది. "ఉహు ... లేదు ... ఏమను కోడానికి ఏముంది?"

"సీతగారూ ..." కూర్చున్న కాసేపటికి అన్నాడు మూర్తి.

"గారూ వదిలేయండి ... సీతా అనండి చాలు ..." సీత ధైర్యంగా తలెత్తిచూస్తూ చనువుగా అంది.

"సీతా ! ..." మొహంలో భావాలు వెతకడానికి ప్రయత్నిస్తూ అన్నాడు మూర్తి.

"సీతా ... నువ్వు ఎప్పుడూ అంత ఉదాసీనంగా ఎందుకుంటావు ? ... ఎన్ని రోజులబట్టో చూస్తున్నాను ..."

ఉదాసీనత కాక ఆమె బ్రతుకులో ఆనందం ఎక్కడుంది ? జవాబేం చెప్పలేకపోయింది సీత.

"సీతా, నిన్నుచూస్తే నాకు జాలి అనిపించింది చాలాసార్లు. ఆఫీసులో ఎవరూ నీతో మాట్లాడరేం ?"

అంత ఆదరంగా అడుగుతూంటే సీత మనసులో ఆవేదనంతా విప్పి చెప్పుకోవాలన్నంత ఆవేశం వచ్చింది.

"నాలో ఏం వుందని అందరూ నాతో మాట్లాడుతారు ? సుమతిలా అందం వుందా ? వాసంతి లాంటి ఫిగర్, చలాకీతనం వుందా ?..." ఆమె గొంతు వణికింది.

"అయితే, అందం లేనంత మాత్రాన మీరూ ఓ మనిషి గాదా, మీకూ ఓ మనస్సు వుండదంటారా?"

"వుందని ఎవరో మీలాంటి సహృదయులనుకుంటారు. కానీ అందరూ అలా అనుకోవద్దూ ..." కృతజ్ఞతతో సీత కళ్ళు తడి అయ్యాయి.



తరువాత ఇద్దరూ కూర్చుని ఓ గంట మాట్లాడిన మాటలు సీత తల కెక్కలేదు. మూర్తికి తన అందంతో పనిలేదు. తనని ఓ మనిషిగా, ఓ స్త్రీగా మాత్రం గుర్తించాడు. మూర్తి అందగాడు కాదు. అందుకే అతనికి అందంమీద గురిలేదు. అందంలేని. వారిమీద సానుభూతి వుంది.

మూర్తితో మాట్లాడిన ఆ గంటలో సీతలో క్రొత్త కోరికలు చిగిర్చాయి ! ఏవేవో ఆశలు రేకెత్తాయి ఆమె మనసులో. యీనాటికి తన జాతకం తిరుగుతుంది కాబోలు. మూర్తి సహృదయతమీద సీతకి ఎంతో నమ్మిక కల్గింది. మూర్తి, మనిషి అందానికికాక మనసుకి ప్రాధాన్యం ఇచ్చేట్టున్నాడు. అదే నిజమయితే తన బ్రతుక్కి ఓ అర్థం ఏర్పడుతుందన్న మాట ! తనూ యీనాటికి ఓ యింటికి యిల్లాలవుతుంది, ఓ పురుషుడి హృదయంలో స్థానం సంపాదించుకుంటుంది ! సీత ఆలోచనలు చాలా దూరం కళ్ళెంలేని గుర్రంలా పరిగెత్తాయి.

తర్వాత మూర్తి, సీతతో వంటరిగా చాలాసార్లు మాట్లాడాడు. ఎన్నోసార్లు పార్కులో కలుసుకున్నారు. మరెన్నోసార్లు సినిమాలకి వెళ్లారు. మూర్తి ఎప్పుడు ఎక్కడికి రమ్మన్నా సీత అభ్యంతరం చెప్పకపోగా ఆనందంగా ఆమోదించింది.

తన కలలు నిజమవబోతున్నాయని మురిసింది. తనని ఉద్ధరించడానికి దేవుడే మూర్తిగా దిగివచ్చాడని సీత ప్రగాఢ విశ్వాసం.

రాత్రనక పగలనక మూర్తితో తిరిగే తిరుగుడు గురించి ఆఫీసులో ఇంటి దగ్గరా ఇరుగు పొరుగు అనుకునే, అనే మాటలు సీత లక్ష్య పెట్టలేదు. మంచంలో పడుండే తల్లిని మభ్యపెట్టడానికి అట్టే కష్టపడలేదు సీత.

రెండు నెలలు గడిచిపోయాయి. సీత, మూర్తి ఇద్దరూ చాలా సన్నిహితు లైనారు. కనీసం సీత అలా అనుకుంది. ఎన్నో సందర్భాలలో తనకెంతో చేరువగా వచ్చిన మూర్తిని అభ్యంతర పరచలేదు. అతనిమీద ఆమెకి పూర్తి నమ్మకం వుంది. అంత సన్నిహితులయ్యాక మూర్తి అడగబోయే మాటకోసం ఆత్రుతగా నిరీక్షించ సాగింది సీత.

మూర్తి హృదయం పెట్టి తన్మయత్వంలోవున్న క్షణాలలో ఎన్నోసార్లు "ఇక్కడ




నాకు కొంచెం చోటీయరూ !"అని సినిమాల్లోలాగ అడగాలనిపించినా నోటి చివరదాకా వచ్చిన మాటలని, సిగ్గు వెనక్కి లాగేసేది. అడగవలసింది మూర్తి కానీ తను కాదేమో ! తొందరపడి తను తేలిపోతే మూర్తికి కోపం వస్తుందేమో ! ఇంత సన్నిహితంగా వచ్చిన మూర్తి తను అడిగితే అపనమ్మకమా అని నొచ్చుకుంటాడేమో! అనుమానాలతో, జంకుతో, సిగ్గుతో రోజులు గడిపేస్తుంది సీత. మూర్తి అడగబోయే మాటకోసం ప్రతిరోజూ ఎదురు చూస్తూండగానే రోజులు దొర్లిపోసాగాయి.

ఎవరి మాటలు ఎంత లక్ష్యపెట్టకూడ దనుకున్నా, తల్లికి జవాబు చెప్పవలసిన స్థితి వచ్చింది సీతకి. మూర్తి సమక్షంలో మిగతా ప్రపంచాన్ని మరిచిపోయినా, లోకంతో నాకేమి అనుకున్నా ... ఒక్కర్తీ కూర్చుని ఆలోచించుకుంటే ... ఇలా ఎన్నాళ్ళు అనే ప్రశ్న వచ్చేది సీతకి. నేనేం చేసినా నా యిష్టం అంటే ఈ దేశంలో, చుట్టూవున్న మనుష్యులు, సంఘం వూరుకోదు అన్న విషయం అర్థమవసాగింది సీతకి. ఇలా కాలయాపన మంచిది కాదనిపించసాగింది ? మూర్తి నిశ్చింతగా ఊరుకున్నా అతన్ని త్వరపెట్టవలసిన అవసరం తనకుంది ? చూచాయగానైనా తన మనోగత అభిప్రాయం అర్థం అయ్యేట్టు చెప్పాలి. మూర్తిమీద తనకెంత నమ్మకం వున్నా లోకం నమ్మాలి అతన్ని. సంఘం ముందు దోషులవకూడదు తాము.

ఎన్నో రోజులు ఆలోచించి, సందేహించి, ఆఖరికి మర్నాడు అడగాలని సీత గట్టిగా నిర్ణయించుకుంది.

***

సీత అరగంటనించి పార్కులో కూర్చుని మూర్తికోసం నిరీక్షిస్తూంది. నిన్ననే ఆఫీసులో చెప్పింది. ఆశ్చర్యంగా "ఎందుకు" అన్నాడు మూర్తి ! "మీతో చాలా మాట్లాడాలి. ఒకటడగాలి ?" అని ముసిముసినవ్వులతో అంది సీత. మూర్తి సీత కళ్ళల్లో భావం అర్థం చేసుకోడానికి గుచ్చి గుచ్చి చూశాడు.

మూర్తి వస్తాడు. రాగానే ఎలా మొదలుపెట్టాలో, ఏమని అడగాలో, ఇప్పటికి ఓ వంద సార్లయినా రిహార్సల్స్ వేసుకుంది సీత.

కనుచీకటి పడుతూంది ... మూర్తి వస్తాడు ... వచ్చి కూర్చుంటాడు.

"ఏం సీతా, ఏమిటి సంగతి ?" అంటాడు. తను యిటూ అటూచూసి

చప్పున అతని గుండెల్లో మొహం దాచుకుంటుంది. "నేనేం అడుగుతానో ఊహించలేడూ ... నాకేం కావాలో నీకు తెలియదా!"

"ఉహు" మూర్తి చిలిపిగా నవ్వుతాడు.

"నీవు కావాలి ... శాశ్వతంగా నావాడవి కావాలి. నాకింతకంటే ఏం కావాలి. మూర్తీ నన్ను నీదాన్ని చేసుకో నలుగురి సమక్షంలో" అంటూ సిగ్గువిడిచి చెప్పేస్తుంది.

"పిచ్చి సీతా ! దానికింత సందేహం ఎందుకు, నేనే చెపుదామనుకుంటున్నాను ఇవాళో రేపో. అసలు నీకిలాంటి సందేహం ఎందుకురావాలి, ఆమాత్రం నామీద నమ్మకంలేదా ...." అంటూ ప్రేమగా దగ్గరికి తీసుకుంటాడు.

"లేదు ... లేదు నీమీద నమ్మకం లేకకాదు ... కాని ... యీ పాడులోకం ఒకటుందిగా ..." నొచ్చుకుంటూ సంజాయిషీ యిస్తుంది.

"అవును ... నిజమే ఇన్నాళ్ళూ ఆ మాటే ఆలోచించలేదు నేను. నిన్ను బాధపెట్టానా సీతా ! ఇదిగో రేపే వెళ్ళి రిజిస్ట్రార్ ఆఫీసులో మన పేర్లు రిజిష్టర్ చేయిస్తాను ... మళ్ళీ నెలనాటికి మనం భార్యాభర్తలం అయిపోతాం ఓ కే ... ఆర్ యూ సేటిస్ ఫైడ్ నౌ" అంటూ చిలిపిగా నవ్వుతాడు. సిగ్గుతో సీత మూర్తి గుండెల్లో మొహం దాచుకుంటుంది.

కళ్ళముందు పరుచుకున్న రంగుల కలని చెదరగొడ్తూ ప్రక్కనే ఎవరి ట్రాన్సిస్టర్ లోంచో వినవస్తున్న తెలుగువార్తలు విని సీత ఉలిక్కిపడి చుట్టూ చూసింది.

ఏడు గంటలు. అప్పుడే ఏడయిందా? చుట్టూ పరుచుకున్న చీకటినీ, ఆ చీకటిని చీల్చే ప్రయత్నంలో వెలిగే ట్యూబ్ లైట్లనీ చూసి గాభరాపడింది సీత,

మూర్తి ఇంకా రాలేదు. ఆరుగంటలకి వస్తానని ఎందుకు రాలేదో ! ఇవాళ ఆదివారం ! ఏం పని వుంటుంది? వస్తుంటే ఎవరన్నా స్నేహితులు అడ్డు తగిలారేమో! వాళ్ళని వదుల్చుకుని వచ్చేసరికి ఆలస్యం అవుతుంది గాబోలు !

మూర్తి రాడేమో అన్న అనుమానం, భయం సీతకి ఎంత మాత్రం కలుగలేదు. సీత కళ్లు చీకటిని చీలుస్తూ కనపడినంతమేరా మూర్తికోసం ఆరాటంగా వెతుకుతున్నాయి.

సెకన్లు నిమిషాలుగా, నిమిషాలు గంటలుగా మారుతున్నాయి. "ప్రేమ వేరు




పెళ్ళి వేరు. ప్రేమించడం హాబీగానీ, పెళ్లాడ్డంకాదు. అవసరార్థం ఆడదాన్ని వాడుకోవడాన్ని ప్రేమ అనరు. మగవాళ్ళ ప్రేమకబుర్లు పెళ్ళికి దారితీయవు సుమా! పిచ్చి సీతా!'' అంటూ, చూసిన సినిమాలల్లో, చదివిన కథలల్లో వంచించబడ్డ అమ్మాయిలందరూ సీతని చుట్టుముట్టి ఊపిరి ఆడనీయకుండా ఎలుగెత్తి ఘోషించారు. భయసెట్టారు ! మూర్తి మీదవున్న నమ్మకంతో సీత అందరినీ బలవంతంగా దూరంగా నెట్టేసింది.

అరిపోతున్న ఆశాదీపాన్ని ఎగద్రోసుకుంటూ, తన మనసుని తనే మభ్యపెట్టుకుంటూ అలా స్థాణువులా కూర్చుంది సీత మూర్తి కోసం చూస్తూ.

ఎనిమిది గంటలయింది ... పూరీ ఎక్స్‌ప్రెస్ పొగలు చిమ్ముతూ పరిగెడ్తుంది. ఎప్పుడెప్పుడు వెళ్ళి సుపుత్రుడిని చూస్తానా అన్న మూర్తి ఆరాటం రైలుకంటె వేగంగా పరుగెడ్తుంది.

ఎనిమిదిన్నర ... "వేషము మారెను. భాషలు నేర్చెను, అయినా మనిషి మారలేదు ...'' ట్రాన్సిస్టర్ లోంచి వినిపిస్తున్న రికార్డు ఎక్కడో కలలో మాదిరి వినిపిస్తుంటే ... ఏదో కల కరిగిపోయినట్లు లేచింది సీత తడబడ్తూ ... కాళ్ళు తేలిపోతుండగా ఎలాగోవెళ్ళి బైటవున్న ఓ రిక్షాలో కూలబడింది సీత. పాపం సీత.

స్వాతి 

❋

# వేట

దట్టమైన దండకారణ్యం మధ్య రోజా చీకట్లో నిశ్శబ్దంగా నిద్రపోయే "మల్కనగిరి" ఫారెస్ట్ గెస్ట్‌హౌస్ ఆరోజు కళకళలాడిపోతూంది. బయట వరండాలో పెట్రోమాక్స్ లైట్ దేదీప్యమానంగా వెలిగిపోతూంది. బయట రెండు జీపులు నిలబడి వున్నాయి. నలుగురు ఫారెస్ట్ గార్డులు బయట సాయుధులై నిలబడ్డారు. నలుగురు ఫారెస్ట్ రేంజర్లు ఒకచోట నిలబడి కబుర్లు చెప్పుకుంటున్నారు. ఇద్దరు డి.ఎఫ్.వో.లు బయట వరండాలో కుర్చీల్లో కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నారు. వెనక కిచెన్‌లో కోళ్ళ పీకలు తెగిపోతున్నాయి. మసాలా వాసనలు ఘాటుగా పైన కూర్చున్న వాళ్ళకి నోరూరిస్తున్నాయి. ఆ వాసనలు పసిగట్టి నాలుగైదు కుక్కలు ఆరాటంగా తోకాడించుకుంటూ తిరుగుతున్నాయి.

ఎవరయినా ఫారెస్ట్ ఆఫీసర్లు టూర్లమీద వచ్చినప్పుడు తప్ప మిగతా టైములో ఆ డాక్ బంగళా నిశ్శబ్దంగా నిద్రపోతున్నట్టుంటుంది. అడవి మధ్య వుందేమో మిగతా డిపార్టుమెంటులవారు ఎంతో అవసరం అయితే తప్ప అక్కడ విడిది చేయరు. ఫారెస్ట్ డిపార్టుమెంటు వారయినా షికారీ సరదాకి వచ్చేవారే అక్కడ క్యాంప్ చేస్తూంటారు. శీతాకాలం విపరీతమైన చలి. వర్షాకాలం కుండపోతగా వర్షం. ఎండాకాలం మాత్రం చాలా హాయిగా వుంటుందేమో అప్పుడు మాత్రం ఎక్కువమంది ఆఫీసర్లు టూర్ మీద వస్తుంటారు.

ఈరోజు ఈ ఆర్భాటానికి హడావుడికి కారణం కన్సర్వేటర్ ఆఫ్ ఫారెస్ట్ గారు టూర్ వేంచేస్తున్నాడు. ఆయనగారి టూర్ ప్రోగ్రాం అందుకోగానే ఆ జిల్లా ఫారెస్ట్ ఆఫీసర్ గారు కాంట్రాక్టర్ గారితో చెప్పి చెప్పినట్లు అధికారిగారి ఆగమన వార్త చెప్పారు. ఆ మాత్రం చెపితే కాంట్రాక్టరు సకలమైన ఏర్పాట్లు చేస్తాడని

ఆయనకి తెలుసు. లేకపోతే గవర్నమెంట్ ఇచ్చే జీతాలతో వారికి రాజ లాంఛనాలు ఏర్పాటు చెయ్యాలంటే మాటలు గాదని తెలుసు.

ఆ కాంట్రాక్టర్‌కి ఇది కొత్తకాదు. ఏ ఫారెస్ట్ ఆఫీసర్ టూర్ వచ్చినా వారి వారి తాహతులనుబట్టి వారికి కావాల్సిన ఏర్పాటులు చెయ్యడం తన డ్యూటిలో ఒక భాగంగా చేసేస్తూంటాడు. అందులో ఈరోజు వస్తున్నది కన్సర్వేటర్ గారు. అదీ కొత్త కన్సర్వేటర్. ఈ జిల్లాకి రావడం ప్రథమం. అందుచేత ఏర్పాటులు చాలా ఘనంగా చేశాడు. అరడజను కోళ్ళు, రెండు మేకలు తెచ్చి పెరట్లో కట్టేశాడు. ఫారెన్ విస్కీ బుడ్ల ఏర్పాట్లు అయ్యాయి. ఆయనేకాక ఇద్దరు మిత్రులొస్తున్నారని మూడు మంచాలు వేయించి, డన్‌లప్ పరుపులు వేయించాడు. కొత్త దుప్పట్లు, తువాళ్ళు, చాకింటి కర్టెన్లు, స్పెషల్ సబ్బులు, వేడినీళ్ళు చన్నీళ్ళు అన్నీ పకడ్బందీగా ఏర్పాటయ్యాయి. కన్సర్వేటర్ గార్ని ప్రసన్నుడిగా చేసుకోవల్సిన అవసరం చాలా వుంది. ఆ ఏరియాలో అడవిలో పిచ్చిమొక్కలు, పనికిరాని వృక్షాలు కొట్టించి చదునుచేసి టేకు, దేవదారు, కలప మొదలయిన మేలుజాతి చెట్లు నాటాల్సిన పని సాలుకి మూడులక్షల రూపాయల కంట్రాక్టు వుంది. ఆ జిల్లా డి.ఎఫ్.ఓ. అతనికి కొరుకుడు పడడంలేదు. పెద్ద పిట్టనే పడితే ఇంక ఆ డి.ఎఫ్.ఓ.ని లెక్కచెయ్య నక్కరలేదు. ఆ మూడులక్షల ముందు ఈనాటి ఖర్చు కంట్రాక్టర్‌కి ఓ లెక్కకాదు.

ఆ కంట్రాక్టర్ పేరు యన్. పట్నాయక్. పూర్వాశ్రమంలో తెలుగువాడయినా తరతరాలుగా ఒరిస్సాలో స్థిరపడి ఒరియావాడిగా మారిపోయాడు. ముందు ఫారెస్ట్ గార్డుగా చేరినపుడు సుబ్బయ్యగా వుండి, రేంజరయ్యాక సుబ్బారాయుడిగా మారి రేంజర్‌గా వున్నప్పుడు అందిన మేరకు నాలుగు రాళ్ళు పోగుచేసుకుని ఉద్యోగం మాని చిన్న చిన్న ఫారెస్ట్ కంట్రాక్టులతో మొదలు పెట్టిన పదేళ్ళలో ఆ ప్రాంతాలు పెద్ద ఫారెస్ట్ కంట్రాక్టరై సుబ్బారావు పట్నాయక్ అల్లా ఎన్. పట్నాయక్‌గా మిగిలాడు.

తెలుగు ఆఫీసర్లతో తెలుగు వాడినని, ఒరియా వాళ్ళతో ఒరియావాడినని చెపుతూ ఎవరికి ఏది ముట్టచెప్పి ఏది రాబట్టాలా వగైరా కంట్రాక్టులోని మెలకువలు నేర్చుకుని తెలివిమీరిపోయాడు. ఏ ఆఫీసరు టూరుమీద వచ్చినా అక్కడ ప్రత్యక్షమయి వారి అవసరాలు వెయ్యికళ్ళతో కనిపెట్టి అందరికీ ప్రీతిపాత్రు డయ్యాడు.

ఈ కొత్త కన్సర్వేటర్ రమాకాంత్ మిశ్రా షోకిల్లా పురుషుడు, స్ఫురద్రూపి. సరసుడు అంటే-మధీరతో పాటు మదవతిలేనిదే వుండలేడని, ఎప్పుడూ ఫ్రెండ్సు క్లబ్బులు, పార్టీలు, షికారీలు అంటూ జల్సాగా కాలక్షేపం చేసేరకం అని - బీదరికంతో పుట్టి, ఆ కారణంగా చదువుకోసం చిన్నతనంలోనే డబ్బుకోసం ఓ కోతిని పెండ్లాడి ఇల్లరికం వెళ్ళి, మామగారి డబ్బుతో చదువుకుని పైకివచ్చి, ఇంట్లో కోతి భార్యతో, అందంలేకపోయినా చదువు సంస్కారం లేని పల్లెటూరి గయ్యాళి భార్యని భరించలేక, భరించక చేసేదేంలేక ఆయన యింట్లో దొరకని అందాన్ని, ఆనందాన్ని బయట అనుభవిస్తాడని, ఏ డబ్బు కారణంగా అతను జీవితంలో నష్టపోయాడో ఆ డబ్బు మీద కసితో రెండు చేతులా అందిన చోటల్లా పుచ్చుకుని జీవితాన్ని అనుభవించి ఆనందించడమే ధ్యేయంగా పెట్టుకుని యింట్లో పెళ్ళాంనించి తప్పించుకుని ఎప్పుడూ టూర్లు, లేక ఫ్రెండ్స్, క్లబ్బులలో కాలక్షేపం చేస్తాడని చాలా వివరాలే సేకరించాడు పట్నాయక్. అంతేకాక తన రూపంతో, మాటలతో ఏ స్త్రీనైనా ఆకర్షిస్తాడని ఏం చేస్తాడో, ఎలాచేస్తాడో ఎలాంటి ఆడదాన్నైనా బుట్టలో పడేట్టు ఇంద్రజాలం చేస్తాడు. అతని వీక్‌నెస్‌ల గురించి కిందామీదా అధికారులకి, మిత్రులకి అందరికీ తెలుసు. అతనిలో ఈ దుర్గుణాలన్నీ అతని మాట నేర్పరితనం, అతని పెర్సనాలిటీ, అతని స్నేహ ప్రియత్వం చాటున మరుగుపడి పోతాయి. అతనెక్కడ వుంటే అక్కడ ఉల్లాసం, ఉత్సాహం చిందులు వేస్తుందని, పదిమందిని చుట్టూ వేసుకుని వుంటాడనీ తెలుసుకున్నాడు. అతనికి వేట హాబి. వేటమీద మనసుపోయినప్పుడల్లా తన జ్యూరిస్‌డిక్షన్‌లో ఏ అడవిలోనో టూర్ ప్రోగ్రాం వేసుకుంటాడు. అతనిప్పటికి నాలుగు పులులని చంపాడు. మిత్రులందరికి పులి చర్మాలు, గోళ్ళు, బుర్రలు, దుప్పి కొమ్ములు, జింక చర్మం వగైరాలు ప్రెజంట్ చేస్తూంటాడు. ఇతర డిపార్ట్‌మెంటు ఆఫీసర్లెవరికైనా వేట చూడాలని వుంటే చాలు రమాకాంత్‌ని అడిగితే చాలు మహదానందంగా వెంట బెట్టుకువెళ్ళి సకలమైన మర్యాదలు జరిపిస్తాడు.

ఈ సమాచారం సేకరించి దానికి తగ్గ విధంగానే అన్ని ఏర్పాటులు చేశాడు




పట్నాయక్. దొరవారు టూర్ ప్రోగ్రాం ప్రకారం జయపురంనించి సాయంత్రం బయలుదేరి ఏడు గంటలకి చేరాలి.

***

బయట జీపు హారన్ వినగానే వాచ్‌మన్ పరుగెత్తి గేటు తీశాడు. గార్డులు ఎటెన్‌షన్‌లో నిలబడి సెల్యూట్ చేశారు. రేంజర్లు వినయంగా నమస్కారాలు చేశారు. డి.ఎఫ్.వోలు మెట్లుదిగి ముందుకు వచ్చి నిలబడ్డారు. వంటలని పర్యవేక్షిస్తున్న కాంట్రాక్టరు పరుగున వీధి వరండాలోకి వచ్చాడు.

కన్సర్వేటర్ గారు, మిత్రులిద్దరూ జీపుదిగారు. మరోజీపునించి వారితో పాటు టూర్ చేస్తున్న మరిద్దరు డి.ఎఫ్.వో.లు దిగారు. అందరి నమస్కారాలు అందుకుని హుందాగా తలపంకించి మిత్రులతో వరండాలోకి నడచి కుర్చీలో ఆసీనులయ్యారు. ఆఫీసర్లని పరిచయం చేసుకుని లాంఛనంగా పది నిమిషాలు ఆఫీసు విషయాలు డిస్కస్ చేసి "ఆల్‌రైట్ - వుయ్ విల్ మీట్ ఎగైన్, టుమార్ మార్నిగ్ ఎట్ టెన్" అని లేచి లోపలికి వెళ్ళిపోయాడు, నాల్గుగంటల నించి పడిగాపులు పడివున్న డి.ఎఫ్.వో. లు మొహాలు చూసుకున్నారు. చచ్చినట్లు మళ్ళీ రావాలని మొహాలు చూసుకుని మెట్లు దిగారు. అక్కడ క్యాంప్ చెయ్యడానికి వున్నది ఒకటే డాక్ బంగళా. ఏ కోరాపుటో, జయపూర్ వెళ్లి రాత్రికి వుండి మళ్ళీ రావాలి. ఈ కన్సర్వేటర్ గారు టూర్ రెండు రోజుల్లో పని రెండు గంటలు, షికార్ రెండు రోజులు చేస్తారని వినే వున్నారు. కనుక ఏం చెయ్యలేక మనసులో తిట్టు కుంటూ వెళ్ళారు.

"తమరు కాస్త 'టీ' తీసుకుంటారా?" కంట్రాక్టరు వినయంగా అడిగాడు. రమాకాంత్ వాచూసి "టీవద్దు, ఏడున్నరయింది. ముందు స్నానం చేసి తరువాత..."

"ఆ ... ఆ. ఆ ఏర్పాటులు చూశానండి. గదిలో వేడినీళ్ళు సిద్ధంగా వున్నాయి. డిన్నర్ ఎన్నింటికి సార్."

"పది గంటలకి. ఆ ... మీరు?" ఎవరన్నట్లు చూశారు.

"చిత్తం. నా పేరు పట్నాయక్ అండి, కంట్రాక్టు పనులు చేస్తూంటాను" వినయంగా చేతులు నలుపుకుంటూ అన్నాడు.

"ఐసీ !" అన్నాడు రమాకాంత్. కంట్రాక్టరు అనగానే అతనికి అంతా అర్థం అయింది "ఆ ... రాత్రి షికారీకి అన్ని ఏర్పాటులు జరిగాయా?"

"ఎస్ సార్."

"మాటు సిద్ధం చేశారా ? మాతో రావాల్సినవాళ్ళు జీపు, ఫ్లడ్‌లైట్స్, గన్నర్."

"చిత్తం అంతా రెడీ సార్."

"సరే డిన్నరయ్యాక పదిన్నర పదకొండుకి బయలుదేరుతాం" అంటూ రమాకాంత్ గదిలోకి వెళ్ళాడు.

మిత్రులు ముగ్గురూ స్నానాలుచేసి వచ్చేసరికి బయట వరండాలో పెట్రోమాక్స్ లైటుచుట్టూ కుర్చీలు గుండ్రబల్ల చుట్టూ వేయించి బాటిల్సు, ఐస్ ఫ్లాస్క్, గ్లాసులు, నంజుకోడానికి వేయించిన జీడిపప్పు, పొటేటో చిప్స్, వేరుశనగ పప్పులు, సిగరెట్ పెట్టెలు, పేక దస్తాలు ఏర్పాటు చేశాడు పట్నాయక్. ఏర్పాట్లుకు సంతసించి మెచ్చుకోలుగా తల ఊపి 'వెల్'.... కమాన్ ఫ్రెండ్స్ పది గంటల వరకు యీ అడవిలో మనకిదే కాలక్షేపం' అంటూ బాటిల్ అందుకున్నాడు రమాకాంత్.

"రమ్మీ వేద్దామా," అంటూ పేక తెరిచాడు అభిరామ్ పండా. అభిరామ్ పండా ఐ.ఎ.ఎస్, సెక్రటరీగా ఫైనాన్స్‌లో వున్నాడు.

"మరొకరుంటే బ్రిడ్జి ఆడుకునేవాళ్ళం. ఏరి మీ డి.ఎఫ్.వోలు. అంతా వెళ్ళిపోయారా ?" అన్నాడు విభీషణ్ మహంతి. అతను నేషనల్ హైవేస్‌లో చీఫ్ యింజనీరు, ముగ్గురూ క్లబ్ మిత్రులు.

"వాళ్ళేందుకు? నవ్వడానికి కూడా భయపడి బిగపట్టుపని బిక్కచచ్చి కూర్చుంటారు. వాళ్ళకీ మనకి ఫ్రీగా వుండదు" అన్నాడు రమాకాంత్ గ్లాస్‌లో ఐస్‌ముక్కలు వేస్తూ.

రాత్రి పదివరకూ పేకాడుతూ, తాగుతూ రమాకాంత్ యిదివరలో తన వేట విశేషాలు చెప్తూ, కబుర్లతో, నవ్వులతో హోరెత్తించారు ఆ అడవి అంతా.

పదిగంటలకి డిన్నర్‌కి లేచారంతా. మటన్, చికెన్ పలావులతో పాటు సాంబార్, రసం, కొబ్బరి పచ్చడి, రకరకాలతో టేబిల్ నింపేకాడు పట్నాయక్!




"అరే తెలుగు వంటలు చేయించారే 'కంసమా' (ఇనస్పెక్షన్ బంగాళాల్లో వంటవాడు) తెలుగువాడా ?" రుచి చూస్తూ మెచ్చుకుంటూ అన్నాడు రమాకాంత్.

"కాదండి, మీకు తెలుగు వంటలు యిష్టం అని విని స్పెషల్‌గా మా ఆడవాళ్ళతో చేయించాను" కంట్రాక్టరు వినయంగా అన్నాడు.

"ఓ, ఐ సీ!" తాగిన మత్తులో తేలిపోతున్న అతనికి అంతకంటే వివరాలు అడిగి వినే ఓపికలేదు. అంతా సుష్టుగా భోంచేశారు. వాళ్ళు భోంచేసి వచ్చేసరికి ఆరు బయట వెన్నెల్లో కుర్చీలు వేయించి పాన్, సిగరెట్లు అరేంజ్ చేశాడు పట్నాయక్.

"వాహ్ ! భలే ఎరేంజిమెంట్లోయ్, దమ్మిడి ఖర్చులేకుండా పెళ్ళివారి మర్యాదలు జరిపిస్తున్నావు మా వాడిచేత" అన్నాడు అభిరామ్. మరేమి అనుకున్నావ్ అన్నట్టు గర్వంగా చూశాడు రమాకాంత్.

వెన్నెల పుచ్చపువ్వులా కురుస్తుంది. ఎక్కడివో అడివిపూల వాసన, డాక్ బంగళాలో మల్లెలు, నైట్ క్వీన్ పరిమాణాలు పిల్ల తెమ్మెరతోపాటు కదిలివస్తుంది. ఎక్కడో దూరంగా కొండమీదనించి దుమికే నీటిధార శబ్దం. వాతావరణం ఆహ్లాద కరంగా వుంది.

"వండర్‌ఫుల్. యిలాంటిచోట వలచి వలపించే ప్రియురాలితో విహరిస్తే యింకెంత మజాగా వుంటుంది ఈ వెన్నెల. ఈ చల్లగాలి, ఈ పరిమళాలు, ఈ ఏకాంతం, ఓహ్ హనీమూన్‌కి 'సరిఅయిన చోటుకదూ." రమాకాంత్ అసలే సరసుడు. దానికితోడు పిసరంత కవి హృదయం వుందేమో, పుచ్చుకున్న పానీయంతోపాటు పరిసరాలు మత్తునివ్వగా కలల్లో తేలిపోతున్నట్లున్నాడు.

"చంపావు ఈ అడవిలో ప్రేయసిలను కూడా ఎక్కడ సప్లయి చేస్తారు. పూర్‌ఫెలోస్ ఇప్పుడు వాళ్ళనిబ్బంది పెట్టకు" రమాకాంత్ వీక్‌నెస్ తెల్సిన విభీషణ్ చమత్కారంగా అన్నాడు.

మన కాంత్ తల్చుకోవాలేగాని కారడివిలో కూడా కాంతల్ని సంపాదిస్తాడు, జోక్ చేశాడు అభిరామ్.

ఆ మాట నిజం అన్నట్టు హఠాత్తుగా రమాకాంత్ కుర్చీలో కూర్చుని 'అరే'



అన్నారు ఆశ్చర్యంగా. అతను చూస్తున్న వైపు తక్కిన యిద్దరుకూడా ఆశ్చర్యంగా చూశారు. నిటారుగా

డాక్ బంగళాకి ఎదురుగా కాస్త దూరంలో ఓ టెంటు వుంది. టెంటు బయట పండువెన్నెలలో, మిల మిల మెరిసే తెల్లచీర, బారెడు నల్లటి జడ, జడలో విచ్చిన తెల్లని పూలు-యిటు అటు పచార్లు చేస్తున్న స్త్రీమూర్తిని చూసి ముగ్గురూ ఒక్కక్షణం ఆశ్చర్యంగా అటే చూస్తుండిపోయారు.

"ఎవరీమె-కామినీయా, వనసుందరా, గంధర్వకన్యా - కలా, నిజమా, భ్రమా" రమాకాంత్ కళ్ళు చికిలించి మెలకువ తెచ్చుకుని మరోసారి చూశారు. తక్కిన యిద్దరికి అదే అనుమానం వచ్చింది.

"ఈ అడవిలో ... రాత్రి ... ఎవరీమె ? యిక్కడెందుకు వుంది ? చాలా ఆశ్చర్యంగా వుందే. ఆ టెంటు యింకా మనం వచ్చినప్పుడు వుందా ?" దెయ్యాల కథలు గుర్తువచ్చి అనుమానంగా అన్నాడు రమాకాంత్.

"ఏమో-మనం సరీగ్గా చూసివుండం, చీకట్లో వచ్చాంగదా" మహంతి అన్నాడు.

"అడిగేస్తే పోతుందిగా" అన్నాడు పండా. వెనకాతల కిచెన్‌లో అంతా భోజనం చేస్తున్నారు. పళ్ళాలు, గ్లాసుల చప్పుడు, మాటలు వినిపిస్తున్నాయి. గేటుదగ్గర ఓ గార్డు మాత్రం కనిపించాడు. రమాకాంత్ గార్డుని పిలిచాడు. టెంటువైపు చూపించి "అక్కడ ... ఎవరు ? ... ఆమె ఎవరు ?" అనడిగాడు. వాడు జవాబిచ్చేలోగా వెనకనించి పట్నాయక్ భోంచేసి గొంతు సవరించుకుంటూ వచ్చాడు రమాకాంత్ ప్రశ్నవిని. అతను టెంట్‌వైపు ఒకసారి చూసి "హి... మా ఫేమిలీ లెండి" అన్నాడు నసిగి. రమాకాంత్ ఆశ్చర్యపోయాడు. "ఏమిటి ఈ అడవిలో టెంటులో ఫేమిలీతో వుంటున్నారా మీరు?" అడిగాడు. కంట్రాక్టరు వినయంగా చేతులు నలుపుకుంటూ "అబ్బే లేదండి, యిటు ప్రాంతాలు ఎప్పుడూ చూడలేదంటే, ఈ అడవి అది చూడాలని సరదా పడుతూంటే నాతో తీసుకు వచ్చాను" ఏదో అపరాధం చేసినట్లు సంజాయిషీ యిస్తున్నట్లున్నాడు.

"ఆహా ... మరి టెంటులో వున్నారు భయంలేదా?"




"మరిక్కడ వసతి ఏముందండి. మీరు రాకపూర్వం గది ఖాళీ వుందని డాక్ బంగళాలో వున్నాం. మీరొస్తున్నారని ఖాళీచేసి టెంటు వేయించాను. రెండురోజుల్లో వెళ్ళిపోతాం" వినయంగా అన్నాడు. రమాకాంత్ ఉత్సాహం ఎందుకో కరిగిపోయింది. ఏదో వింటాననుకున్నది యింత చప్పగా కంట్రాక్టరు భార్యగా తేలిపోగానే ఏదో పొంగు అణిగిపోయినట్టయింది. కంట్రాక్టరు వెళ్ళగానే మరోసారి అటు చూశాడు. మంచి విగ్రహం, యింత దూరం నించే మెరిసేరంగు ! చీర జాకెట్టుకి మధ్య కన్పిస్తున్నట్లున్న నడుం రంగు ... యింత అందం, ఈ నల్లమొద్దు స్వంతమా వీడికి ... ఈ ఎద్దుకి ... అంత అందమైన భార్యా ..." మింగుడుపడని నిజంలా అన్పించింది.

"నో యూస్ మై బాయ్-ఫేమిలీ లేడీ-తన్నగలదు పిచ్చివేషాలు వేస్తే" మహంత రమాకాంత్ మొహంలో భావం చదివినట్లున్నాడు.

"ఛా ... ఛా ... అదేంకాదు. ఈ అడవిమధ్యలో హఠాత్తుగా స్త్రీ కనిపిస్తే కుతూహలం అన్పించింది అంతే" అన్నాడు రమాకాంత్ నవ్వి- అన్నంత తేలిగ్గా అతని మనసుని నమ్మించలేకపోయాడు.

* * *

పదకొండు గంటలకి అంతా జీపు ఎక్కారు. జీపుకి అటు ఇటు రెండు ఫ్లడ్ లైట్స్ కట్టారు. మహంతి డ్రైవ్ చేస్తుంటే రమాకాంత్, పండా పక్కన కూర్చున్నారు, రమాకాంత్ గన్ పట్టుకుని గురిపెట్టుకుని సిద్ధంగా ఉన్నాడు. తోవలో ఏదన్నా కనిపించదా అన్న ఆశతో వెనకాతల ఒక గన్నర్, కంట్రాక్టర్, ఒక గార్డు కూచున్నారు, రెండు పెద్ద ఫ్లాస్కులనిండా టీ-బిస్కట్ల పేకట్టు, సిగరెట్ పెట్టెలు, వాటర్ బాటిల్, ఒక జంపుకానా, బ్యాటరీ లైట్లు వగైరా సరంజామా సిద్ధం చేసుకున్నారు.

"ఎంత దూరం వెళ్ళాలి మనం" రమాకాంత్ కంట్రాక్టర్ని అడిగాడు.

"ఇక్కడనించి ఆరుమైళ్ళు ఈ రోడ్డు. అ తరువాత అడవిలోకి కచ్చా రోడ్డులో నాలుగు మైళ్ళు వెళ్ళాక జీపింక వెళ్ళదు సార్, అక్కడ నించి మూడు ఫర్లాంగులు నడిచి లోపలికి వెడితే అక్కడ మాటువేయించి రెడీ చేశాను సార్ ..." పట్నాయక్ తోవ చూపిస్తుండగా జీపు కదిలింది.



కంకర రోడ్డు దిగగానే ఫ్లడ్‌లైట్ల వెలుగుకి, జీపు చప్పుడికి భయపడి నాలుగైదు కుందేళ్ళు గాభరాగా పరిగెత్తి మాయమయ్యాయి. రెండు నక్కలు తలలెత్తి చూశాయి. పోను పోను ఆడవి దట్టమవుతున్నకొద్దీ చెట్ల కొమ్మలు తలలకి తగులుతున్నట్లని పించింది. నిద్రపోతున్న పక్షులు ఆ హడావిడికి లేచి ఒక్కుమ్మడిగా అరవసాగాయి. అడవి అంతా హఠాత్తుగా మేల్కొన్నట్లు అయింది. మనిషి వెళ్ళగలిగేపాటి ఆ బాటలో గతుకులలో జీపు ప్రయాణం చేస్తుంది. ఎత్తెత్తి కుదేస్తూంది. "ఓ దుమ్మర గుండయినా తగలలేదు తోవలో ఈవాళ" అన్నాడు నిరుత్సాహంగా రమాకాంత్. ఓ కుందేల్ని కొట్టబోతుంటే "ప్స్ ... ప్స్ ... వద్దు వద్దు చిన్న ముండ తెల్లగా ముద్దు వస్తూంది పాపం చంపకు అన్నాడు అభిరామ్. మొదటిసారి ఈ షికారీకి రావడమేమో ఆ యిద్దరికి అంతా ఆశ్చర్యంగా, అనందంగా వుంది. ఆ గతుకుల సన్నని బాటకూడా అంతం అయి నాలుగు పక్కల మహా వృక్షాలతో నడవడానికి కూడా తోవలేని చోటు వచ్చేసరికి జీపు ఆపేశారు. అంతా జీపు దిగారు. గన్నర్ బ్యాటరీలైటు, గన్‌తో ముందు నడుస్తూండగా గార్డు సామానులన్నీ మోస్తుండగా తలొ కళ్ళు తలో బ్యాటరీలైట్ పట్టుకుని చెట్లకొమ్మలని తప్పించుకుంటూ కింద చూసుకుంటూ నడవసాగారు. పైన పండు వెన్నెల కురుస్తున్న ఆ దట్టమైన చెట్లని చీల్చుకుని వెన్నెల రాలేకపోవడంతో అంతా చీకటిగా వుంది. కీచురాళ్ళ రొద, నడుస్తుంటే కింద ఎండుటాకుల గలగలలు-ఆ వాతావరణం చూస్తుంటే పండాకి, మహంత్‌కి భయంకంటే ఏదో ఎడ్వంచర్లా వుంది. వీళ్ళ అడుగుల చప్పుడికి నిద్రపోతున్న ఓ లేడి లేచి చెంగున దుమికి పొదలోకి పారిపోయింది. కుందేళ్ళు గాభరాపడి పరిగెత్తాయి. మూడు ఫర్లాంగులు దట్టమైన అడవి మధ్య నడిచాక పట్నాయక్ ముందే ఏర్పాటుచేసిన మంచె దగ్గిరకి చేరారు. పెద్ద పెద్ద కొమ్మలతో వున్న మహావృక్షం మధ్య కొమ్మలమీద వెదురు కర్రలతో మంచె తయారుచేశారు. పైన గడ్డి పరిచారు. ఆరుగురు శుభ్రంగా కూర్చోవచ్చు. ముందే పంపిన ఓ గార్డు మాటుకట్టడానికి తీసుకొచ్చిన మేకపోతుని పెట్టుకుని అక్కడ కూర్చుని వున్నాడు. కంట్రాక్టరు చకచక గడ్డిమీద జంబుకానా పరిచి అంత సామాగ్రి చేరేశాడు. అంతా ఒకరినొకరు చేయి అందించుకుని పైకి ఎక్కారు. కింద కాస్త దూరంలో ఓ చెట్టుకి మేకపోతుని కట్టారు.



రమాకాంత్ ఒక గన్, గన్నర్ ఒక గన్, గార్డు మరో గన్ను పట్టుకుని ముగ్గురూ మూడు దిక్కులకి మొహం పెట్టుకుని రెడీగా పోజిషన్ చూసుకుని కూర్చున్నారు.

పులి వేటకి సరదాతోపాటు ధైర్యసాహసాలేకాక, ఓర్పు చాలా అవసరం. అలా చీకట్లో విసుగు- విరామం లేకుండా కళ్ళు విప్పుకుని రాత్రంతా పులికోసం ఎదురుచూడడానికి చాలా ప్రాక్టీసే వుండాలి. ఒకోసారి అంతలా కాచుకున్నా పులి కనపడకపోవచ్చు. పులి కన్పించినా గురి తగలకపోవచ్చు. గుండు తగిలినా సరియైనచోట తగలక పులి పారిపోవచ్చు. వరసగా రెండు మూడురోజులు ఓపిగ్గా ఎదురు చూడాల్సిరావచ్చు. అంచేత పులి వేటకి వెళ్ళినప్పుదల్లా పులి దొరుకుతుందని లేదు. అంత మాత్రంచేత నిస్పృహపడి లాభంలేదని రమాకాంత్ మిత్రులిద్దరికి ముందే చెప్పాడు. రమాకాంత్ ఏభై సార్లయినా వేటకి వెళ్ళి వుంటాడు. అన్ని సార్లలో కేవలం ఆరు పులులని మాత్రం చంపగలిగాడు.

గంట రెండు గంటలు మూడు గంటలు అలా గడిచిపోతున్నాయి. రెండు గంటలయింది. అలా చీకట్లో సిగరెట్లు కాలుస్తూ- అప్పుడే రెండుసార్లు టీ తాగారు అందరూ. పండాకి, మహంతికి ఆవలింతలు వస్తున్నాయి. కళ్ళు కూరుకు పోసాగాయి. కూర్చుని కూర్చుని కాళ్ళు పట్టేస్తున్నాయి. ఆకుల సందునించి కొద్ది కొద్దిగా వెన్నెల వెండి బిళ్ళల్లా పడుతోంది. కింద మేకపోతు తనకేదో జరగ బోతూందని పసిగట్టి భయం భయంగా 'మేమే' అని అరుస్తూంది మధ్య మధ్య. తాడు తెంచుకోడానికి గింజుకుంటుంది. మట్లాడుకోడానికన్నా లేదేమో ఆ నిశ్శబ్దంలో. అడవిలో ఆకుల గలగలలు- దూరంగా ఎక్కడో కొండలమీదనించి దుముకుతున్న నీటిధార శబ్దం. కీచురాళ్ళు నక్కల అరుపులు, వుండి వుండి వినిపించే ఏవో పిట్టకూతలు. ఆ వాతావరణం ముందు అంతా అద్భుతంగా వుందని పించినా రానురాను విసుగు పుట్టసాగింది మిత్రులిద్దరికీ. రమాకాంత్‌కి అలవాటేమో నిశ్శబ్దంగా సిగరెట్ మీద సిగరెట్ కాలుస్తూ ఓపిగ్గా ఎదురుచూస్తూ కూర్చున్నాడు. యాంత్రికంగా కూర్చున్న ఆరోజు అతని మనసు వేటమీదలేదు. శరీరం ఇక్కడున్నా మనసు ఇందాక చూసిన స్త్రీమూర్తిని వేటాడుతూంది. వెన్నెలలో కన్పించిన ఆ సౌందర్యం అతని ఏకాగ్రతని చెడగొడుతూంది. డబ్బిచ్చి కొనుక్కునే పరాయి

స్త్రీల పొందు అతనికి కొత్తకాదు. కాని ఈరోజు ఈ స్త్రీ అలా డబ్బిచ్చి కొనుక్కునేది కాదనుకోగానే ఏదో నిరాశ, నిస్పృహ కల్గింది. ఆ నిరాశే అతనిలో మరింత ఆకర్షణ పెంచినట్టయి వద్దనుకున్నా పదే పదే ఆమె రూపమే గుర్తు రాసాగింది.

మూడు గంటలయింది. ఇంక ఈరోజు ఏ పులీ రాదు కాబోలు అన్న నిరాశ చోటు చేసుకుంది అందరిలో. కూర్చునే కునికిపాట్లు పడుతున్నారు అందరూ. అంతలో హఠాత్తుగా దూరంగా ఎక్కడో పులిగర్జన వినబడింది.

అందరికి నిద్రమత్తు ఒక్కసారిగా వదిలిపోయింది. ఎటెన్షన్‌లో కూర్చుండి ఆసక్తిగా చూడసాగారు. 'ఎక్కడో ఈ చుట్టుపక్కలకి వచ్చింది' రమాకాంత్ నెమ్మదిగా గుసగుసలాడాడు. పులి అరుపు విని మేక గింజుకుంటూ అరవసాగింది. గాలితోపాటు పులివాసన తగిలింది. తప్పకుండా మేక అరుపువిని పులి వస్తుందని ఆశగా ఎదురుచూడసాగారు. ఎక్కడ ఏ ఎండుటాకు కదిలినా, పొద కదిలినా చీకట్లో కళ్ళు చీల్చుకుని చూడసాగారు. నాల్గు గంటలయింది. ఎండాకాలం ఏమో మరో అరగంటలోనే తొలి వెలుగు రావచ్చు. యింకేం వస్తుంది పులి అనుకుంటూ, అప్పుడే తిరిగిన చల్లగాలికి అందరికి చిన్న మత్తు రావడం ఆరంభించింది. హఠాత్తుగా ఒక్కసారి మేక అరుపుతోపాటు, దబ్బున చప్పుడవడం ఏమిటి అందరికంటే గన్నర్ ముందు తేరుకుని ఆ దిక్కుగా తుపాకి పేల్చాడు. వెంటనే అందరిచేతుల్లో బ్యాటరీలైట్లు వెలిగాయి. ఒక్క ఉదుటున పులి మేక మీదకి లంఘించి మేకను కరచుకుని పారిపోయింది. పొదలు కదలడం మాత్రం వెలుగులో అందరికీ కన్పించింది. రమాకాంత్, గార్డు, పొదల కదలికవైపు తుపాకులు కాల్చారు. కాని పులికి తగలలేదని అర్థం అయింది. "ప్స్ ! పారిపోయింది. ఈ పొదలలో ఎక్కడో దాక్కుని సమయం కనిపెట్టి మీదపడింది ఒక్కసారి. ఈ పులులూ మనుష్యుల కంటే తెలివిమీరిపోతున్నాయి. బాడ్‌లక్ ఏం చేస్తాం. వుయ్ విల్ ట్రై అవర్ లక్ టుమారో'' అన్నాడు రమాకాంత్.

"దిగి లైటుతో చూద్దామా?'' అన్నాడు అభిరామ్ కుతూహలంగా.

"వద్దు. ఏ పొదచాటునో వుంటే వుండచ్చు. వెలుగు వచ్చేవరకు దిగడం ప్రమాదం'' అన్నాడు. అందరికి ఉత్సాహం పోయింది. వెలుగు రావడంకోసం

ఎదురుచూస్తూ ఆవలిస్తూ కూర్చున్నారు. మరో అరగంటలో తూరుపు తెల్లబడింది. ఇంక భయంలేదని అంతా చెట్టుదిగి పొదలవైపు ఓసారి లైట్లువేసి వెదికారు. బ్యాటరీలైటు వెలుగులో కొంతమేర మేక రక్తం గుర్తులు కన్పించాయి. అప్పుడు వెడితే లాభంలేదని అంతా వెనుదిరిగి జీపు చేరారు. ఐదు గంటలకల్లా బంగళాచేరి వళ్ళెరగకుండా పది గంటలదాకా నిద్రపోయారు. నిద్రపోయేముందు ఒకసారి డేరావైపు చూశాడు రమాకాంత్.

✲ ✲ ✲

పదిగంటలకి మెలకువ రాగానే ఒక్కసారిగా తుళ్ళిపడి లేచి కిటికీలోంచి టెంట్‌వైపు చూశాడు రమాకాంత్. టెంట్ బయట తాడుమీద ఆమె బట్టలు ఆరవేస్తూంది. స్నానంచేసి వేసుకున్న జారుముడి- వంగపండు రంగుమీద ఏవో పెద్దపూల డిజైను అదేరంగు జాకెట్టు- రెంటికి మధ్య మెరిసే నడుం చూడగానే రమాకాంత్ గుండెలు ఒక్కక్షణం జోరుగా కొట్టుకున్నాయి. ఆమె యిటు తిరుగుతే బాగుండును అనుకొంటూండగానే ఆమె బట్టలు ఆరవేసి యిటువైపు తిరిగి ఓసారి బంగళావైపు చూసి లోపలికి వెళ్ళిపోయింది. ఆ చూసిన ఒక్కచూపే రమాకాంత్ మతి పోగొట్టడానికి సరిపోయింది.

ఆ రోజంతా రమాకాంత్ మనసు మనసులోలేదు. ఆఫీసర్లతో యాంత్రికంగా డిస్కస్ చేశాడు. భోజనం చేసినా మధ్యాహ్నం పడుకున్నా అంత మొద్దు నిద్రలోనూ ఆమె గురించే కలలు కన్నాడు. సాయంత్రం అయిందగ్గిరనించి రమాకాంత్ మూడుసార్లు బాత్‌రూమ్‌కి వెళ్ళి వచ్చాడు. రెండుసార్లు వాంతి చేసుకున్నాడు. తల తిరుగుతూందని, దిమ్ముగా వుందని తల పట్టుకు కూర్చున్నాడు. మాత్ర వేసుకున్నా తగ్గక బాధపడ్డాడు. మిత్రులిద్దరూ గాభరా పడ్డారు. “మరేం ఫరవాలేదు, రాత్రి నిద్దుర చాలలేదు. నిన్న యివాళ డ్రింక్స్, భోజనం హెవీ అయి అరగ లేదు అంతే'' అన్నాడు రమాకాంత్. రాత్రి అయినకొద్దీ అతని తలనొప్పి ఎక్కువయింది. “ఫ్రెండ్స్ యివాళ షికారికి రాలేను. మీరు వెళ్ళండి. కంట్రాక్టర్ దగ్గిరుండి తీసికెడతాడు. అన్ని ఏర్పాట్లు చూశాను'' నీరసంగా అన్నాడు.

"నీవు లేకుండా ఏం బాగుంటుంది. నిన్న చూశాంగా, ఇంక వెళ్ళకపోయినా ఫరవాలేదు" అభిరామ్ అన్నాడు.

"అబ్బెబ్బే అదేమిటి ... షికారికోసంవచ్చి పులిని కొట్టకుండా వెళ్ళడం ఏమిటీ? ఇవాళ మరోచోట మాటు వేయించమని చెప్పాను. పులి తప్పక వస్తుంది. మీరివాళ మిస్ కాకూడదు. నేను లేకపోతేనేం పట్నాయక్ దగ్గరుండి తీసికెడతాడు" స్నేహితులని వప్పించాడు రమాకాంత్. కంట్రాక్టర్‌ని పిలిచి అప్పగించాడు. 'మీదే పూచి, పులిని కొట్టాలి - అన్ని ఏర్పాట్లు చెయ్యండి" అన్నాడు.

"అలాగే సార్. మీకెందుకు మీరు రెస్ట్ తీసుకోండి. అన్నీ నేను చూసు కుంటాను. పులిని కొట్టి మరీ వస్తాం ఉదయం" అన్నాడు వినయంగా.

రాత్రి అంతా వెళ్ళాక చల్లగాలికి బయట కుర్చీలో కూర్చుని సిగరెట్ తాగుతున్నాడు రమాకాంత్. కిచెన్ పని పూర్తయి అందరూ వెళ్ళినట్టున్నారు, అంతటా నిశ్శబ్దంగా వుంది.

వెన్నెల పిండారబోసినట్లుంది. గోడమీదకి పాకించిన సన్నజాజి తీగనిండా నక్షత్రాలలా జాజిపూలు విచ్చుకుని తెల్లగా మెరుస్తున్నాయి. వాటి పరిమళం అతనికి పులకింతనిస్తూంది. వెన్నెల అతని మతిపోగొడ్తుంది. వుండి వుండి అతను టెంట్‌వేపు చూస్తున్నాడు. నిన్నటిలాగే ఆమె తెల్లచీరతో బయట ఇటు అటు తిరుగుతూంది. కాసేపు విసుగొచ్చినట్లు కుర్చీలో కూర్చుంటుంది. ట్రాన్సిస్టర్ నింటూ కాసేపు కాలక్షేపం చేస్తుంది, పాపం వంటరిగా వుండి విసుగుగా వున్నట్లుంది అనుకున్నాడు. ఆమె వంటరితనం - అతనిలో ఏదో ఆలోచనలని రేపుతూంది- వాతావరణం ఏదో ప్రోత్సాహాన్నిస్తుంది. కాని అంతలో ఏదో సందేహం, బెరుకు, భయం, ఏదో వంకన షూటింగ్‌కు వెళ్ళకుండా తప్పించుకుని ఏకాంతం దొరికేట్టు చేసుకున్నాడు కాని- అంతకుమించి ముందుకు వెళ్ళడానికి జంకుగా వుంది. ప్రయత్నించిచూస్తే ఏం పోయింది అని అతని మనసు తొందరపెడ్తూంది. ఇదివరకు ఎంతోమంది స్త్రీలని చూశాడు కాని ఈనాటి ఈ అనుభూతి అతనికి కొత్త ! అందనిదానికి అర్రులు చాచడంలో కావాలనుకున్నది పొందడానికి ఈ నిరీక్షణ, ఈ ఆరాటం అతనికి తెలియనివి ! అందుకే అతనిలో ఏదో ఆవేశం, ఆరాటం. ఎక్సైట్‌మెంట్‌తో




చెమట పడుతోంది. ఏం చెయ్యాలో, ఎలా ఆరంభించాలో- ఆడదానితో అన్ని అనుభవాలు రుచి చూసిన అతనికే తెలియడంలేదు. ఆమె ఏదన్నా అంటే గొడవచేస్తే తన పరువేంగాను ??

ఆఖరికి ఏమయితే అయింది. కనీసు ఆమెతో మాట్లాడి ఆమెని దగ్గర నించన్నా చూడాలన్న కాంక్షని అదుపులో పెట్టుకోలేకపోయాడు. ఆమె ధోరణి చూసి ముందంజ వెయ్యొచ్చు. లేదంటే వూరికే పరిచయం చేసుకుని మాట్లాడినట్లు మాట్లాడి రావచ్చు. అందులో తప్పేం ఉంది ? మనసు కూడదీసుకుని ధైర్యం చిక్కబట్టుకుని తడబడుతున్న అడుగులతో టెంట్‌వేపు వెళ్ళాడు.

✲ ✲ ✲

తెల్లవారుజామునే పులిని చంపిన విజయోత్సాహంతో వేటకి వెళ్ళిన అందరూ వచ్చారు. పులి నిన్నటిలాగే తెలివిగా మాటు వేసిన మేకపోతుని కరుచుకు పారిపోబోయింది. అయితే గన్నర్ చాలా త్వరగా తుపాకి పేల్చడంతో మొదటి గుండె సరి అయిన చోట తగిలి పులి మేకపోతుని వదిలి పారిపోబోయింది. రెండో గుండుకి మరి కదలలేక నేలకూలింది. మూడో గుండుకి ప్రాణం వదిలింది. ఏడడుగుల ఆ పులిని జీపుకి తాళ్ళుకట్టి ఈడ్చుకొచ్చారు. పులి చర్మం, గోళ్ళు, పులి తల అన్నీ మిత్రులిద్దరికీ పంపే ఏర్పాటు చేశాడు రమాకాంత్. అంతా పులిని కుతూహలంగా చూడడం అయ్యాక ...

ఉదయం బ్రేక్‌ఫాస్ట్ కాంగానే ప్రయాణం పెట్టుకుని జీపు ఎక్కబోతున్నారు. అందరు "మిస్టర్ పట్నాయక్ మీ ఆతిధ్యాన్నికి మెనీ థాంక్స్. చాలా బాగా ఏర్పాటు చేశారు అన్నీ" అంటూథాంక్స్ చెప్పాడు రమాకాంత్. తన అలవాటుకి విరుద్ధంగా అంటే ఆ ఏర్పాటు చేయడం వారి విధిలా భావించి అతను ఈసారి ప్రత్యేకంగా కంట్రాక్టరుకి కృతజ్ఞతలు చెప్పాడు. పట్నాయక్ ఓ నవ్వు నవ్వి "హీ ... హీ ... తమ దయ సార్. నాదో చిన్న మనవి" అన్నాడు నమ్రతగా.

"ఏమిటి చెప్పండి?"

"అదే సార్. ఈ ఏరియా అడవి కొట్టి కలప, టేకు చెట్లు నాటాల్సిన మూడు లక్షల కాంట్రాక్టు ..."



"ఐసీ !.... టెండర్ కాల్ చేశాడా డి.ఎఫ్. వో ?'' సాలోచనగా అడిగాడు.

"ఆ చేసారండి ... టెండరు పెట్టానండి - తమరు కాస్త దయచూసి డి. ఎఫ్.వో. గారికి ...'' పట్నాయక్ చేతులు నలుపుకుని అన్నాడు.

"ఆ ... సరే చూస్తాను. డోంట్‌వర్రీ. డి.ఎఫ్. వో.కి చెప్తాలెండి'' అంటూ జీపు ఎక్కాడు రమాకాంత్.

***

అంతా వెళ్ళాక తీరుబాటుగా మిగిలిన సీసాలు ముందు పెట్టుకుని మిగిలిన చికెనోతో చికెన్ ఫ్రై చేయించుకుని పట్నాయక్, ఇద్దరు రేంజర్లు జల్సా చేసుకుంటున్నారు. కాస్త దూరంగా ఆమె కూర్చుని ప్లేటులో వేరుశనగ పలుకులు ఒకోటి తీసి నోట్లోవేసుకుంటూంది. పట్నాయక్‌కి అప్పటికే కైపు తలకెక్కింది. చాలా కులాసాగా ఖుషీగా నవ్వుతూ తుళ్ళిపోతున్నాడు. "ఏదీ దొర ఏమన్నాడు మళ్ళీ చెప్పు - నిన్న రాత్రి జరిగింది అంతా చెప్పు ...'' నవ్వుతూ అడిగాడు పట్నాయక్. ఆమె ముసి ముసి నవ్వులు నవ్వి 'చెప్పాగా' అంది.

"అహ్ ! అలాకాదు సరిగా చెప్పు.''

"చెప్పడానికి ఏముంది. పాపం వంటరిగా వున్నారు భయం లేదా అంటూ వంక కల్పించుకుని పలకరించాడు, ఆ అవకాశం కోసం చూస్తున్న నేను కూర్చోపెట్టి కాఫీ యిచ్చాను. అక్కడ నించి ప్రశ్నలు మొదలుపెట్టాడు. ఊరికే పదే పదే నీలాంటి అందగత్తె చదువుకున్నది. ఆ ఎద్దుకి పెళ్ళాం ఎలా అయావు అంటూ బోలెడు సానుభూతి, జాలి కురిపించాడు. నా బీదరికం. నాకిష్టం లేకుండా రెండో పెళ్ళికి నన్ను కట్టబెట్టడం కన్నీళ్ళతో జాలిగా చెప్పి, నా బాధలు చెప్పుకున్నాను. పాపం కరిగిపోయాడు. ఇద్దరిదీ ఒకటే కథ అని ఓదార్చాడు. తరువాత మరో అడుగు ముందుకువేసి నీ అందాన్ని అడవిగాచిన వెన్నెల చెయ్యద్దని, ఇదేం పాపం గాదు. ఈ ఒక్కరోజు అనుభవం యిచ్చిన జ్ఞాపకాలతో మిగిలిన చేదు జీవితం మింగవచ్చని, నీ అందం నన్ను పిచ్చివాడిని చేసింది అనుగ్రహించు అంటూ మీద పడ్డాడు. అతను నన్ను వలలో వేసుకోడానికి ఎంత ఆరాటపడుతున్నాడో అతన్ని నేను వలలో వేయడానికి అంత ఆరాటపడుతూనే వున్నా గనక కాస్త బెట్టుచేస్తూ

పాపం పుణ్యం అంటూ పతివ్రతలా నటిస్తూ లొంగిపోవడం ఇష్టం లేనట్టు నటిస్తూ కౌగిలిలోకి చేరాను'' ఆమె విలాసంగా, గర్వంగా నవ్వుతూ అంది.

"ఇంత బాగా నటించాను మరి నా బహుమతి ఏది ?'' వయ్యారంగా చెయ్యి చాపింది. "తొందరెందుకు పిల్లా ఇదిగో వెయ్యి'' అన్నాడు నోట్లకట్టలు లెక్కపెట్టి

"ఇంత కష్టపడ్డా రేటు మించి ఇయ్యడం లేదు కదూ'' అంది గునుస్తూ.

"బాగుంది. వంద రూపాయలు పడేస్తే పదిమంది దొరుకుతారు. ఏదో హైక్లాస్ దానివని, కాస్త ఎర్రగా బుర్రగా వున్నావని ఇంగ్లీషు మాట్లాడుతావని ఇంతిచ్చా, ఇంకానా'' అన్నాడు పట్నాయక్.

"గురూ మా బలే టోకరా తినిపించావు దొరకి'' అన్నాడు ఓ రేంజరు.

"అద్సరే - నీ పెళ్ళాం అని చెప్పకపోతే వచ్చే నష్టం ఏమిటి గురూ !'' మరో రేంజరు సందేహం.

"నా పెళ్ళాం కాకపోతే ఆడికి నేనిచ్చిందిదేటుంది. ఆడికి తప్పుపని చేసిన పాపభీతి ఏటుంటుంది-ఆడు నాకు ఋణపడినట్టు ఫీలవుతాడా ? బజారుదంటే అందరికి హక్కేకదా-మరోడి పెళ్ళాంమీద వున్న మోజుంటుందా'' నవ్వాడు గలగల పట్నాయక్.

"బలే బుర్ర గురూ నీది. ఐడియా అంటే నీదే- వెయ్యి రూపాయలు ఖర్చెట్టి మూడు లక్షల కాంట్రాకు కొట్టేశావు. ఎరచూపి పులిని కొట్టేశావు. దొర ఆ పులిని కొట్టేస్తే నీవు ఈ పులినే కొట్టేశావు. రేంజరు భుజం చరిచి గలగలా నవ్వాడు. పట్నాయక్ గర్వంగా మీసం మెలేశాడు.

**ఆంధ్రజ్యోతి వారపత్రిక (1992 ప్రాంతం)** 





# నిమిత్త మాత్రులు

రోహిణికార్తె ఎండలు. రోళ్లు బద్దలు కొడుతున్నాయి. ఫేను క్రింద కూర్చున్నా వేడిగాలితప్ప ప్రాణానికి సుఖం ఏది ? వడగాల్పు ఆ చెవినించి ఈ చెవికి కొడుతోంది.

ఎంత చికాకుగావున్నా తప్పదుగనక అలాగే ఆపసోపాలు పడ్తూ కూర్చుని పేపర్లు దిద్దుకున్నాను. ఈ పేపర్లు వారం లోపల వదుల్చుకోవాలి. అప్పుడిక కాస్త ఊపిరి పీల్చుకోడానికి అవుతుంది. ఏవూరైనా వెళ్ళి సరదాగా తిరిగిరావాలి. వెళ్ళబోయే చోటుగురించి; అక్కడ గడుపబోయే రోజులగురించి మనసు ప్లాన్లు వేస్తోంది. అలవాటుగా, యాంత్రికంగా కళ్ళు పేపర్ల మీద నిలిపాను. అలవాటయిన చేతులు తమపని అవి చేస్తున్నాయి.

వీధి తలుపు ఎవరో కొడ్తున్నారు. చేస్తున్న పని ఆపి వెళ్ళడానికి బద్ధకం వేసింది. ఇంత ఎండలో ఎవరొచ్చారో, కొంపమునిగినట్లు ! మళ్ళీ రెండుసార్లు కొట్టారు ఎవరో. తప్పక విసుక్కుంటూ లేచివెళ్ళి తలుపు తీశాను.

గుమ్మం ముందు ఎండలో కళకళలాడుతూ ఓ ఎంబాసిడర్ కారాగి వుంది. మెట్లమీద ఓ వ్యక్తి నిల్చుని నన్ను చూడగానే నమస్కారం చేశాడు. ప్రతి నమస్కారం చేశాను. ఆయనెవరో ఎక్కడా చూసిన గుర్తయినాలేదు నాకు. లోపలికి రమ్మనాలో వద్దో తేల్చుకోలేక ఒక్కక్షణం అలా నిలబడ్డాను. ఆయన తనని పరిచయం చేసుకుంటాడేమోనని.

"మీతో సిన్న పనివుండి వచ్చానమ్మా ?'' అన్నాడు ఆయన తానెవరో చెప్ప కుండానే.

"లోపలికిరండి'' దారితీస్తూ అన్నాను.

లోపలికి వెళ్ళగానే టేబుల్‌మీది చిందర వందరగావున్న పేపర్లని గబ గబ

డ్రాయరులో పెట్టాను. నేను దిద్దే పేపర్లు మరొకరి కంట పడడం నాకిష్టంలేదు. అయినా, ఈ లోపల ఆయన చూడనే చూశాడు. "పేపర్లు దిద్దుకుంటున్నట్టున్నారు, మీపని పాడుసేశాను గాబోలు'' అదోరకంగా అ పేపర్ల వంక చూస్తూ అన్నాడు.

"పరవాలేదులెండి'' మర్యాదకి అన్నాను.

ఆయన మాటల్లో యాస ఆ వేషంచూస్తే డబ్బుగల కమ్మలో, రెడ్లో అని తెలిసిపోతూంది. పల్చటి గ్లాస్కో లాల్చి, పంచ, ఖరీదుగల చెప్పులు, ఎనిమిదివేళ్ళకి ధగధగలాడే రాళ్ళ వుంగరాలు, గోల్డువాచి, వీధిలో ఎంబాసిడర్ అన్ని అతనికున్న డబ్బుని చాటకనే చాటుతాయి అందరికి. నాతో ఆయనకేంపనో నాకు అర్థంకాలేదు.

"నా పేరు యీరపరెడ్డి అంటారండి ... మాది గోపన్నపాలెం..'' అని నమ్రంగా అన్నాడు వచ్చి కూర్చున్న ఐదు నిమిషాలకి.

"ఆహా ... ఏంచేస్తుంటారు మీరు?....'' ఏదో అడగాలని అడిగాను

"ఆ.... ఏదో రెండు పంచదార మిల్లులు, రెండు రైసుమిల్లు లున్నాయి.... అవి సూసుకుంటాను.... ఇంకా చెరుకుతోట, హైదరాబాదు కాడ ద్రాక్షతోట అది వుందనుకోండి... మాలాంటి వోళ్ళకి ఏదో యిలాటి యాపారాలు తప్ప ఉద్యోగాలు సద్యోగాలు ఏం సేస్తాం సెప్పండి.

రెండు పంచదారమిల్లులు, రైసుమిల్లులు, పొలాలు, తోటలు వున్న వాడికి వెధవ ఉద్యోగం ఎందుకు.. యింతకీ యికనికి నాతో ఏంపనో అడగందే చెప్పేట్టులేడు.

"ఏం పనిమీదవచ్చారో చెప్పారుకాదు....''

"హి హి ... ఓసారి తమ దర్శనం సేసుకుందామని....'' ఓ వెకిలి నవ్వునవ్వి చేతులు నలుపుకున్నాడు నసుగుతూ.

నా దర్శనం ! నేనేం దేవతనా ఏ సినిమా తారనా, పోనీ ఏ మంత్రినా ! పోనీ ఏ లక్షలకధికారిణినా ? నా దర్శనం చేసుకుంటే అతనికేం లాభం ! ఆ నసుగుడు చూస్తుంటే పళ్ళు మండుతూంది. చెప్పేదేదో త్వరగా చెప్పేయకూడదూ ?

"తమవల్ల సిన్న ఉపకారం కావాలి.... మళ్ళీ ఆగాడు.



"నావల్ల మీకేం ఉపకారం జరుగుతుంది. మీలాంటివాళ్ళకి నాలాంటి మామూలు కాలేజి లెక్చరరుచేసే ఉపకారం ఏముంటుందండి.." నవ్వుతూనే అంటించాను.

"అమ్మమ్మ అలా అనకండి.... తమరి సేతుల్లో లేనిదేముంది .... మీరు తల్చుకోకపోతే తమరు కాస్త దయుంచకపోతే మాలాంటోళ్ళం ఎలా రోజులు నెట్టుకు రాగలం సెప్పండి...."

పొగిడి, ఉబ్బేస్తున్నాడు ? ఎంత బింకంగా వుందామన్న నా మొహంలో ప్రసన్నత కనిపెట్టినట్టున్నాడు. మరికాస్త నమ్రతగా, వినయంగా "తవరి గురించే కాలేజీలో మా గొప్పగా సెప్పుకుంటారట, సాలా బాగా పాఠాలు చెప్తారని చాలా స్ట్రిక్ అని.."

"ఆ ... ఆ మాటలకేంలెండి ..." ఇష్టం లేనట్టుగా మాట త్రుంచేశాను. ఎంతసేపు కూర్చున్నా అసలు సంగతి చెప్పకుండా అతను చేసే కాలయాపన చూస్తుంటె చిరాకు పుట్టుకొస్తుంది నాకు.

"ఇంతకీ, మీ పని ఏమిటో చెప్పండి. కాస్త అసహనంగా ఆడిగాను.

"అబ్బే ! ఏం లేదు. పెద్దపని కాదనుకోండి. మీరు శ్రమ అనుకోకపోతే.... కాస్త శ్రమ తీసుకుని....

"ఊ. చెప్పండి." "అదే. తవఁకాడికి మా వాడి పి.యు.సి. కెమిస్ట్రీ పరీక్ష పేపర్లు వచ్చాయని తెలిసింది.

ఇదా సంగతి ! నేనెంత మూర్ఖురాలిని ? పరీక్షలయ్యాక నా దగ్గరికి వచ్చే అపరిచితులు నా సహాయం అపేక్షించి వచ్చే వారయి వుంటారు. నా వల్ల ఎవరికన్నా కావల్సిన పని అదొకటేనని, నావల్ల జరిగే ఉపకారం అదొకటేనని ముందే నాకెందుకు తట్టలేదో? ఆయన వచ్చిన పని తెలిశాక నా మొహంలో ప్రసన్నంపోయి గంభీరత అలుముకుంది.

"ఎలా తెల్సింది ? ఎవరు చెప్పారు ?"

 

"దాందే ముందండీ, ఎవరు సెపితేనేం. మీకాడకొచ్చినాయి ఆ పేపర్లని నిక్కచ్చిగా తెలిసిందినాకు ....'' వెకిలి నవ్వు ఒకటి నవ్వాడు.

ఆవును నిజమే. తెల్సుకోడం ఏంకష్టం. డబ్బుతో జరగని పనులు ఏముంటాయి యీ లోకంలో. డబ్బుకి దాసోహం అనని వాళ్ళెంత మంది వుంటారు!

"అయితే. ఏం అంటారు ఇంతకి మీరు ?''

"తమరు కాస్త దయుంచి మావాడి నంబరు పేరున చూసి ఎన్ని మార్కు లొచ్చినయో సెపితే మీ మేలు మరవను ...''

"క్షమించాలి. అలాంటివి మీరడగకూడదు, మేం చెప్పకూడదు.... అసలు మీరిలా రావడం, అడగడం తగిన పనికాదు ! ఎవరికైనా తెలుస్తే నా ఉద్యోగానికి ఎంత ముప్పో తెలుసు మీకు ! కఠినంగా అన్నాను.

"అమ్మమ్మ ... అదెలా తెలుస్తుంది. మూడో కంటివాడికి ఈ మాట తెలియ నిస్తానా. ఆ భయం మీకొద్దు...'' అభయంఇస్తూ మాట్లాడాడు.

"ఎవరికి తెల్సినా మానినా, అలాంటి పనులు చేయడం నా ఉద్యోగ ధర్మానికి విరుద్ధం.... మీరు దయుంచి నన్ను ఇబ్బందిలో పెట్టకండి ...'' నా నిశ్చయం మారనట్టు గట్టిగా నొక్కి చెప్పాను.

ఆయన ఒక్కక్షణం నిరాశపడ్డట్టు మొఖం పెట్టాడు. వెంటనే ఆ మాత్రానికే డీలా పడిపోతే ఎలా అన్నట్టు ఓ నవ్వు నవ్వి, రెండు చేతులు జోడించి నమస్కారం పెట్టాడు. "అమమ్మ మీరలా అనేస్తే ఎలా అమ్మా. మీ మీద ఆశ పెట్టుకొని యింతదూరం వచ్చాను... యీ మాత్రం సాయం మీరు సేయక తప్పదు. ఎవరికి తెలుస్తుందేమోనన్న సందేహం మీకెంత మాత్రం అక్కరలేదు. కాస్త పేపరుచూసి పేసయ్యాడో లేదో చెప్పేస్తే చాలు... ఒక్కక్షణం ఆగి మీ కష్టం వుంచుకోను ... ఏదో నా శక్తికొద్ది'' జేబులొంచి ఓ కవరు తీసాడు.

లంచం యిస్తాడన్నమాట! ఎంత ధైర్యంగా మొహం ఎదుటే చెపుతున్నాడు. నా వళ్ళు మండింది. తక్షణం బయటికి గెంటాలన్న ఆవేశం వచ్చినా పెద్దమనిషి అంతలా అమర్యాదగా మాట్లాడి పొమ్మనలేకపోయాను.

"చూడండి ... నాకిలాంటివి ఇష్టంలేదు ... యిలాంటి అవినీతిపనులకి పాల్పడడం నాకు చేతకాదు. దయచేసి మీరు నన్ను ఇరకాటంలో పెట్టి బాధ పెట్టకండి ..." అంతకంటె కఠినంగా యింకెలా చెప్పాలో ఆ క్షణంలో నాకు తెలియలేదు ....

అబ్బే తవర్ని బాధపెట్టడం నాకు మాత్రం ఇష్టమా? ఒకరికష్టం వుంచుకోవడం నా కిష్టం లేదు....ఉత్తినే ఏ పని ఎవరిచేత సేయించుకోవాలన్నా నాకదోలా వుంటుంది. అంచేత అన్నాను సుమండీ ... ఏదో సంతోషంతో ఇచ్చినదాన్ని మీరు కాదనకూడదు. అంటూ టేబిల్ మీద కవరు తెచ్చి పెట్టాడాయన. గుమ్మం దగ్గరికెళ్ళి డ్రైవర్ని కేకేశాడు. డ్రైవరు ఏదో బుట్టతెచ్చి లోపలపెట్టాడు... మా ద్రాక్షతోటలో కాసిన దాక్షాలండి అనాబ్‌షా ద్రాక్షల రుచి మరి ఏ ద్రాక్షకి రాదుకదండీ ... అతి నైపుణ్యంతో సంభాషణ సాగిస్తున్న ఆయన నాకు మాట్లాడడానికి అవకాశం యీయలేదు. ఆయన కెలా చెప్పాలో అర్థంకాని స్థితిలో పడ్డాను.

"చూడండి యిలాంటి లంచాలు అవి తీసుకుని పనులు చేయడం నాకు అలవాటు లేదు. దయచేసి ఈ కవరు తీసేయండిక్కడినించి.

"అమ్మమ్మ ... లంచం ఏమిటండీ....ఛీ .. ఛీ... లంచం ఇస్తానా మీ లాంటివారికి ... సంతోషంతో యిచ్చిన కానుక...

"పోనీ లంచం కాకపోతే... కానుక ఇలాంటి కానుకలు పుచ్చుకొనే అలవాటు నాకు లేదు ... మీకు నేను ఏం సహాయపడలేనందుకు క్షమించండి" కా స్త కఠినంగా అన్నాను.

ఆయన నిస్సహాయంగా చూశాడు ... "ఏదో మిమ్మల్ని నమ్ముకుని యింత దూరం వచ్చాను ... ఈ కాస్త సాయం చేసిపెట్టండి ... కాదనరని వచ్చాను ..."

అసలు మీకు మీ అబ్బాయి ప్యాసవుతాడన్న నమ్మకం వుందా? ప్యాసవుతాడని మీకు నమ్మకం వుంటే మార్కుల సంగతి అడగనే అక్కర లేదు ... ప్యాసుకాని పక్షంలో మార్కులెన్ని వచ్చాయో తెలుసుకుని మాత్రం ఏం చేయగలరు! ఆయన అసలు వుద్దేశం రావడానికి గడుసుగా ప్రశ్నించాను.

ఆయన కాస్త ఇబ్బందిగా చూశాడు. "ఆ.... ఆ ... అదేనండీ ఆడు కాస్త పేపరు పాడుచేసానంటున్నాడు అందుకే కాస్తంత ఆరాటం..."

అయితే కేవలం మార్కులెన్ని వచ్చాయో చూసిచెప్పమని కాదు ఆయన కోరిక, ఆ తక్కువ మార్కులు వేయమంటాడు చెప్పాక. ఖచ్చితంగా తనవల్ల కాదని ముందే చెప్పి పంపేయాలి.

పేపరు పాడుచేసానని అబ్బాయి అంటుంటే మార్కులు తెలుసుకుని మాత్రం మీరేం చేస్తారండి... "

"తమ దయుంటే సేయలేనిది ఏముంటుంది సెప్పండి.... చేతులు నలుపుకుంటూ అన్నాడు అదోలా నవ్వుతూ.

ఆయన అసలు ఉద్దేశం స్పష్టంగా అర్థం అయింది.

"మీరు నన్ను క్షమించండి... అలాంటి పనులు చేయడం నావల్ల కాదని ముందే చెప్పాను.. మీరింక నా కాలం మీ కాలంకూడా వృధాచేయడం మంచిది కాదు .... ఈ కవరు తీసుకోండి. ఇలాంటివి నాకు అలవాటు లేదు లేచి నిలబడి కవరుతీసి అతనికి అందించాను. ఆయన తీసుకోలేదు.

"తవరికి క్రొత్త. చిన్నవారు అలవాటులేదు గాబోలు... కాని యిలా ఎంతోమంది చేస్తుంటారు... ఇందులో తప్పేం వుంది సెప్పండి ... మనలాంటి వాళ్ళం ఏదో న్యాయంగా వుండాలంటే మాత్రం యీ ప్రపంచంలో కుదురుతుందా మహామహా వాళ్ళే సేయగాలేంది మనలాంటివారం. ఎంత. నలుగురితోపాటే మనమూ నడవాలి... నిల్చోపెట్టి ఆయన బోధిస్తున్న నీతులు వింటూంటే వళ్ళు మండుకొచ్చింది.

"నలుగురి సంగతి నాకు అక్కరలేదు. నాకు న్యాయం అని తోచింది చేస్తాను... రూల్సుకి వ్యతిరేకంగా వెళ్ళడం నాకిష్టంలేదు... అయినా మీరు యింత డబ్బుగలవారు. మీ అబ్బాయి ఓ ఏడాది పరీక్ష తప్పినంత మాత్రాన మీకు వచ్చే నష్టం ఏముండదు. అబ్బాయి పరీక్ష ప్యాసయి ఏదో నాలుగు రాళ్ళు తెస్తేనేగాని రోజు గడవని వాళ్ల పరీక్షకోసం ఆరాటపడ్డారంటే అర్థం వుంది. మీకేం లక్షాధికార్లు

అబ్బాయి చదివి ప్యాసయినా ప్యాసుకాకపోయినా ఉద్యోగం చేయాలన్న బాధ ఏం లేదు. ఈసారి కాకపోతే మరొకసారి అవుతాడు. దానికోస మీరింత ఆరాటపడడం అనవసరం అంటాను.

"అమ్మమ్మ అలా అనేయకండి. మావాడ్ని డాక్టరు పరీక్ష చదివించా లని నాకెంతో కోరిక. ఎలాగైనా యీ పరీక్ష ప్యాసయిపోతే డాక్టరు పరీక్షకి చదివించేస్తాను వాడిని... సీటు గట్రా అంతా ఏర్పాటు పేశాను ... పరీక్ష ప్యాసయి పోయాడని పించుకుంటే చాలు. మిగతాదంతా నేను చూసుకుంటాను అందుకే తవకాడికి ఇంత అర్జంటుగా పరుగెత్తుకు వచ్చాను... కాస్త దయుంచి మావాడి పేపరు చూచి పెట్టండి అమ్మా ... యీ సిన్న సాయం చేస్తే చాలు .."

అంటే ఈ పరీక్ష ఎలాగో అలాగ మార్కులు వేయించన్నా ప్యాసు చేయించి ఏ మెడికల్ కాలేజికో డొనేషన్ కట్టి మెడిసన్లో చేర్పిస్తాడన్న మాట కొడుకుని. హా ... డబ్బుంటే ఈలోకంలో చేయలేని పనులేముంటాయి. ఇలాంటివాళ్ల పరీక్షలు ప్యాసుకాని వాళ్ళందరూ డబ్బిచ్చి ఏ కాలేజీలోనో సీటు సంపాయించడం, అక్కడో పదేళ్ళు చదివి ఎప్పటికో డిగ్రీ చేతబట్టుకోవడం, సవ్యంగా ప్యాసుకాకపోతే మళ్ళీ డబ్బు కుమ్మరించి డిగ్రీ తీసుకోవడం ఇలా వున్నాయి యీ రోజుల్లో చదువులు. ఇలాంటి చదువులు చదివి, దేశాన్ని ఉద్ధరించడానికి వూరిమీద పడుతూంటే మన దేశం యింతకంటె ఎలా బాగుంటుంది. రెప్పొద్దున్న యీ అబ్బాయి.... యీనాడు పి.యు. సి. పరీక్ష స్వశక్తితో ప్యాసు కాలేకపోయినా డాక్టరయిపోతాడు. బోర్డు కడతాడు. లక్షలార్జిస్తాడు. రోగాలకి సరిగా మందు లీయడం చేతకాకపోయినా ... పరవాలేదు. డిగ్రీ వుంటే చాలు. ఆ డిగ్రీ రావడంకోసం ఎంతటి అవినీతికయినా పాల్పడతారు. ఎంత డబ్బయినా కుమ్మరిస్తారు. అఫ్‌కోర్స్ ఇప్పుడు ఖర్చు పెట్టిన డబ్బుకి పదింతలు, డాక్టరు డిగ్రీ చూపించి పెళ్ళిళ్ళ మార్కెటులో సునాయాసంగా ఆ నష్టాన్ని భర్తీ చేసుకోవడమేకాక లాభం తీస్తారు. ఎంత లేదన్నా యీ డాక్టరు పెళ్ళి కొడుకుని వేలంలో నిలబెట్టి లక్ష రూపాయల పాట పాడిస్తాడు యీ తండ్రి. ఆ లక్షముందు ఇప్పుడు ఖర్చుపెట్టిన ఏ పది పదిహేనువేలు ఎంత. అంతా డబ్బు మహత్యం. ఆ డబ్బుకోసం ఎంతకయినా, ఏం చేయడానికయినా సిద్ధం...."



ఆలోచనలలో వున్న నన్ను చూసి ఆయన కాస్త మెత్తపడుతున్నాను అనుకున్న ట్లున్నాడు.

"మీరింతగా ఆలోచిస్తున్నారు యీ సిన్నపని సేయడానికి మొన్న కాకినాడ వెళ్ళాను. ఆ మాష్టరుగారు నిమిషాలమీద పనికానిచ్చేశారు మారు సెప్పకుండా....." ప్రోత్సహిస్తున్నట్టు లోకవిరుద్ధమైనపని నేనేం చేయబోవడంలేదని నచ్చచెపుతూ మాట్లాడాయన.

ఆశ్చర్యపోయాను నేను. అంటే ఒక్క సబ్జెక్ట్‌లోనే కాదన్నమాట. యిలా ఎన్నింట్లో అయితే అన్నింట్లోనూ డబ్బిచ్చి మార్కులు వేయించి ప్యాసు చేయిస్తాడన్నమాట. నా వళ్ళు మండింది. అందరిలాగే నేనూ డబ్బుకి లొంగి చెప్పిన పని చేస్తానని ఎంతో నమ్మకంతో వచ్చిన ఆయన నమ్మకాన్ని సడలించాలి ? డబ్బుకి లొంగని వాళ్ళు యీ లోకంలో కొందరయినా లేకపోలేదని నిరూపించాలి నేను. నన్నూ అందరితో జతపరచటం సహించలేకపోయాను. నా ప్రత్యేకత నిరూపించుకోవాలి. ఎవరో కాకినాడ లెక్చరర్ మాట్లాడకుండా చేశారట. పాపం ఏం చేస్తాడు. పెళ్లాం పిల్లలు బరువులు బాధ్యతలు నెత్తిన వున్నవాడేమో డబ్బుమీద వ్యామోహపడి వుంటాడు. నాకేం అలాంటి బాదర బందీలు లేవు. అన్యాయార్జితాలకి కక్కుర్తి పడాల్సిన అవసరం నాకేం లేదు. ఖచ్చితంగా చెప్పేయడానికి నిశ్చయించాను.

"చూడండి రెడ్డిగారూ, యిందాకటినించి నాకిలాంటి పనులు అలవాటు లేదని ఎన్నిసార్లు చెప్పినా మీరు వినిపించుకోకుండా ఏవో చెప్తున్నారు. ఎవరో చేసారని నేను చేయనక్కరలేదు? నా ఆశయాలని, నా నిజాయితీని డబ్బుకి అమ్ముకోవాల్సిన అవసరం ఇప్పటివరకు నాకు కలుగలేదు. యిక ముందూ కలుగదని నా నమ్మకం. అంచేత మీరెంత చెప్పినా ఇలాంటి పని డబ్బుకోసం నేను చెయ్యను...."

ఆయన హతాశుడైనట్లు చూశాడు. ఆయన తన పని ఎంతో సుళువుగా నిశ్చయంగా జరిగిపోతుందని, జరగడానికి కావల్సిన ఆయుధం తన దగ్గిర వుందన్న నిబ్బరంతో వచ్చివుంటాడు. వ్యవహారం యిలా ఎదురు తిరుగుతుందని ఎదురు చూడని ఆయనకి ఈ సంఘటన క్రొత్త. ఏం అనాలో ఇంకెలా నన్ను వశపరచుకోవాలో ఇదంతా ఆయన ఆలోచించని విషయం.

“తమరిలా అంటారని ఎన్నడూ అనుకోలేదు... ఏదో యీమాత్రం సాయం చేస్తారని గంపెడాశతో వచ్చాను అంత దూరం నించి ... ఎంతో దీనంగా అన్నాడు, అంత గంభీరమైన మనిషి అలా జావకారిపోవడం చూస్తే ఈయన .... యింత డబ్బుండి కొడుకు తెచ్చే లక్ష ఒక ఏడాది ఆలస్యం అవుతుందని దానికోసం యెందుకింత ఆరాట పడిపోతున్నాడు. ఈ మనిషికి డబ్బుమీద ఇంత కాపీనమా అనిపించింది. ఆ మాట అడగకుండా ఉండలేకపోయాను.

“మీరు ఈ పరీక్షకోసం ఇంత ఆదుర్దాపడాల్సిన అవసరం నాకేం కనపడలేదు. లక్షాధికార్లు మీ అబ్బాయిని ఇంకో ఏడాది చదివించగలరు. అబ్బాయి పరీక్షలు ప్యాసయి ఆర్జించకపోతే రోజు గడవనివారు పడే ఆరాటం మీరెందుకు పడుతున్నారో నా కర్థం కావటంలేదు. ఏదో పూట గడవని వాళ్ళు వచ్చి తమ అబ్బాయి పరీక్ష కోసం ఆదుర్దాపడినా, నన్ను సహాయం కోరినా అర్థం వుంది. అలాంటి స్థితిలో నేను జాలిపడి ఏదో సహాయం చేసినా అర్థం వుంటుంది. మీ అబ్బాయి విషయంలో అలాంటి అవసరం నాకేం కనిపడడంలేదు. ఈసారి ఛాన్సుకి కష్టపడి చదివితే తప్పక ప్యాసవుతాడు. దానికోసం మీరు ఇంత ఆదుర్దాపడడం నన్ను ఇరకాటంలో పెట్టి నాకిష్టంలేనిపని చేయించడానికి ప్రయత్నించడం... ఎందుకింత అవస్థ చెప్పండి... పెద్దమనిషిగదా అని చెప్పదలచింది సౌమ్యంగానే చెప్పాను.

“అంతేనంటారా? నానాగడ్డి కరిచి మిగతా వాళ్ళచేత మార్కులు వేయించి మెడికల్ కాలేజీకి సీటు రిజర్వ్ చేయించింది అంతా వృధా నంటారా...” తనలో తాను గొణుక్కున్నాడు. నేను నవ్వాను.

“మెడికల్ కాలేజి సీటెక్కడికి పోతుందండి ఓ పదివేలు మీవి కావనుకుంటే ఎప్పుడుపడితే అప్పుడు మీ కోసం రెడీగా వుంటుంది.

ఆయన వుంగరాలు సవరించుకున్నాడు... తల గోక్కున్నాడు. ఇంకా ఏదో చెప్పాలని ఆరాటపడుతున్నాడు. ఎంతకీ వదిలేట్టులేడని నేను కూర్చీలోంచి లేచి కవరు తీశాను ఈయడానికి.

"అమ్మా, తవరెలాగో నిక్కచ్చిగా తవ అభిప్రాయం చెప్పేశారు.. ఏంచేస్తాను నా ప్రాప్తం ఇంతేననుకుంటాను.... పోనీ చిన్న సాయంచేసి పెట్టండి. వాడి పరీక్ష ప్యాసయాడో లేదో ఒక్కమారు పేపరుచూసి సెప్పేస్తె ఇక ఈ ఏడాదికి ఆ సీటు వద్దని రాసేస్తాను.... ఆల్లు మావాడి కోసం ఓ సీటు అట్టేపెట్టారు... ఏదో సంగతి ఆల్లకి రాయాలిగందా.... ఒక్కక్షణం పేపరు చూసి చెప్పేయండి సాలు...." ఆశగా ఆగారు.

ఒక్కక్షణం సందేహించాను. నా అభిప్రాయం ఖచ్చితంగా చెప్పాను. నేనే సాయం చేయనని ఆయనకీ అర్థం అయింది. ఆ ఒక్క మాట చెప్పేస్తే.... వెళ్ళిపోతాడు తొందరగా ఆయన్ని వదుల్చుకోడానికి అంతకంటే మార్గం కనపడడంలేదు.... సందేహిస్తూనే నంబరడిగాను.

"ఏమిటో మీరు ఎంత చెప్పినా నన్ను ఇరకాటంలో పెరుతున్నారు.." చిన్నగా విసుక్కుని డ్రాయరు తెరిచాను.

"క్షమించడమ్మా.... నిజమే తమకి శ్రమ యిస్తున్నాను ... మరేం అనుకోకండి...." అతి వినయంగా క్షమాపణ కోరాడు.

పేపర్లు బయటికి తీయకుండానే గబగబ ఆ నెంబరుకోసం వెతికాను ఆ కట్టల్లో. కావల్సిన నెంబరు కనిపించగానే మార్కులు మాత్రం చూశాను. పద్దెనిమిది మార్కులు, హు .... ప్యాసుమార్కుకి సగానికి సగం తక్కువ.

ఆ మాట చెప్పాను. ఆయన మొఖం నల్లబడింది. "పోయిందన్న మాట పరీక్ష! అనుకుంటూనే వున్నాను...." అన్నాడు.

"చూశారా. ఒకటికాదు. రెండుకాదు తక్కువ: నేనేకాదు ఎవరయినా యిలాంటి స్థితిలో ఏం సాయం చేయగలరు ? చెప్పండి" అన్నాను డ్రాయరు మూసేసి.

"ఆ.... తవరు తల్చుకుంటే యిదో లెక్కా తమకి దయలేదుగాని ఆ ప్రక్క ఒకటి నాలుగు క్రింద ఎంత సుళువుగా మారపోతుంది ... ఎటొచ్చి తవరు దయుంచాలి మాలాంటి వాళ్ళమీద !" అంటూనే మరో ప్రక్క జేబులోంచి ఇంకో

కవరుతీసి...! "హి.... హి.... మీ దయ, మా ప్రాప్తం ! నీట ముంచినా పాల ముంచినా మీదేభారం... మరివస్తా దయయుంచండి ..." కవరు టేబిలు మీద పెట్టి ... "వాడ్ని పాసు చేయించే భారం మీదే...." అని గబగబా వెళ్ళడానికి ఉద్యుక్తుడయ్యాడు.

తెల్ల బోయాను నేను ! ఇంత చెప్పినా ఇచ్చింది చాలక మరో ఇంత యిచ్చి ఎంత ధైర్యంగా వెళ్ళిపోతున్నాడు. డబ్బిచ్చి వెళ్ళిపోతే చచ్చినట్లు ఆ డబ్బు తీసుకున్నందుకు కృతజ్ఞతతో కాకపోయినా మరో దారిలేక ప్యాసు చేస్తానని ఆయన ఉద్దేశ్యం గాబోలు. కోపంకట్టలు తెంచుకుంది నాకు.

"ఆగండి" అన్నాను కఠినంగా. ఓ కవరు తీసి చూశాను. "ఐదు వందల రూపాయల నోట్లు". ఇది మార్కులు చూసి చెప్పడానికి లంచం. మరో కవరు తీశాను. మరో ఐదు వందలు. మార్కులు వేసేందుక లంచం. వెయ్యి రూపాయలు ఒక సబ్జక్టు ప్యాసు అయ్యేందుకు. ఇలా ఎన్నివేలు ఖర్చు పెడతాడో మొ త్తం పరీక్ష ప్యాసనుపించు కోడానికి.

"హు ... మీరు ఏదో పెద్దమనుషులుగదా అని ఇంతసేపటిని ఎంతో ఓపిగ్గా మాట్లాడాను, ఎంత చెప్పినా కూడా మీ యీ జబర్దస్తీ ఏమిటి ? యీ డబ్బు తీసుకుని వెంటనే వెళ్ళండి. లేకపోతే పర్యవసానం ఎలా వుంటుందో మీరే చూస్తారు యిప్పుడే" వ్రేలితో గుమ్మం వంక చూపిస్తూ కోపంగా అన్నాను.

ఆయన మొహం ఎర్రబడింది. నావంక తీక్షణంగా ఒకసారి చూసి, కవర్లు జేబులో పెట్టుకుని గబగబ వెళ్ళి కారులో ఎక్కి తలుపు దడాలున వేశాడు. కారు వెళ్ళిపోయింది. తేలిగ్గా నిట్టూర్చి వీధి తలుపులు వేసి వెనుదిరిగాను.

వెయ్యి రూపాయలు తక్కువ మొత్తం కాదు ! కావాలంటే ఇంకా యిస్తాడు. అంత సొమ్ము వదులుకునే మనస్థయిర్యం ఎంత మందికి వుంటుంది ? డబ్బు ప్రభావానికి లొంగేవాళ్ళున్నంత వరకు యీ చదువులు యిలాగే వుంటాయి.

ఓ మంచి పని చేశానన్న తృప్తితో గర్వంగా నన్ను నేను అభినందించుకున్నాను.

* * *

"నమస్కారం, గుర్తున్నానా మీకు" క్లాసు అయ్యాక స్టాఫ్ రూములోకి

వస్తూంటే వరండాలో ఓ పెద్దమనిషి నమస్కారంపెట్టి పలకరించాడు. ఆయన్ని ఎక్కడో చూసినట్లనిపించింది నాకు. కాని గుర్తు రాలేదు. సరిగ్గా జవాబు చెప్పలేక అలా చూస్తూ నిల్చున్నాను ఆలోచిస్తూ గుర్తు చేసుకుంటూ.

"మరిసి పోయుంటారు. ఓసారి తమ దర్శనం కోసం బెజవాడలో మీ యింటికి వచ్చాను..."

బెజవాడలో ! అంటే రెండేళ్ళ క్రిందట అన్నమాట! ఎప్పుడొచ్చాడో ఎందుకు వచ్చాడో సరిగా జ్ఞాపకం రాకపోయినా ఏదో ఆయన్ని చూసిన గుర్తుమాత్రం వుంది.

"మరిసిపోయారు తమరు. మావాడి పి. యు. సి. మార్కులకోసం మీ కాడకి వచ్చానుగందా, అప్పుడే మరిసారు తమరు ... అవునులెండి మాలాంటోళ్ళు ఎందరో వస్తుంటారు మీకాడికి ..." అదోలా నవ్వుతూ అన్నాడాయన.

చటుక్కున గుర్తువచ్చింది. అవును, రెండేళ్ళ క్రితం నేను బెజవాడలో వున్నప్పుడు కొడుక్కి మార్కులకోసంవచ్చి లంచం ఆశ చూపించి ప్యాసు చేయమన్న యీరపరెడ్డి.

"ఆ ... ఆ... అవునవును... గుర్తువచ్చారు... చాలా రోజులయింది వెంటనే గుర్తు పట్టలేకపోయాను. ఇక్కడికి ఏం పనిమీద వచ్చారు."

"మేవు హైదరాబాదులోనే వుంటున్నాం యిప్పుడు.... మా పిల్లని కాలేజిలో చేర్పించడానికి వచ్చాను పి. యు. సి. క్లాసు సదువుతుందామ్మాయి...."

"ఆహా ....!" అని ఇంకేం అనకుండా ముందుకు ఓ అగుడు వేశాను నమస్కారంపెట్టి వెళ్ళొస్తాననిచెప్పి. కాని అంతలోనే వాళ్ళ అబ్బాయి సంగతి గుర్తొచ్చి అడగాలన్న కుతుహలంతో వెనక్కి వచ్చాను.

"అన్నట్టు మీ అబ్బాయి ఏం చేస్తున్నాడు యిప్పుడు ఏం చదువుతున్నాడు ?" ఆయన అదోలా నవ్వాడు...." ఏదో తమ దయవల్ల మెడికల్ కాలేజిలో చదువు తున్నాడు".

"ఆహా, మొత్తంమీద అన్నట్టుగానే అబ్బాయిని మెడిసన్ చదివిస్తున్నా

రన్నమాట. తరువాత సెప్టెంబరు ఛాన్సులో ప్యాసయ్యాడా ? మార్కులు బాగా వచ్చాయా ఆసారి...'' కుతుహలంగా అడిగాను.

సెప్టెంబరు కాదండి. మొదటి ఛాన్సులోనే ప్యాసయిపోయాడు... వెంటనే మణిపాల్‌లో చేర్పించేశాను....'' అదోరకంగా అతనికళ్ళు మెరిసాయి.

తెల్లపోయాను. మొదటి ఛాన్సులో ఎలా ప్యాసయ్యాడు ? తక్కిన పేపర్ల సంగతి నాకు తెలియకపోయినా, నా దగ్గిరవున్న పేపరులో పద్దెనిమిది మార్కులు వచ్చిన ఆ అబ్బాయి ఎలా ప్యాసయ్యాడు. ఆశ్చర్యంతో చూశాను. బహుశా యూనివర్శిటి ఏ రిజిస్ట్రార్‌కో డబ్బు బాగా ముట్టచెప్పి చేయించారేమో! అయివుంటుంది ! ఈయన యింటికొచ్చి అడగబట్టి ఫలానా నెంబరుకి ఎన్ని మార్కులు వచ్చాయో నాకు గుర్తువుందికాని, లేకపోతే పేపర్లుదిద్ది పంపించాక ఎవరెవరు ప్యాసయ్యారో, ఫెయిలయ్యారో గుర్తు ఎవరికుంటుంది ! అక్కడ ఏం చేసినా మాకు తెలియదు గదా!

"ప్యాసయ్యాడా?.... మొదటి ఛాన్సులో ప్యాసయ్యాడూ? అదెలాగ? పద్దెనిమిది మార్కులు వచ్చిన మీ అబ్బాయి ఎలా ప్యాసయ్యాడండీ'' ఆశ్చర్యపోతూ ఆడిగి నట్టడిగాను.

"హి .... హి తమ దయుంటే ప్యాసుకావడానికి ఏముందండి.... తమరు అలా అన్నారు కాని ....మీ మనసెంత మంచిదో నాకు తెలీదా... వెకిలి నవ్వు నవ్వాడు.

దిమ్మెరపోయాను. నా దయుంటే ప్యాసవడం ఏముందంటాడు ఏమిటి .... నేనేం దయచూపలేదు, నా చేత్తో ఇంకో అరమార్కుకూడా ఆ పేపరుమీద వేయలేదు. నా మనసు చాలా మంచిదంటాడేమిటి ! అంతా గందరగోళం అనిపించింది.

"మీరేం అంటున్నారో నాకర్థం కావడంలేదు. నేనేం మీ అబ్బాయికి మార్కులు వేయలేదే?.... నేను దయచూపడం ఏమిటో నాకర్థంకావడంలేదు !''

"పోనీడమ్మగారూ ... అయిపోయిందానికి యిప్పుడెందుకు .... ఏదో తమరు కాస్తంత జాలిగా ఆలోచించారు... వాడి పరీక్ష ప్యాసయింది... అంతేసాలు నాకు.

మళ్ళీ అదే మాట !''




“రెడ్డిగారూ! మీరు ఏం అంటున్నారో నాకు అసలు తెలియడంలేదు నాకు. తెలిసి తెలిసి ఇలాంటి పని నేనెప్పుడూ చేయలేదు. మరి ఇదెలా సాధ్యం అయింది .... దయచేసి తిన్నగా చెప్పండి ! ... నాకిలాంటిమాట రావటం ఇష్టంలేదు. ఇదెలా జరిగిందో చెప్పండి... మీరెవరికో యూనివర్సిటిలో డబ్బిచ్చి ప్యాసు చేయించి వుంటారు. నేను చేశానంటారేమిటి ? కాస్త తీక్షణంగా అడిగాను.

“అబ్బే రామ రామ.... తమరి సేత్తో తవరేసిన మార్కులే.... మరి నేనెవరికాడికి ఎల్లలేదండి.... అందుకే తవరిది జాలిగుండె అన్నాను....''అని అతి వినయంగా అన్నాడు.

ఒక్కొక్క మాట వింటూంటే ఈ పజిల్ మరింత చక్కగా తయారవుతుంది. బలే గడుసువాడు? మాట తిన్నగా చెప్పకుండా నేనే దయ చూపించానంటాడు... నా తల వేడెక్కింది. దాంతోపాటు కోపంకూడా వచ్చింది.

“ఇది చాలా బాగుంది రెడ్డిగారూ... నా చేత్తో నేను ఒక మార్కు వేయలేదు మీ అబ్బాయి పేపరుమీద మరి ఇదంతా ఎలా జరిగిందో మీకే తెలియాలి.... అవునులెండి మీ దగ్గరున్న డబ్బుతో మీరు సాధించలేనిది ఏమి వుండదు.... కానీ అనవసరంగా యిలాంటి వాటిలో యిరికించి నాపేరుకి అప్రతిష్ట తేకండి యిలాంటివి నాకిష్టంలేదు'' కఠినంగా అన్నాను.

ఆయన అదోలా నవ్వాడు....“అలా అనేస్తే నేనేం సెప్పగలనమ్మగారూ. నా మాటమీద మీకు నమ్మకం లేకపోతే నేనేం సెయ్యగలను పోనీలెండి గాని.... నేను మూడో క్లాసులోనో నాలుగో క్లాసులోనో ఓపాఠం సదూకున్నాను అదెవరో బెంగాలీ ఆయన విద్యాసాగరో మరెవరో ఓరింటికి విందు భోజనానికి ఎల్లాడట... మామూలు బట్టలేసుకుని .. ఆడి బట్టలు చూచి ఎవరూ లోపలికి రానీలేదంట. అపాళాన యింటికెళ్ళి మంచి బట్టలేసుకుని గుర్రబ్బగ్గీలో రాగానే అందరూ ఎదురెళ్ళి ఆహ్వానించారట ..అప్పుడనుకున్నాడంట ఆయన ఈ గౌరవం డబ్బుకిగాని, మనిషికా అని...''

ఆయన మాట్లాడేది ఏమిటో అర్థంకాక ఈ అసందర్భపు మాటలేమిటని

విసుగు వచ్చింది నాకు. "యిదంతా మీరెందుకు చెపుతున్నారు? నేనన్నదానికి దీనికి, సంబంధం ఏమిటి?''

రెడ్డిగారు వ్యంగ్యంగా నవ్వాడు. "ఆ.... ఆ అదే, యిన్నాళ్ళు నేనూ డబ్బుకే యిలువ. వేసానికే విలువ అందరూ యిస్తారని ఆయనలాగే అనుకున్నాను... కానీ... మీకాడికి వచ్చేసరికి అదంతా తప్పయిపోయింది. నా కారు, నా లచ్చలు, నా వుంగరాలు నా వందలు, నా ద్రాక్ష పళ్ళు ఏవీ సేయలేని పని అరడజను బత్తాయి పళ్ళు ... జంధ్యంపోగు, నీరు కావి అంగొస్త్రం చేసేసింది. మరి అక్కడనించి యీ క్రొత్తపాఠం నేర్చుకున్నాను... వస్తానమ్మా చాలాసేవు నిలబెట్టేశాను మిమ్మల్ని... మా అమ్మాయిని కూడా ఓ కంట కనిపెట్టి సూడండి.

తెల్లపోయి చూస్తున్ననాకు ఓ నమస్కారం పెట్టి నవ్వుకొంటూ వెళ్ళిపోయాడు యీరపరెడ్డి.

స్టాఫ్ రూములోకి ఎలా వచ్చి కూర్చున్నానో నాకే తెలియదు. అరడజను బత్తాయిపళ్ళు. నీరుకాని అంగోస్త్రం, జంధ్యంపోగు ... నా బుర్రలో గిర గిర తిరిగాయి. రెండేళ్ళ క్రితం జరిగినది గుర్తు తెచ్చుకోడానికి ఎక్కువ ప్రయత్నం అవసరం లేకపోయింది. గుర్తురాగానే ఆవేశంతో ఆగ్రహంతో వణికిపోయాను. ఎంత మోసం ఎలాంటి పన్నాగం.

ఎముకల గూడులా వున్న సద్రాహ్మణుడు, మూడు మూరల అంగోస్త్రంతో, జంధ్యం పోగులతో, విభూతి పట్లతోవున్న ఆయవారపు బ్రాహ్మణుడు గుర్తుకి వచ్చాడు.

ఆయన జాలికథ విని కరిగిపోయాను. తిండి లేదన్నాడు. భార్య రోగిష్టిదన్నాడు. ఐదుగురు ఆడపిల్లలు గుండెలమీద కూర్చున్నారన్నాడు. ఏకైక పుత్రరత్నం ఈ పరీక్ష ప్యాసవుతాడని గంపెడాశ పెట్టుకున్నాడు. ఆ పరీక్ష ప్యాసయితే ఏదో ఆఫీసులో ఎవరో ఆఫీసరు కాళ్ళుపట్టుకుని ఉద్యోగం స్థిరపరుస్తాడట, ఆ ఉద్యోగంకి యీ పరీక్ష ప్యాసవాలట ఆ ఆఫీసరు ఉద్యోగం యిస్తానని మాటిచ్చాడట, పరీక్ష ప్యాసయితే చాలట. అబ్బాయి ఎంతో కష్టపడి చదువుకున్నాడు. ఈ పరీక్షకి ముందు జ్వరంవచ్చి




యీ ఒక్క పేపరే కాస్త పాడుచేసానన్నాడట కొడుకు. నేను దయచూపకపోతే తిండిలేక మలమల మాడిపోతాం అని కన్నీరు కార్చాడు. నేను యీ సాయం చేయకపోతే అందరం కలిసి యీ కృష్ణలో కట్టకట్టుకుని చావటం మినహా మరోదారి లేదని దీనాతిదీనంగా ప్రార్థించాడు. జబ్బుతో తీసుకుంటున్న ఆ తల్లీ యీ కొడుకు చేయబోయే ఉద్యోగం కోసమే ప్రాణాలు నిలుపుకుందని జాలిగా చెప్పాడు. కుచేలుడు ఆనాడు కృష్ణ పరమాత్మకి అటుకులు తెచ్చి యిచ్చినట్టు అరడజను బత్తాయి పళ్ళు మినహా ఏమీ ఇవ్వలేని పేదవాడినని పాదాల దగ్గిర పెట్టాడు. నా వల్ల కాదన్నా యిలాంటి పని చేయలేనన్నా... నా కాలుని పట్టేసుకున్నాడు,. మీరు కాదంటే మరి గత్యంతరం లేదంటూ వలవల ఏడ్చాడు. నన్ను యిబ్బందిలో పెట్టి యిరకాటంలో పడేసి సానుభూతి సంపాయించి జాలితో కరిగేటట్టు కన్నీటి కథ చెప్పి నేను మాటిచ్చేవరకు అభయం ఇచ్చేవరకు కాళ్ళు వదలని ఆ బ్రాహ్మడు గుర్తొచ్చాడు... ఎంత దగా ... ఎంత మోసం యీ రెడ్డి ఎంత నాటకం ఆడాడు. ఐదో పదో బ్రాహ్మడి చేతిలో పెట్టి తన అవసరానికి ఎంత చక్కగా వినియోగించుకున్నాడు. నేనన్నమాట ఆధారంతో ఎంత పన్నాగం పన్ని నా కళ్ళు కప్పాడు.

నన్నెంతలో బోల్తాకొట్టించాడు. అయినా నేనెలా మోసపోయాను. ఆ రెడ్డి కొడుకు నెంబరు... యీ బ్రాహ్మడు చెప్పిన నెంబరూ ఒకటేనన్న గుర్తులేనంత మందమతి నెలా అయ్యాను? పేపరు చూచి మార్కులు వేసేటప్పుడయినా పోలిక పట్టలేనంతగా నా బుర్ర ఎలా మొద్దుబారిపోయింది? అంతలా నా కళ్ళు ఎలా మూసుకుపోయాయో!!

హు ... యీ పద్దెనిమిది మార్కులు అబ్బాయి రేపొద్దున డాక్టరయి ప్రజాసేవ చెయడానికి రానుంటే ఆపాలన్నా ఆపడం నా తరమా ? .... యిలాంటి దేశోద్ధారకులు దేశానుద్ధరించడానికి రానుంటే నాలాంటి వాళ్ళ కళ్ళు మూసుకుపోయే ఉండాలి. నా చేతిలో ఏం వుంది? ఇలాంటివి ఆపడానికి?... నేను నిమిత్త మాత్రురాలిని అంతే! చాతకాని నవ్వు ఒకటి నవ్వుకుని క్లాసుకు బయలుదేరాను.



# స్థితప్రజ్ఞుడు

దశరథ రామయ్య అంటే రాముడు తండ్రి దశరథుడు అంత గొప్ప పేరున్న వాడు కాకపోయినా, ఆ ఊరిలో మకుటంలేని మహారాజులాగే వెలిగిపోతున్నాడు ఎమ్మెల్లే పదవిలో. దశరథరామయ్య అంటే ఏ అరవయ్యో డెబ్భై ఏళ్ళు ఉంటాయి అనుకునేరు. పట్టుమని నలభై ఐదో ఆరో ఉంటాయి. అరడుగుల పొడుగు. తండ్రి పోలిక, తల్లిరంగు వచ్చిన అందగాడు. పైగా నూరెకరాల ఆసామి, నల్లటి మీసకట్టు గంభీరమైన చూపులతో చూసే ఆయన్ని చూసిన వారందరు అడక్కుండానే ఆ ఊరికి మహారాజు పట్టం కట్టేసారు. బీకామ్ పాసవగానే, తండ్రినీ బి.కామ్ చదువుకు వచ్చే ఉద్యోగాలు ఏమిటి జీతాలెంత, పొలాలు చూసుకో, రైస్‌మిల్లు పెద్దదిచేసుకో, మొన్న కొత్తగా పెట్టిన ఆయిల్ మిల్లు చాలడంలేదు. ఇంకొటిపెట్టు, పొలంలో పప్పులు పంటలు మొదలెట్టు, ఏదో ఇంగ్లీష్ చదువుండాలి దడ దడ మాట్లాడగలవు అని ఇంగ్లీష్ చదువులు చెప్పించాను బోలెడు డబ్బెట్టి. నేను డబ్బు దాచి దాచి లక్షలు అప్పచెపుతున్నాను. నా మనవడికి ఆ లక్షలు కోట్లు చేసి ఇవ్వాలి నీవు మర్చిపోకు అని తండ్రి కొడుకుని కూర్చోపెట్టి డబ్బు ఎలాచెయ్యలో బోధించి లక్షలు, పొలాలు, మిల్లులు అన్ని అప్పగించి వంశోద్ధారకుడిని కనడానికి ఓ అయినింటి పిల్లని పెళ్లిచేసి రంభ ఉర్వశీ కాకపోయిన బాగానేవుంది, ఏదో ఇంటరు వరకు చదువుకుంది బుద్ధిగా అమ్మ నాన్న మాటలకి తలాడించి పెళ్ళిచేసుకున్నాడు. ఇరవై నాలుగోఏట దశరథరామయ్య పట్నం బీకామ్ చదవడానికి వెళ్ళినపుడే దశరథరామయ్య పేరు మోటుగా ఉందని కాలేజీలో ఎంటర్ అవగానే దశరథ్‌రామ్ అని మార్చేసుకున్నాడు. పేరు మార్చుకున్న వేళావిశేషమో, పెళ్ళాంవచ్చిన వేళా విశేషమోగాని, లక్షలు అనతికాలంలోనే కోట్లుగా మారింది. రెండేళ్లలోగానే వంశోద్ధారకుడిని కనగలిగి తల్లితండ్రుల్ని సంతోషపెట్టాడు. మనవడిముద్దు ముచ్చట్ల వరకే చూసారుగాని,

ఎంత ఘనకార్యాలు చేస్తాడో అని మురిసిన తాత మామ్మ అవేమి చూడకుండానే ఒకరివెనకఒకరు రెండేళ్లలో దాటిపోయారు.

తాతగారు తన ఆశలు కలలు అన్ని నీళ్లు వదిలేసుకొని, బాధ దిగమింగుకుని బతకాల్సిన అవసరం లేకుండా దాటిపోవడం మంచిదయిందని, అందరు అనుకునే విధంగా, మనవడు తయారయ్యాడు, ఏళ్ళు వస్తున్న కొద్దీ. పదేళ్లవయసు వరకు, చిన్నవాడు ముద్దులెక్కువయి, ఒక్కడయిపోయి, పెంకి, మొండిగా తయారయ్యాడు, ఎదో కాస్త జ్ఞానం వస్తే వాడికే బుద్ధి తెలిసి మారతాడు, అల్లరి తగ్గుతుంది అనుకున్నారు అంతా .

నేనేం మారాల్సిన అవసరం ఏముంది మా నాన్న బోలెడుసంపాయించాడు ఇంకా సంపాయిస్తున్నాడు. ఈపూరికి మకుటంలేని మహారాజు పైగా ఎమ్మెల్యే ఆయనమాటకి ఎదురులేదు, నేను మానాన్నకి ఒక్కగానొక్క కొడుకుని, యువరాజుని, బియ్యేలు ఎమ్మెలు చదవాల్సిన అవసరం ఏముంది. ఈ పొలాలకు, ఇళ్ళకి, తోటలకి, రైస్ మిల్లులకు, ఆయిల్ మిల్లులకు మానాన్న కొనిపడేసిన స్థలాలకి ఏకైక వారసుడిని అన్న విషయం పట్టుమని పదహారేళ్లకె అర్థమైపోయింది అతనికి. చదువులో రాణించక పోయినా ఇటువంటి ప్రపంచ జ్ఞానం బాగానే అర్థమైపోయింది. లెక్కల్లో ఏనాడు పాస్ మార్కులు రాకపోయినా డబ్బులు ఆస్తులు లెక్కెట్టు కోడంలోదిట్ట. కొడుకు మొదటిసారి మెట్రిక్ ఫెయిల్ అయ్యాక రెండోసారి ముందే జాగ్రత్తపడి వీళ్ళని వాళ్ళని పట్టుకుని పలుకుబడి డబ్బుతో గట్టెక్కించాడు తండ్రి. పట్నంలో కాపురం పెట్టి ఇంగ్లీష్ మీడియం చదివించడంతో గటగటా ఇంగ్లీష్ మాట్లాడే కొడుకునిచూసి మురిసి పోయాడుగాని, చదువులో చవట అని మెట్రిక్ ఫెయిల్ అయ్యేవరకు గ్రహించలేక పోయాడు ఆయన. ఏదో బియ్యే వరకు గట్టెక్కిస్తే చాలు వున్న ఆస్తులు కాపాడు కుంటూ, ఏదో తనవారసత్వం ఎమ్మెల్యే పదవి అందిపుచ్చుకుంటే చాలు.

ఓ డిగ్రీ చేతిలో ఉంటే సంఘంలో గౌరవం ఉంటుంది, చదువుకున్నవాడు అనిపించుకోవచ్చు, వచ్చినమార్కులకి ఏకాలేజీలోను సీటు రాదని తెల్సిన ఆయన, ఓ మంచిపేరున్న కాలేజీకి దండిగా డొనేషన్ ఇచ్చి, నెమ్మదిగా బి.ఏ వరకు లాగించాడు కొడుక్కిలేకపోయిన, తనతెలివితేటలతో.

కాలేజీలో చేరినతరువాత ఆ నాలుగు ఐదేళ్ల కొడుకు ఎంత పొగరు, తెగింపు, ఎంత అహభావంతో, అందరి విద్యార్థులకి నాయకుడిలా తయారయి, డాబు దర్పం తండ్రి హోదా డబ్బు చూపి లోబరుచుకుని ఆథారిటీతో పనులు చేయించు కుంటున్నాడో, ఆడపిల్లలని ఏడిపించి కొందరితో ప్రేమకబుర్లుచెప్పి ఎలా లొంగదీసు కున్నాడో, భయంతో కొందరు గతిలేనివారు డబ్బుకీ లొంగి కొందరు, ఇలా ఎంత మందితో ఆడుకున్నాడో ఆ తండ్రి తెలుసుకునేనాటికి కాలాతీతమయింది. కారులో ఎదురుచెప్పని స్నేహితుల్ని వెంటేసుకుని సినిమాలు, షికారులు, హోటల్స్, రూల్స్ మాకేమిటి అంటూ, స్పీడ్‌గా కారు తోలుతూ అర్ధరాత్రి తిరుగుతూ పట్టుకుంటే, తండ్రి హోదాచాటున అథారిటీ చూపించి తప్పించుకుంటూ, తాగుతూ, పార్టీలు ఇస్తూ, విచ్చలవిడిగా డబ్బులు వెదజల్లుతూ, ఒకటేమిటి మనిషి ఎంత దిగజార్చవచ్చో జారి, కాలేజీలో చదువుతప్ప తక్కినవన్నీ చేసాడు. ఒకసారి ఏదో పార్టీ పబ్‌లోమాదకద్రవ్యాలు సేవిస్తూ పట్టుబడి కొత్తగా వచ్చిన స్ట్రిక్ట్ పోలీస్ ఆఫీసర్ అందరిని లాక్కెల్లి సెల్‌లో పడేసి చితకబాది కోర్టులో సోమవారం హాజరు పెడతామని, చాల కచ్చితంగా ఎవరు తండ్రులహోదాలు చెప్పిన వినకుండా ఫోను లాక్కుని సెల్లో పడేసివెళ్లిపోయాడు. దాంతో దయ్యం దిగివచ్చి ఏంచెయ్యాలి అని ఆలోచనతో సతమతమైపోతూ గడిపేడు పుత్రరత్నం.

ఎలక్షన్స్ దగ్గరపెడుతుండడంతో బిజీ గావున్న తండ్రి, కొడుకు ముచ్చట్లని పట్టించుకోకుండా వదిలేసాడు. తీరిక లేక వేళాపాళా లేకుండా తిరిగే కొడుకుని మందలిస్తూ ఆలస్యం అయినదని కేకలువేస్తూ ఇంటికిరాని రోజున కోపగిస్తూ కొడుకుని ఏవిధంగానూ కంట్రోల్ చేయలేని తల్లి, కోపంగాకాక మంచిగా చెపుతూ, బుజ్జగిస్తూ మార్చాలని ప్రయతిస్తూవుండేది. ఆరోజు రాత్రి ఇంటికి రాని కొడుకు అలవాటుగా ఏ స్నేహితుడితోనే ఉండిపోయాడని సరిపెట్టుకుంది. మర్నాడు రోజంతారాని కొడుకు గురించి ఆరాటపడి అందరికి ఫోన్లుచేసి ఎక్కడలేడని విని భయపడింది. పనిమీద రెండురోజులుగా ఢిల్లీ వెళ్లిన భర్తకి ఫోన్ చేసింది. అయన మీటింగ్‌లోవుండి పట్టించుకోకుండా 'వస్తాడు స్నేహితులతో ఎటో పోయుంటాడు, నేను ఊర్లోలేనని తెలిసి ఏ రిసార్ట్‌లో ఎంజాయ్ చేస్తున్నాడో వస్తాడు లే "అనేశాడు.



అన్న గంటలోనే "టీవీలో పబ్‌లో పట్టుబడ్డ స్టూడెంట్స్‌లో మీ అబ్బాయికూడా కనిపించాడు అన్న వార్త గాభరాగా ఎవరో స్నేహితురాలు చెప్పగానే ఆవిడ గాభరాతో భర్తకి ఫోన్ చేసింది. అప్పటికే పనిముగించుకుని బయలుదేరపోతున్న అయన మొహం పాలిపోయింది ఆ వార్త వినగానే. ఫ్లైట్ దిగకముందే తన మనుషులద్వారా సంగతంతా వివిధ వర్గాలనించి తెలుసుకున్నాడు. ఆ పోలీస్ సూపరింటెండెంట్ అతి రూల్స్ మనిషి దేనికి లోంగే రకం కాదని తెలుసుకున్నాడు. డీలాపడ్డాడు. ఇంటికిరాగానే తలపట్టుకు కూర్చున్న భర్తనిచూసి భయపడిపోయింది. ఎప్పుడు ఏది కావాలన్న నిమిషాలలో జరిగిపోడమే తెల్సిన, అవిడ భర్తని ఏం అడగడానికి భయపడిపోయింది. ఆఖరికి ఆయనే తలెత్తి 'నాన్న అదృష్టవంతులు త్వరగా దాటిపోయారు లేకపోతె మనవడిని చూసి వాడు ఎలాతయారయ్యాడో చూసి గుండె ఆగిపోయేది. నిశ్చింతగా మనవడి ముద్దుముచ్చట్లు చూసి దాటిపోయారు. వున్న ఒక్కడు ఇలా తయారవడానికి కారణం మనమే. ఒక్కడే అని, అడిగిందల్లాఇచ్చి వాడు ఆడిందాటగా పెంచాం, ఉద్ధరిస్తాడు పెద్దయి, ఏదో చిన్నతనం అనుకుని చూసీచూడనట్టు వదిలేశాం, తోటకూరనాడే సరిదిద్దకపోవడం మన తప్పు. వెధవని జైల్లోపడుండని కొన్నాళ్ళు బుద్ధివస్తుందేమో'' ఎగిరాడాయన. "అయ్యో చిన్నవాడు ఏదో చెడు స్నేహాలతో సరదాలతో తిరుగుతూ చిన్న తప్పుచేస్తే వదిలేస్తే ఎలాగండి'' అని గోలపెట్టింది వరలక్ష్మి. "ఎవరి కాళ్ళు పట్టుకోమంటావు, ఆ పోలీస్ ఆఫీసర్ నిజాయితీగా భయపడక డ్యూటీ చేసేరకంట. డబ్బుకి లొంగేరకం కాదట. కేసు ఫైల్ అయింది, రేపు కోర్టులో జడ్జి ముందు బెయిల్‌కి ప్రయతించాలి అంతే మరోదారిలేదు. నా పరువు ప్రతిష్ట మర్చిపోయి జడ్జి ముందు తప్పయిందని ఇంకోసారి ఇలాజరగకుండా పిల్లాడిని అదుపులో పెట్టుకుంటాం అని తప్పు ఒప్పుకుని ఫైన్ కట్టి తీసుకురావాలి "అని విసుగ్గా విసురుగా భార్య ముందు ఎగిరాడాయన

అన్నట్టే తల్లితండ్రుల విన్నపాలు విన్న జడ్జి పెద్ద లెక్చర్ ఇచ్చి తన పవరేమిటో చూపిస్తూ దుమ్ముదులిపి వదిలాడు. ఇదిమొదటిసారా, పాపం సరదాగా వెళ్ళారా, మీ పిల్లలని అమాట చెప్పమనండి. ఇది మొదటిసారి జైల్లో కూర్చేడం, ఇది ఐదోసారి

పట్టుబడడం పోనీ అని గట్టి వార్నింగ్ ఇచ్చి వదిలేసారట మొదటిసారి ఇంకోసారి మీలాటి పవర్ వున్నవాళ్లు ఏదేతెలియక చేసారు ఇకముందు జరగకుండా చూస్తాం అని భరోసా ఇచ్చిపోయారట, మరోసారి మినిష్టర్ సిఫార్సు, మరోసారి ఫైన్‌కట్టి విడిపించుకుపోయారు, ఈసారి వాళ్ళ పప్పులు ఉడకలేదు. ఏళ్ళని మించిన ఘటికుడు ఎవరి సిఫార్సులు లెక్కచేయని పోలీస్ ఆఫీసర్ వచ్చాడు రంగంలోకి. ఇవిగో ఫైల్స్ చదువుకోండి. పిల్లలని కని, మంచి బుద్దులు నేర్పకుండా, డబ్బుందని వూరిమీద వదిలేస్తే వీళ్లు రౌడీలలా పెద్ద ఫోజులు కొడుతూ, కార్లలో తిరుగుతూ, అమ్మాయిలని బతకనీయకుండా పోకిరి వేషాలు వేస్తుతిరుగుంటే, చూస్తు వూరుకోవాలా. చట్టం ఒకటుందని గుర్తులేకపోతే, చూపిస్తాం జైలు జీవితం ఎలా ఉంటుందో, అంటూ తల్లితండ్రులకి ఏమి మాట్లాడడానికి అవకాశం ఇవ్వకుండా, పదివేల జరిమానా, వారం జైలుశిక్ష వేసేశాడు జడ్జి. ఇంకో అపుడు ఏ సిఫార్సులతో భయపడో మెత్తపడో వదిలేసేవాడేమోకాని, ఈ పోలీస్ ఆఫీసర్ దన్నుతో చెలరేగిపోయాడు. తల దించుకుని చేతులకి బేడీలతో వెడుతున్న పుత్రరత్నాలని చూడలేక వాళ్ళు తలలు దించుకుని బయటికి నడిచారు.

***

ఇంటికివస్తూనే కోపం ఎవరిమీద చూపలేక భార్య మీద ఎగిరాడు. 'ఒక్కడే కదండీ చిన్న వెధవ .. అంటూ నెత్తికెక్కించుకుని అడిగినంత డబ్బు నాకు తెలియకుండా ఇస్తూ, కార్లలో షికారులు తిరుగుతున్నా, కాలేజీకి డుమ్మాలు కొడుతూ ఫ్రెండ్స్‌తో తిరుగుతున్న నాకు తెలియకుండా కప్పెట్టి వెనకేసుకు వచ్చావు ఇన్నాళ్లు, అనుభవించి ఏడు. వీడివల్ల ఆ జడ్జి తల్లితండ్రుల్ని తిడుతుంటే తలదించుకోవలసివచ్చింది. 'బాధ కోపం ఉక్రోషంతో అరిచాడు. వరలక్ష్మి నోరెత్తకుండా కన్నీళ్లు పెట్టుకుంది. 'మంచిదే ఉండని జైల్లో ఆ భయమన్న ఉంటే కాస్త తగ్గుతారు వెధవలు' మరోసారి అరిచాడు.

భార్య దగ్గర అర్చినా, కొడుకాయ, తన రక్తం. అల్లారు ముద్దుగా పెంచుకున్న ఒక్కగానొక్కబిడ్డ ఆరాత్రి అంతా నిద్రపట్టక దొర్లాడు. ఏ మంత్రినో ముఖ్యమంత్రితోనో చెప్పిస్తే పనిజరుగునేమో ముఖ్యమంత్రితో అంత సయోధ్య



లేదు ముందునించి, తన కాండిడేట్ కాక, ఊరివాళ్ళ బలవంతం వల్ల గెలిచే పోటెంట్షల్ ఉన్నవాడిని కాదని అగ్రెసెస్ట్‌గా వెళ్లడం మంచిదికాదని తగ్గాడు, కానీ తనంటే ముందునించి దూరం పెట్టిన ముఖ్యమంత్రికి, తనకొడుకు ఇలాటివాడని చెప్పుకోడం చిన్నతనం అనిపించి, ముఖ్యమంత్రిని కాదని, మిగతా మంత్రులు మాత్రం సాయం చేస్తారా. అసలు ఎమ్మెల్యే కోటానించి డబ్బుదాచుకోకుండా ఏదో మంచిపనులు చేయిస్తూ మంచిపేరు తెచ్చు కుంటున్నాడని తన పలుకుబడి నచ్చక ముభావంగా ఉంటాడు. అలాటివాడిని అడిగి లేదనిపించుకోడం ఎందుకు అని ఊరుకున్నాడు.

***

"ఏమండి ఆలా వదిలేసి ఊరుకోవలసిందేనా, ఆ తిండి ఎలా తింటాడండి కాస్త భోజనం పంపడానికి అవుతుందేమో అడిగిచూడండి'' భయపడుతూనే ... "ఆ నీ కొడుకు పెద్ద కలక్టరని భోజనాలు తీసికెళ్లనిస్తారు వెటకారంగా అన్నాడు''.

"ఏదో ఆ డిగ్రీ కాస్త అయితే ఏ అయినింటి పిల్లనో పెళ్ళిచేద్దామండి కాస్త ఇంటిపట్టున వుండి ఏదో వ్యాపారాలు చూసుకుంటూ బుద్ధిగా ఉంటాడేమో కుర్రవేషాలు కట్టిపెట్టి,'' ఆశగా అంది తల్లి ప్రాణం కొట్టుకుంటుండగా.

"చాల్లే మాట్లాడకు పెళ్లిచేసి ఇంకోర్తి కూడా మనతో కలిసి ఏడవాలా" కోపంగా అరిచారు.

మీరు మరీను. ఏదో చిన్నపుడు అల్లరి చిల్లరిగా తిరిగాడని అలా వదిలేస్తామా. ఇంటి బాధ్యత, సంసారం భాధ్యతలు వస్తే వాడే మారతాడు"అంది ఆవిడా గట్టిగానే.

"ముందు నీకొడుకు బియ్యే అనిపించుకుంటే పిల్లనిచ్చేవాళ్ళు మనకున్న ఆస్తిపాస్తులన్నా చూసి పిల్లనిస్తారు "అన్నడాయన.

***

వారంరోజుల తర్వాత టాక్సీలో ఇంటికొచ్చిన కొడుకుని చూసి వరలక్ష్మి కలవర పడిపోయింది. ఆదిత్య ఎవరి మొహం చూడకుండా గదిలోకెళ్ళి తలుపులు మూసుకున్నాడు. నాలుగురోజులయాక తండ్రి దశరథ్ కొడుకుని పిలిచి 'ఇదిగో

కారుతాళం మరో మూడునెలలు పరీక్షలు అయేంతవరకు మాత్రమే వాడుకుని నాకు తిరిగి ఇవ్వాలి, కాలేజిదూరం అని, చదువు డిస్టర్బ్ అవకూడదని ఇస్తున్నాను. ఇదేదో నీకు భయపడో, చదువుమానేస్తావనో ఇవ్వడంలేదు.

చదువుమానేస్తే నష్టపోయేది నీవే. ఏదో తాత తండ్రులు సంపాదనవుంది నా కెందుకీ బియ్యే డిగ్రీ అనుకుంటున్నావేమో. ఇదికూడా లేకపోతే సమాజంలో నీకు వీధినపోయే ముష్టివాడుకూడా గౌరవం ఇవ్వడు. వున్నవి తిని తిరిగి తగలేయడం మొదలెడితే చిప్పచేతికి రావడానికి ఎన్నెళ్లో పట్టదు. తాతగారిచ్చింది కాపాడుకుని దాన్ని పదింతలు అభివృద్ధి చేశాను కనకే నాకు అందరూ గౌరవం ఇచ్చారు. పేరు సంపాదించుకున్న దాంతో పదవులు అడక్కపోయినా కట్టపెట్టి ఊరికి పెద్ద దిక్కుగా, హెూదా ఇచ్చారు అనితెలుసుకో. నిన్ను ఒక్కగానొక్క కొడుకువి పెద్దచదువులు చదివించాలని కలలు కన్నా. విదేశాలు పంపి చదివించి పెద్దహెూదాలో నిన్నుచూసి గర్వపడాలి అనుకున్నా కానీ నీవు మెట్రిక్, ఇంటరులో తప్పగానే నీ కెపాసిటీ తెల్సిపోయి చదువుపట్ల నీకు ఆసక్తి, కష్టపడి సాధించాలనే తపన నీలో లేదని అర్థమైపోయి, ఆశ వదిలేశా. కనీసం వున్నది అభివృద్ధి చేసుకోవాలనే దృష్టి, ఆలోచన, వ్యాపార మెళకువులు తెలుసుకోవాలనే ఆరాటం ఏది నీలో కనపడలేదు. పెద్దలు సంపాదించి ఇచ్చింది తింటూ, అల్లరి మూకని వెంటేసుకు కారుల్లో తిరుగుతూ పెద్ద హీరోలాగా జల్సా చేయడం కాదు జీవితం అంటే. చదువులో లేకపోయినా కనీసం ప్రవర్తనంలో మాట మర్యాద మంచితనమన్న ఉంట ... అందరికి చదువు అబ్బదు. జీవితంలో పైకి వస్తే చాలు ఏదో నా తర్వాత వ్యాపారాలు, ఎమ్మెల్లే పదవి అందుకుంటే చాలనుకున్న. ఆ ఆశ పోయిందిప్పుడు. ఇప్పటికే కాలేజీలో ఎన్నో కంప్లెయింట్స్, రూల్స్ పాటించకుండా నీ స్పీడ్ డ్రైవింగులు, డ్రింక్ చేసి అర్ధరాత్రి లాగి తందనాలు, అమ్మాయిల పట్ల మీరుచేసే వెకిలి వేషాలు ఇవన్నీ నాకు తెలియదనుకుంటున్నావా. ఇకముందు ఏ పోలీస్ కంప్లెంట్ అన్న వస్తే నేనున్నా అనుకోకు. దేనిలోనూ నే కలగచేస్కోను. నేను చెప్పాల్సింది చెప్పా, తరువాత నీఇష్టం ఆలోచించుకో. 'ఆ ఇంకో విషయం నీకు పెట్రోలు పోయిస్తా నీ రోజువారీ ఖర్చుకి కావలసింది మీ అమ్మని కాదు నన్ను అడగాలి అని గుర్తుంచుకో' అయన చాల



సీరియస్‌గా చెప్పదలచింది చెప్పి గదిలోంచి వెళ్లిపోయారు. తండ్రిని అంత కోపంగా ఏనాడు చూడని, కొడుకు మనసులో బెదిరి మవునంగా తాళాలు తీసుకు వెళ్లిపోయాడు.

కాస్త జాగ్రత్తగా పరీక్షలు అయేవరకు వుండి, అదేదో గట్టిక్కిస్తే, తండ్రి కోపం తగ్గుతుందని అనుకున్నాడు. కాస్త ఫ్రెండ్స్ పార్టీలు డ్రింకులు కారులో సరదాలు అన్ని తగ్గించి పరీక్షలు పూర్తయ్యాయనిపించాడు.

"పాపం భయపడిపోయాడండి చిన్న విధవ ఎదో సరదాలుంటాయి కుర్రాళ్ళకి'' ఒకరోజు నచ్చచెప్పే ధోరణిలో ఏదోచెప్పబోతుంటే అయన హుంకరిచినట్టే. మాట్లాడకు అసలు నీవల్లే ఇదంతా అంటూ హుంకరించాడు ఆయన.

ఏదో కొడుకుని దారిలో పెడితే భార్య అన్నట్టు కాస్త ఏ లైనింటిపిల్లనో డబ్బు తనహెూదా చూసి కాస్త చదువుకున్న పిల్లని తెచ్చి ఆ పెళ్లి ఏదో జరిపిస్తే బాధ్యత వచ్చి బాగుపడతాడేమో అని అయన ఆశ.

కానీ మనం అనుకున్నవి అనుకున్నట్టు జరిగితే ఇంకేం కావాలి అన్నది ఆయన మర్చిపోయారు.

***

కొడుక్కి కాస్త బుద్ధి వచ్చి, ఈ పరీక్ష గట్టెక్కిస్తే, కొండకి పిల్లాడిని తీసుకువచ్చి మొక్కుతీర్చుకుంటానని మొక్కుకున్న వరలక్ష్మి కొడుకు మూడునెలలు తండ్రి భయంతో చదివి, అత్తెసరు మార్కులతో తనపేరుకి డిగ్రీ తగిలించుకున్నాడు. ఆ సంతోషం సంబరంతో, తిరుపతి ప్రయాణం పెట్టుకుంది రిజల్ట్ వచ్చిన పదిరోజులకు. ఏవో మీటింగ్‌లు ఉన్నాయని ఢిల్లీ రమ్మని కబురొచ్చి, 'కారులోనేగా మీ ఇద్దరు వెళ్ళండి అన్ని ఏర్పాట్లు చేశా' అన్నాడు దశరథ్. "ఆవిడకయితే భర్త లేకుండా వెళ్లాలనిపించకపోయినా ప్రయాణం అయ్యాక ... వద్దనుకుంది. కొడుక్కైయితే తండ్రి రావడం లేదని తెలిసి ఎంజాయ్ చేయచ్చని సంబరపడ్డాడు.

దర్శనం మొక్కు అన్ని యధావిధిగా పూర్తి అవగానే రాత్రికి కింద తిరుపతిలో

 

వుండి తెల్లారి ఐదు గంటలకి రష్ లేనపుడు బయలుదేరితే తొందరగా ఇల్లు చేరదాం అని కొడుకు తొందరపెట్టితే సరే అంది వరలక్ష్మి. డ్రైవర్‌కి ఎంత గట్టిగా చెప్పినా స్టీరింగ్ ఇవ్వద్దని తండ్రి చెప్పినా, తల్లివారిస్తున్నా వచ్చినపుడు వూరు పొలిమేరలు దాటిన తరువాత అథారిటీ చేసి తల్లిని బతిమాలి డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు. కొడుకు బాగానే చేస్తున్నాడు బాధ్యతగానే వన్నాడని వెళ్ళేటపుడు ఇంకేం అనలేదు వరలక్ష్మి.

తిరుగు ప్రయాణంలో వూరు ఇంకో అరగంటలో చేరిపోతాం అనుకునే లోపలే మృత్యువు లారీరూపంలో అతి వేగంగా దూసుకు వచ్చి, సెల్లో స్నేహితుడితో మాట్లాడుతు కాస్త పరధ్యానంగావున్న ఆదిత్య తేరుకుని స్టీరింగ్ పక్కకి తిప్పేలోగానే ఎదురుగా లారీని ఢీకొట్టాడు. రెండు బళ్ల వేగంలో ఉండడంతో ముందు సీట్లో కూర్చున్న తల్లికొడుకులిద్దరు అక్కడికక్కడే కన్ను మూసారు. లారీ ముందు భాగంలోకి కారు సగం దూసుకుపోయింది. వెనకసీట్లో కూర్చున్న డ్రైవర్‌కి చాల దెబ్బలు తగిలినా బతికి బయట పడ్డాడు.

పాతిక ఏళ్ళు తనలో సగభాగంగా నిలిచిన భార్య, తన రక్తం పంచుకుకు పుట్టిన ఇరవైమూడేళ్ల కొడుకు, నాటకంలో పాత్రల్లా హఠాత్తుగా చెప్పకుండా, నాటకం మధ్యలోంచి మాయమైపోతే, అది, ఆమాట, ఆయనకి అర్థమవడానికి అరగంటపట్టింది. తరువాత నోటమాటపడిపోయినట్టు శూన్యంలోకి చూస్తూనే ఎవరేం చెపితే అదిచేసాడు. కంట్లోనించి నీటిచుక్కలేదు. భార్యని కొడుకుని ఏ లోపం లేకుండా జరగాల్సిన సకల మర్యాదలతో సాగనంపి, గదిలోకి వెళ్లి తలుపులు మూసుకున్నాడు. ఆ మూసిన తలుపులు మూడోరోజుకిగానీ తెరుచుకోలేదు, ఎందరు ఎన్నివిధాలు ప్రయత్నించినా.

మూడోరోజు గదిలోంచి వచ్చిన దశరథ్ కొత్తజన్మ ఎత్తినట్టు, గొంగళిపురుగు సీతాకోకచిలుకగా మారి ఎగిరివచ్చినట్టు, గౌతముడు బోధివృక్షం కింద కూర్చుని మారి బుద్ధుడైనట్టు అతి ప్రశాంతంగా బయటికి వచ్చాడు. అర్జున విషాదయోగం ముగిసినట్టు, ఎవరేం ఓదార్పు మాటలు చెప్పబోయినా, చెయ్యియెత్తి ఇంక వద్దు అన్నట్టు ఎవరిని మాట్లాడనీయలేదు. ఇకలే అర్జునా ! విషాద యోగం ముగిసింది,



నీ కర్తవ్యమ్ నెరవేర్చు అని గదిలో మూడురోజులుగా ఆపకుండా విన్న భగవద్గీతలో శ్రీకృష్ణుడు బోధించినట్టు, కార్యాచరణకు దిగిపోయాడు ఆయన.

మరో నెలరోజులలో ఆయన అమ్మాల్సిన పొలాలు, పట్నంలో ప్లాట్‌లు, ఇల్లు, తోటలు, రైసుమిల్లులు, ఆయిల్ మిల్లులు అన్ని అమ్మి చేతిలో డబ్బు చేర్చుకున్నాడు. తన పలుకుబడితో ఆఘమేఘాల మీద పరుగులెత్తించి, ఉండేందుకు ఇల్లు వాడు కోడానికి కారు, భుక్తికి తగిన డబ్బు మాత్రం ఉంచుకున్నాడు. ఏనాడో తండ్రికొనిపడేసిన భూములు ఈనాడు అన్ని కోట్లు కురిపిస్తాయని, ఆయన ఊహకి అందని విషయం. ఎందరికో భుక్తినిచ్చే మిల్లులు, పొలాలు, అమ్మడానికి కాస్త ఆలోచించినా అందులో పనిచేసేవారి బాధ్యత తీసుకునే షరతు మీదే అమ్మి ఎవరికీ అన్యాయం జరక్కుండా చూసారు. ఇన్నేళ్ళుగా తమని, తమ భూమిని, నమ్ముకుని బతికిన అందరికి ఎవరికీ చెందాలిసినవి వారికీ అప్పచెప్పి, కార్యాచరణకు దిగిపోయి, డబ్బు ఉంటే చేయలేని దేముంటుంది, అని మరో రెండునెలల్లోనే నిరూపించాడు.

నలభయి రోజుల్లో ఆయన తన వూరిని ఎలా మార్చేసాడో చూసిన ఎవరు నమ్మలేకపోయారు. డబ్బు వుండి, కార్య చరణకి, చిత్తశుద్ధి, చేతిలో పలుకుబడి, పవర్ ఉంటే, ఏమి చేయగలడో చేసిచూపాడు దశరథ్.

వూరులోంచి హైవే వరకు కిలోమీటరున్నర కంకర రోడ్ సిమెంట్ రోడ్ అయింది ... ఏనాడో ఏ జమిందారులో కట్టిన, శివాలయం, రామాలయం బాగుపడి తల్లి తండ్రుల పేర్లతో వెలిసి రంగులతో, విద్యుద్దీపాలతో వెలిగిపోతున్నాయి. ప్రభుత్వ పాఠశాల జూనియర్ కాలేజీగా వెలిసింది. కొత్త గదులు, ల్యాబ్, బ్లాక్ బోర్డులు, టాయిలెట్లు రెండు కొత్త మోడర్న్‌గా తయారయి మెరిసిపోతూ ప్లేగ్రౌండ్, టీచర్స్ రూమ్ ఒకటేమిటి అన్ని హంగులతో రూపురేఖలు మార్చుకుంది. భార్య పేరుతో ఊరిలో నాలుగు దిక్కులా నాలుగు మంచినీళ్ల ఓవర్ హెడ్ ట్యాంకులు, బజారులో ప్రతికూడలిలో, ప్రతివీధిలో మంచినీళ్ల కుళాయిలు, అరడజను బోర్ పంపులు, ఒక వెటర్నరీ ఆసుపత్రి, కొడుకు పేరుతో కొడుక్కి పెంపుడు కుక్కని ప్రాణంగా చూసుకునేవాడని, ప్రభుత్వ ఆసుపత్రి బాగు చేయించి, పాతిక పడకల ఆసుపత్రిగా సకల సదుపాయాలతో, ఉదయం సాయంత్రం రెండు బస్సులు




పట్నం నుండి వెళ్ళేవి వచ్చేవి. పట్నంలో కాలేజీలో స్కూల్స్ చదివే పిల్లలకి రాకపోకలకు ప్రత్యకం వేన్. రోడ్డుకి అటు ఇటు బస్ షెల్టర్లు, తల్లిగారి పేర ఒక ఓల్డ్ ఏజ్ హెూమ్, పొలాలమధ్యలో మూడు బోరెవెల్స్, ఓ ట్రాక్టర్, రోడ్లమీద విద్యుద్దీపాలు ... ఒకటేమిటి- చేతిలో వున్న డబ్బంతా ఆఖరు అయ్యే వరకు వూరికేమి కావాలో సకల సదుపాయాలు కూర్చాడు. ప్రజలు ఆశ్చర్య ఆనందాలతో ఊరికి దేముడి రూపంలో ఆ దశరథరాముడే వెలసి వరాలు కురిపించినట్టు కథలు పురాణాల్లా చెప్పుకున్నారు. నిస్వార్ధసేవ అంటే ఏమిటో జనానికి అర్థమైనది. చేతనయింతగా వారి సహాయ సహకారాలు అందించి, తలో పని బాధ్యత యువత తమ భుజాలమీద వేసుకుని, అహర్నిశలు ఓ యజ్ఞంలా పనులు పూర్తిచేసి కావాల్సినవేమిటో సూచిస్తూ తోడ్పాటు అందించడమేకాదు డబ్బున్న ఆసామీలు ఒకరు కోళ్లఫారం, ఇంకోరు కోళ్లదాణా మిల్లు, పిండి మిల్లు ఊర్లో దేనికి వెతుక్కునే అవసరం లేకుండా చేసారు.

జనం నోట,పేపర్లో వార్తలు, టీవీలో వీడియోలు, ఊరు పొలిమేరలు దాటిపోయి ఆగమేఘాలమీద రాష్ట్రము అంతావెళ్ళింది. ముందునించే అయన ఊర్లో పలుకుబడి, ఎమ్మెలేగా వున్నప్పుడే అయన చేసిన మంచిపనులు, ప్రజాభిప్రాయం ముఖ్యమంత్రి గారికి కంటగింపుగావుండేది. తన కంటే ఎంతో ఎత్తుకు ఎదిగిపోయి తన పదవికే ఎసరుపెట్టి ముఖ్యమంత్రి పదవికోసమే ఇదంతా చేస్తూ వున్నాడన్న అభిప్రాయం బలపడి ఆయన్ని శత్రువులా ఎదుర్కోడానికి మార్గాలు వెదకసాగాడు. పోటీపడి అంత ఖర్చు పెట్టగలడా దాచిందంతా జనం పాలుచేయాలి. ఇంకెన్ని ప్రలోభాలు చూపించాలి ప్రజలకి.. తలపట్టుకున్నాడు. ఎలక్షన్లు రోజుల్లోకి వచ్చేసాయి. అయన వెర్రి ఎత్తిపోయాడు. పెళ్లాము, కొడుకు చచ్చారు, ఇంకేం చేసుకుంటానని, డబ్బంతా వూడ్చిపెట్టి, ఏదో మంచిపనులు చేసేసి, ముఖ్యమంత్రి పదవి కొట్టేద్దామనుకుని ఎత్తువేశాడు. గొర్రెల్లా, వెధవలు వాడివెంట పడ్డారు. ఆయన వుడికిపోయాడు. ఏం చెయ్యాలో తోచక. గోరుచుట్టు మీద రోకలిపోటులా ఢిల్లీనించి దశరథ్‌కి పిలుపు వచ్చిందన్న వార్త వచ్చింది. అయిపోయింది తనపని అని నీళ్లుకారిపోయాడు.



తాను పదవులు ఆశించి ఇదంతా చేయలేదని, ఏదో డబ్బున్నందుకు మంచి పనులు చేసి ప్రశాంతంగా బతకడం, తన ఉద్దేశం, క్షమించండి అని తిరస్కరించాడు దశరథ్.

'చూడండి పట్టుమని ఏభయి ఏళ్ళు లేవు మీకు. ఎంతో జీవితంవుంది. మీ ముందు మంచి పనులు చేసే అవకాశం దేముడు మీకిచ్చాడు, మీకు వచ్చిన కష్టం సామాన్యమైనది కాదు, జీవితం అంతా పోగుట్టుకున్నదాన్ని తల్చుకు బాధపడలేరు ఎవరు. వంటరిగా అదే ఆలోచనలతో పిచ్చెత్తిపోయేకంటే మీ ఊరికి చేసినట్టే, మీ రాష్ట్రానికి కూడా చేయగలిగినంత చేస్తే మీ మనసుకి తృప్తి, ఏదో చేయగలిగానన్న ఆత్మతృప్తి లభించి ఏదో సాధించిన సంతోషం దక్కుతుంది. మీ నిస్వార్థసేవ జనం గుర్తించారు. ప్రజలు మీ వెంట వున్నారు. చూడండి చేతిలో అధికారం, డబ్బు ఉంటే ఏదన్నా చేయటానికి సుళువు అవుతుంది. పదవి ఉంటే పరుగులెట్టి పనిచేసే మనుషులు మీకింద వుంటారు. ఖాళీగా కూర్చుని మీ జీవితం వృథా చేసుకోకుండా, చేతికి అందిన అవకాశం తీసుకు ప్రజలకి ఉపయోగకుడి మీ జీవితానికి ఓ పరమార్థం సంపాదించు కోండి ఇప్పటి ప్రభుత్వం అవినీతిమయం అయి గోల పడుతున్నారు. మీరు ఆదుకుని మీ రాష్ట్రాన్ని కాపాడుకోండి. ఇంతకంటే చెప్పలేను మీవెంట మేముంటాం ఎప్పుడు అన్నారు.

ఎవరు లేరు ఇంకెందుకు, ఈ డబ్బుఏం చేసుకుంటాను అన్న ఆలోచనతో ఏదో ఊరికి మంచిచేద్దాం అన్న ఆలోచన, ఈ విధముగా మలుపుతిరిగి మళ్లీ కొత్తజీవితానికి నాంది అవుతుందని ఎదురు చూడని ఆయన రాత్రంతా ఆలోచించినా. ఎవరు లేని జీవితంలో నిజంగా తాను కోరుకున్న ప్రశాంతత దొరుకుతుందా, అలా బతకడం ... అడవుల్లో ముక్కుమూసుకుని, ఇదివరకు మునీశ్వరుల్లా బతకగలడా సాధ్యమవుతుందా, అంతకంటే మిగతా జీవితం నలుగురికి ఉపయోగపడితే ప్రజలు, అభిమానుల, పార్టీవాళ్ల విన్నపాలతో ఆఖరికి మనసు రెండో మార్గంనే ఎన్నుకుంది.

***

ఆ ఊరులో ఎమ్మెల్యేగా ఎప్పుడూ ఆయనకి ఎదురులేదు ఇప్పుడు ఎమ్మెల్యే లందరు ఏకగ్రీవంగా ముఖ్య మంత్రిగా ఎన్నుకున్నారు. ప్రతిపక్ష హెూదా కూడా అవతల పార్టీకి దక్కలేదు, ముఖ్యమంత్రి పదవే ఆయన్ని వెతుక్కుంటూ చేరింది. మనం చేసిన మంచైనా, చెడు అయినా స్థితప్రజ్ఞుడిగా ఉంటే ఫలితం మనల్ని వెతుక్కుంటూ వచ్చి చేరుతుంది అని జనం గుర్తు చేసుకుంటారు ఎప్పుడు.

**ఉషాపత్రిక, 2024**



# తోడొకరుండిన

డోర్‌బెల్ మోగింది.

'పాల ప్యాకెట్ గుమ్మంలో పడేసిపోవచ్చుగా ? మళ్ళీ బెల్ ఎందుకు కొట్టడం? ఎన్నిసార్లు చెప్పినా ఆ కుర్రవెధవ వినడు. ఇంకా పూర్తిగా చీకట్లుపోనేలేదు. తెల తెల వారుతుండగా అప్పుడే మంచినిద్ర పడుతోంది. అసలే చలికాలం. అందులోనూ దుప్పటి కప్పుకుని పడుకుంటే అస్సలు లేవాలని అనిపించదు' విసుక్కుంటూ లేచి తలుపు తీసింది సావిత్రి.

ఎదురుగా కనపడిన మొహంచూసి బిత్తరపోతూ "నువ్వా ? ... మీరా ! ఏమిటిలా హఠాత్తుగా, ఫోనైనా చెయ్యవచ్చుగదా'' అల్లుడిని చూసి నైట్‌గౌను సర్దుకుంటూ గాబరగా అంది.

"చెప్పి వచ్చినాగానీ, ఇక్కడెవరు మాకు హారతులిచ్చి స్వాగతించరని తెలుసుగా'' వ్యంగ్యంగా ఓ నవ్వు విసిరాడు అల్లుడు. గుమ్మంలోంచి తప్పుకుని, "రండి లోపలికి'' అంది సావిత్రి. షోల్డర్ బ్యాగ్‌తో లోపలికివచ్చి, కూతురు గదివైపు వెళ్ళబోతూంటే, "కాసేపు ఈ గదిలోకివెళ్ళి పడుకోండి. ఇంకా పూర్తిగా తెల్లారలేదుగా, అమ్మాయి మంచి నిద్రలో ఉంది. మళ్ళీ పిల్లాడు నిద్రలేచిపోతాడు'' అంటూ మూడో గదివైపు చెయ్యి చూపించింది సావిత్రి.

"అవునులెండి. ఆవిడగారికి ఇప్పుడప్పుడే తెల్లారదుగా'' అన్నాడు అల్లుడు, మళ్ళీ ఓ వ్యంగపు నవ్వు నవ్వి. లోపలికి వెళ్ళి తలుపేసుకున్నాడు.

సావిత్రి తన గదిలోకివెళ్ళి పక్కమీద వాలిందే గానీ, ఇంక నిద్రేంపడుతుంది. 'తెల్లారి ఎదుర్కోబోయే సంఘటనలు... అటు అల్లుడు, ఇటు కూతురు ఇద్దరి కిద్దరే. ఒకరి మాట మరొకరు వినరు. తమదే రైటు అంటారు తప్ప ఎదుటిమనిషిని అర్థంచేసుకునే ప్రసక్తేలేదు. మధ్యలో తనకే చచ్చేచావొచ్చింది. ఆయన కల్పించుకోరు.

పట్టించుకోవడం ఎప్పుడో మానేశారు. ఏడాదికాలంగా చెప్పీ, చెప్పీ..."నాకింకేం చెప్పొద్దు. వాళ్లేడుపు వాళ్ళని ఏడవనీ ... నా ప్రాణం విసిగిపోయింది. ఇది వెళ్లదు, అతను వదలడు" అంటూ ఏం చెప్పినా చెవులు మూసేసుకుంటాడు తన భర్త.

"ఏమిటి అప్పుడే లేచావు. పడుకో పడుకో" కళ్ళిప్పి బద్ధకంగా అన్నాడు మూర్తి.

"ఏం పడుకుంటాను, అవతల అల్లుడుగారు వేంచేశారు" విరక్తిగా అంది సావిత్రి.

"ఏమిటి వివేక్ వచ్చాడా..." కప్పుకున్న రజాయి తీసేసి లేచి కూర్చున్నాడు మూర్తి.

"ఆ వచ్చాడు. పేరులోనేతప్ప ఏ కోశానా ఇసుమంతైనా వివేకం లేదు".

"అవును. నీ కూతురికి కూడా పేరులోతప్ప సౌమ్యత లేనట్టుగానే" ఆయన విసుర్లు.

"మీకు కూతురే. ఆ మాట మరచిపోకండి" చురుగ్గా చూస్తూ పక్కమీదనుంచి లేచి బయటకు వెళ్ళిపోయింది సావిత్రి.

తెల్లవారాక బ్రష్ చేసుకుని కాఫీకోసం వంటింట్లోకి వచ్చిన సౌమ్యతో, "మీ ఆయన వచ్చాడు"

కాఫీ కలుపుతూ లోగొంతుకతో చెప్పింది సావిత్రి. సౌమ్య చటుక్కున తల్లివంక చూసి, "అలా అనొద్దని ఎన్నిసార్లు చెప్పాలి నీకు" చిరాగ్గా అంది.

"సరే, వివేక్ వచ్చాడు" సావిత్రి అంతకంటే తీవ్రంగా అంది. "రానీ, నాకెందుకు చెప్పడం.." కాఫీ మగ్గు, పిల్లాడి ఫీడింగ్ బాటిల్ పట్టుకుని సౌమ్య గదిలోకి వెళతుంటే, "నీకు మొగుడు గనుక చెప్పాను" అంది వెనకనించి మళ్ళీ.

వెనక్కితిరిగి తల్లిని మింగేసేట్టుచూస్తూ, "ఆమాటే అనొద్దన్నాను..." అంటూ గదిలోకి వెళ్ళి దఢాలున తలుపు వేసుకుంది సౌమ్య. గదిలోంచి బయటకు వచ్చిన మూర్తిని చూసి ఆ కోపం అంతా చేతిలో ఉన్న పటకారుమీద చూపించి పొయ్యిగట్టు




మీద గట్టిగా విసిరేసింది సావిత్రి. నిమ్మకు నీరెత్తినట్టు భార్యకేసి చూస్తూ, "ఆ కాఫీ ఇలా ఇవ్వు'' అన్నాడు మూర్తి ప్రశాంతంగా,

తలుపుతీసి, గుమ్మంలో ఉన్న పేపరు తీశాడు. హెడ్‌లైన్స్ చూస్తూ, భార్య ఇచ్చిన కాఫీగ్లాసు అందుకుని సోఫాలో కూర్చోబోతుంటే, "హలో గుడ్‌మార్నింగ్ సార్' అంటూ వచ్చి పలకరించాడు వివేక్.

"ఓ వెరీ గుడ్‌మార్నింగ్, మీరు వచ్చారని సావిత్రి చెప్పింది. కూర్చోండి. సావిత్రీ, మరో కాఫీ పట్రా'' మర్యాదగా అన్నాడు మూర్తి కాఫీ తాగుతూ, పేపరు చూస్తూ, "ఏమిటీ? ఇలా వచ్చారు'' అని అడిగాడు.

"పెళ్ళాంబిడ్డలు ఇక్కడే ఉన్నప్పుడు మావగారింటికి రాక తప్పుతుందా'' వ్యంగ్యంగా ఎత్తిపొడుపుగా అన్నాడు.

"ఓ రియల్లీ. మీరిద్దరూ ఇంకా భార్యాభర్తలేనా?'' అంతకంటే వ్యంగ్యంగా అన్నాడు మూర్తి.

"అని నేను అనుకుంటున్నాను. మీ అమ్మాయి ఏమనుకుంటోందో మీకే తెలియాలి'' గడుసుగా అన్నాడు వివేక్.

"నాయనా మీ ఇద్దరికీ ఓ నమస్కారం. మీ ఇద్దరూ భార్యాభర్తలో కాదో మీరే తేల్చుకోండి'' ఆ పని మీరు చెయ్యకపోతే మీకు సాయపడడానికి కోర్టులున్నాయి. మీ ఇద్దరికీ చెప్పలేక, మాకున్న ఓపిక, సహనం అన్నీ నశించిపోయాయి. కన్నాం కాబట్టి దాన్ని ఇంట్లోంచి పొమ్మనలేకపోతున్నాం. అంతే'' విరక్తిగా అన్నాడు మూర్తి. సావిత్రి వచ్చి కుర్చీ జరిపి కూర్చుంటూ, "వివేక్ ఇదేమీ బాగాలేదు. ఇద్దరికిద్దరు ఇలా పంతాలకూ, పట్టింపులకూ పోతే ఎలా? మీ మధ్య ఒక పిల్లాడు ఉన్నాడన్న విషయం మరచిపోకండి. రేపు వాడు కాస్త పెద్దైన తర్వాత, "నాన్న ఏడి అని అడిగితే ...''

"అవును. అది మీ అమ్మాయి ఆలోచించుకోవాల్సిన వ్యవహారం. ఆ మాత్రం కూడా ఆలోచించకుండా ఆమెకు ఆ మొండి వైఖరి, ఆ ధైర్యం ఏమిటో నాకైతే అంతుబట్టడం లేదు, మీకేమైనా అర్థం అవుతోందా?''

"చూడు వివేక్ భార్యాభర్తల తగవుల్లో ఎవరిది రైటు, ఎవరిది తప్పు అన్నది మూడోవాళ్లకి అర్థం కాదు. ఎవరికి వాళ్ళు మేమే రైటంటారు. మా అమ్మాయి మాటలే కరెక్టు అని మేం ఎప్పుడు నీతో అనలేదుగదా! ఇప్పటికైనా ఇద్దరూ కలిసి కూర్చుని మాట్లాడుకోండి. ఏదో ఒక నిర్ణయానికి రండి. అప్పుడు బాగుంటుంది."

"మాట్లాడాలని ఇప్పటికే రెండుమూడుసార్లు వచ్చాను కదా! ఆవిడ నోట్లోంచి మాటరాదు, కాంప్రమైజ్ అన్న పదానికి అర్థం తెలియనట్టు ప్రవర్తిస్తుంది. నాకు ఇంక ఈ రాకపోకలు చాలనిపిస్తోంది. అంత కాళ్ళబేరానికి దిగేంత తప్పులు నేనేమీ చెయ్యలేదు. వస్తుందోరాదో అడిగేసి, నాదారి నేను చూసుకుంటానిక. దేనికన్నా పట్టూ విడుపూ ఉండాలి. మా గొడవల మధ్య పిల్లాడు తండ్రిలేనివాడైపోకూడదని, సంసారం పాడుచేసుకోకూడదని నావైపు నుంచి నా ప్రయత్నాలు నేను చేశాను.."

"వివేక్ అన్నానని కోపం తెచ్చుకోకు. చేతులు కాలాక ఆకులు పట్టుకున్నావు. ఈ ఆలోచన, ఈ సౌమ్యత, కాస్తంత ఓపిక, సహనం అప్పుడే ఉంటే, కాస్తంత ఆదరణ, అభిమానం అప్పుడే చూపించి ఉంటే, ఏనాడో కరిగిపోయి ఉండేదయ్యా సౌమ్య. కానీ నువ్వు దాన్ని రెచ్చగొట్టావు. అర్థం చేసుకోవలసిన సమయంలో ఆదరించి దగ్గరకు తీసుకోలేకపోయావు".

"ఆంటీ, మనిషిలో పాజిటివ్ పాయింట్స్ కనిపెట్టి, నెగటివ్ పాయింట్స్ గురించి కొంచెం అర్థం చేసుకుని, ఆ పాజిటివ్ పాయింట్స్‌ని హైలైట్‌చేస్తే, అవతలివాళ్ళు లొంగిపోతారు. ఎప్పుడూ నెగటివ్ పాయింట్స్‌ను వేలెత్తి చూపిస్తుంటే అవతలివాడి ఇగో దెబ్బతిని మొండిగా ప్రవర్తిస్తాడు. మీ అమ్మాయిలో ఉన్న ముఖ్యమైన లోపం అదే. ఎప్పుడూ ఎదుటివ్యక్తి తను కోరుకున్నవిధంగా ప్రవర్తించాలంటే సాధ్యమేనా? అవతలివాడూ మనిషేగా! 'తనని అర్థం చేసుకోవాలి, తనమాట వినాలి' అని అవతలి వాళ్ళకు మాత్రం ఉండదా? సాధించడం, ఎత్తిపొడవడం, చేతకానితనంగా భావించి పదేపదే దెప్పిపొడవడం, ఆఖరికి కట్టుకునే బట్టలు, తినే తిండిమీద కూడా తనదే ఛాయిస్, తనకి నచ్చినట్టే చెయ్యాలి అంటే ఎలా? పోనీ అదేదో అహంకారంగా కాక ప్రేమ, అనురాగంతో మార్చే ప్రయత్నం చేస్తే ఒకరోజు కాకపోతే ఇంకో రోజు ఆ ప్రేమకి లొంగిపోతాడు మనిషి.

"వివేక్, ఈ వాదులాటలు, ఇద్దరి వెర్షన్ ఇదివరకే విన్నాం. నీవు చెప్పేది కొన్ని రైటు, అది చెప్పేది కొన్ని రైటు".

"ఒక్క విషయం ఆంటీ, సరే, మా అమ్మ నాకు కొన్ని పద్దతులు నేర్పలేదు.

"నాకు శుభ్రం తక్కువ. బట్టలు ఎక్కడపడితే అక్కడ వదిలేస్తాను. బాత్‌రూమ్ అంతా తడితడి చేసేస్తాను. పేపరు చదివాక నీట్‌గా పెట్టకుండా వదిలేస్తా. ఎంగిలి కప్పులు వదిలేస్తా. డబ్బు లెక్కలేదు. సరుకులు తేవడం తెలీదు. సంతలోంచి చచ్చూ పుచ్చు కూరలు తెస్తాను..." రోజూ ఇలా లక్ష సాధింపులు, చివాట్లు తింటూ, వాటిని భరిస్తూ విరక్తి చెందకుండా ఉండడానికి, నవ్వుతూ మునీశ్వరుడిలా ప్రశాంతంగా ఉండడానికి నేనేమన్నా యోగినా? పోనీ నన్నొక్కణ్ణే అనుకుంటే ఫర్వాలేదు. కానీ మా అమ్మని, మా ఇంటిని దెప్పే అధికారం తనకుందా? మనుషులందరి అలవాట్లూ ఒకేలా ఉండవు. మా అమ్మ పెంపకం ఆవిడ పద్ధతిలో జరిగింది. ఆవిడ ఇల్లు ఆవిడ ఎలా సర్దుకుందో అదంతా ఆవిడ ఇష్టం. ఆ ఇంట్లో పుట్టిన పిల్లలు ఆ తల్లి పెంపకంలో పెరిగి ఆమె నేర్పినవే నేర్చుకుంటారు. పెరిగిన వాతావరణం ఒక్కసారిగా మారిపోతుందా" నిలేసినట్టు అంటున్నాడు వివేక్.

సావిత్రి వెంటనే అందుకుంది.

"అవును. కరెక్ట్. నీవన్నది చాలా నిజం. దాని విషయంలోనూ అదే వర్తిస్తుంది. ఇక్కడ పద్ధతిగా, అన్నీ ఎక్కడివక్కడ వుండి, చాలా నీట్‌గా మెయిన్‌టైన్ చేసిన అప్పర్ మిడిల్‌క్లాస్ అమ్మాయిగా కొన్ని పద్దతులు దానికి అలవడ్డాయి. నా పద్ధతి అది. నాకంటే ఎక్కువగా దానికి కొన్ని మంచి అలవాట్లున్నాయి. హైక్లాస్‌గా పెరిగినపిల్ల. దానిదంతా కట్టె కొట్టె తెచ్చె అన్నట్టుండే రకం. నాజూగ్గా, మంచిగా, ఓరిమిగా చెప్పడం దానికి తెలీదు. నేను చిన్నమాట అన్నాకూడా భరించే మనస్తత్వం కాదు దానిది. కానీ, పెళ్ళికాకముందు ఎన్నిసార్లో చెప్పేదాన్ని, 'నా పద్దతి అంతే. నా మాట అంతే, ఎవరైనా నువ్వు కోరుకున్నట్టే ఉండాలంటే కుదరదు. నీకు నచ్చకపోతే, నచ్చచెప్పే తీరు ఇదికాదు. మంచిగా మనిషిని మార్చుకోవాలి అనేదాన్ని. చెప్పడం సులువే అనేది.



మీరిద్దరూ పెళ్ళికాక ముందు ఒకే ఆఫీసులో పనిచేశారు. ఆరేడునెలలు ప్రేమించుకున్నారు. కలిసి తిరిగారు. ఆ టైంలో అంత పూర్తిగా కాకపోయినా ఒకరిగురించి మరొకరు కొంతైనా అర్థంచేసుకుని ఉంటారు. మీ ఇద్దరికీ ఒకరి గురించి ఒకరికి అన్నీ నచ్చినతర్వాతే ఇష్టపడి చేసుకోడానికి ఒప్పుకున్నారని మేమూ మా అంగీకారం తెలియజేశాం''.

“అవును ఆంటీ, ఇందులో మిమ్మల్ని అనడానికి ఏమీలేదు. కానీ నేను సౌమ్యలో ప్లస్ పాయింట్స్ చూసి ఆకర్షితుడినయ్యాను. తన తెలివి. స్మార్ట్‌నెస్, పనిలో ఏకాగ్రత, నిర్దుష్టమైన అభిప్రాయాలు, ముచ్చట గొలిపే ఆకారం అన్నీ నాకెంతో నచ్చాయి. తనూ నాలో ప్లస్ పాయింట్స్ చూసే ఒప్పుకుందనుకున్నా. కానీ, అంత తెలివైన అమ్మాయి, ‘నిన్ను ఎంచుకోడంలో నేను పొరపాటుపడిపోయాను’ అని నన్ను అంటుంటే నా ఆత్మాభిమానం, నా అహం దెబ్బతినదా. మొదట్లో సరదాగా భావించి దులిపేసు కునేవాడిని. రోజురోజుకి ఆవిడ ధోరణి మితిమీరి పోతుంటే తిరగబడి నిర్లక్ష్యంగా జవాబిలివ్వడమే నేను చేసిన నా నేరమా?''

“వివేక్ ఎన్నిసార్లు వినమంటావు నువ్వు చెప్పే ఈ మాటలన్నీ. మా ఇద్దరికి ఇంక వినే ఓపికలేదు. ఇంక మీ ఇద్దరూ కలిసి బతకలేం అనుకుంటే మ్యూచ్యువల్ డైవోర్సు తీసుకుని ఎవరి బతుకు వాళ్ళు బతకండి. ఇంతకంటె మేం ఏమీ చెయ్యలేం, చెప్పలేం'' మూర్తి అసహనంగా అన్నాడు.

“వివేక్ చూడు నీ వాదనా విన్నాం, దాని వాదనా విన్నాం. పెద్దదాన్ని ఒక్కమాట చెబుతున్నా పాతికేళ్ళు ఒకచోట ఆడపిల్ల పెరిగి, పెళ్ళి పేరుతో ఇంకోచోటకువెళ్లి అక్కడ కొత్త మనుష్యులు, కొత్త అలవాట్లు, కొత్తచోటు, కొత్త రుచులు, కొత్త పద్ధతులు వీటన్నిటిమధ్య అలవాటుపడి ఇమడడానికి మానసికంగా ఎంత మధనపడుతుందో మగాళ్లకి అర్థం కాదు. ఏం చెయ్యాలో, ఎక్కడ కూర్చోవచ్చో, ఏం మాట్లాడచ్చో, ఏ పని చేయచ్చో, అలాచేస్తే ఏమంటారో, ఇలాచేస్తే ఏమంటారో అని లక్షసందేహాలు, భయాలతో ఆడపిల్ల అత్తింట్లో అడుగు పెట్టాక అక్కడి పరిస్థితులకు అనువుగా తనను తాను మలచుకోడానికి కొంత సమయం పడుతుంది. ఒక లేత మొక్కను తీసి ఇంకోచోట పాతితే రెండుమూడు రోజులకు జీవంపోసుకుని ఎదుగుతుంది.

అదే పెరిగిన మొక్కను వేళ్లతో సహా పీకి ఇంకోచోట పాతితే, వేళ్ళు తన్ని జీవంపోసుకుని బతకడానికి చాలా సమయం పడుతుంది. ఆడపిల్లకూడా అంతే, పుట్టి పెరిగినచోట, అప్యాయంగా, ప్రాణప్రదంగా చూసుకునే తల్లితండ్రులని వదిలి ఇంకోచోట, తెలియని మనుష్యులమధ్య అలవాటుపడడానికి సమయం కావాలి. చిన్నప్పుడు పెళ్ళిళ్ళు అత్తింటి కాపురాల రోజుల్లో అమ్మాయిలు తొందరగా పెద్దల సలహాలతో ఇమిడిపోయేవారు. ఇప్పుడు చదువుకున్న అమ్మాయిలకు ఆర్థికస్వాతంత్ర్యం వచ్చాక, తమ వ్యక్తిత్వంలో, అభిరుచులలో మార్పువస్తాయి. అలాంటి అమ్మాయిలు అత్తారింట్లో అంత తొందరగా కొత్తజీవితానికి అలవాటు పడలేరు. వాళ్ళ ఆత్మాభిమానం ఒప్పుకోదు. 'నేనేం తక్కువా?' అనే ఫీలింగ్ ఉంటుంది అమ్మాయిలలో. అలాంటప్పుడు భర్త ఆమెకు భరోసా ఇవ్వాలి. ఇది 'ఇది మనిద్దరి ఇల్లు మనం కలిసి జీవించాలి. అలకలు, అపార్థాలు ఏం వచ్చినా మనమే మాట్లాడుకుని సరిదిద్దుకుందాం' అని ప్రేమాభిమానాలు చూపితే అమ్మాయిలు త్వరగా సర్దుకుపోతారు. యిది నా యిల్లు, వీడు నావాడు అనే ప్రేమకి లొంగిపోతారు.

అలా కాకుండా, 'నా అలవాట్లునావి, నీకు నచ్చినట్లు నేనెందుకుండాలి?' అనుకుంటే ఆ సంసారంలో సామరస్యం లోపిస్తుంది. గొడవలు మొదలవుతాయి. ఆడవాళ్లు ఇటు ఇంటిపని, అటు బయట ఉద్యోగం రెండు చెయ్యాలని ఆశించకూడదు. ఇద్దరూ సమానంగా పనులు పంచుకోవాలి. ఆమె కష్టాన్ని గుర్తించాలి. అలాంటి భర్తలనే ఈనాటి ఆడపిల్లలు కోరుకుంటున్నారు. ఇంటిపనులు షేర్ చేసుకోలేని భర్తల్ని ఎందుకు భరించాలని వాళ్ళు అనుకోవడంలో తప్పేంటి?" అడిగింది సావిత్రి.

"అది సరే ఆంటీ, నాకు పని చెయ్యడం చేతకాదు. అలాంటప్పుడు నన్ను ప్రేమగా పిలిచి అడగాలి. ఈ కూరలు తరుగు, బాబు ఫీడింగ్ బాటిల్స్ కడుగు అని ఎలా చెయ్యాల్లో ఒకటికి రెండుసార్లు చెప్పవచ్చు కదా? దాని బదులు ఏమీ రాదని దెప్పడం, దులిపేయడం... అదే కరెక్టు అనుకుంటారు ఈ ఆడవాళ్ళు"

"మీ ఇద్దరి మధ్య సామరస్యత ఉన్నప్పుడు అవన్నీ సాధ్యపడతాయి. ఈ విషయంలో మా అమ్మాయి తప్పు లేదనని నేనను."

"నన్నేం చెయ్యమంటారు చెప్పండి. ఆఖరి ప్రయత్నంగా వచ్చాను. ఇప్పటికి ఆరునెలలైంది తను వచ్చేసి. ఇంక ఎదురుచూసే ఓపిక నాకు లేదు'' అసహనంగా అన్నాడు వివేక్.

తలుపు తీసుకుని బాబుని ఎత్తుకుని గదిలోంచి వచ్చిన సౌమ్య, వివేక్‌ని చూడనట్టే వంటింట్లోకి వెళ్లబోయింది. వివేక్ చటుక్కున లేచి "హాయ్, చేతన్ దా, దా, ఇలా రా..'' అని ఆమె చేతిలోంచి బాబుని తీసుకోబోయాడు.

సౌమ్య తీక్షణంగా చూసి, బాబుని గట్టిగా పట్టుకుంది. "హాయ్ సౌమ్య, బాబుని ఇటివ్వు. వాణ్ణి చూడడానికే వచ్చా తెలుసా? దా నాన్నా...'' అని మళ్లీ చేతులోకి తీసుకోబోయాడు.

"నీకు నాకు సరిపడదనుకొని నేను వచ్చేశాక ఇంకా ఈ రావడాలేమిటి, ప్లీజ్ నన్ను అనవసరంగా డిస్టర్బ్ చెయ్యకు'' అంది సౌమ్య తీవ్రంగా.. వివేక్ మొహం ఎర్రబడింది.

అంతలోనే నిగ్రహించుకుని "మనకు జరిగింది బొమ్మలపెళ్ళి కాదు, శాస్త్రోక్తంగా జరిగిన పెళ్ళి రిజిష్టర్ మ్యారేజ్ కూడా. ఇలా ఇంట్లో కూర్చుని నీకూ నాకు చెల్లు అనుకునేంత తేలికైన విషయం కాదు'' అంటూ బలవంతంగా ఆమె చేతిలోంచి బాబుని తీసుకున్నాడు. సౌమ్య తిరిగి బాబుని లాక్కోబోయింది.

అప్పుడు తన కూతుర్ని మూర్తి గట్టిగా మందలిస్తూ

"ఏమిటదీ? బాబుకి అతను తండ్రి అని మరచిపోకు. నీకెంత హక్కుందో అతనికీ అంతే హక్కు ఉంది. బిహేవ్ యువర్ సెల్ఫ్'' అన్నాడు. సౌమ్య తండ్రివంక చురుగ్గాచూసి ఏదో అనబోయి, తండ్రి మొహంలో కోపంచూసి మౌనంగా తన గదిలో వెళ్ళిపోయింది. "నీతో మాట్లాడేందుకే వివేక్ వచ్చాడు ఇద్దరూ రూములోకి వెళ్లి మాట్లాడుకోండి'' ఆర్డర్ వేసినట్టు అన్నాడు.

"మా మధ్య ఇక మాటలేం లేవు. మాటలాడాల్సింది ఒక్క లాయరుతోనే''

'సౌమ్యా' ఒకసారి ఎదుటివాళ్లు చెప్పింది వినడం నేర్చుకో, వివేక్ ఏం చెబు తున్నాడో ఒకసారి విను'' కూతుర్ని గట్టిగా హెచ్చరించింది సావిత్రి.

"సరే, మేం మాట్లాడుకునే మాటలకు గదులు అవసరంలేదు. అందరి ఎదురుగానే మాట్లాడవచ్చు" మొండిగా అంది.

"సరే, అయితే, అంకుల్, ఆంటీ మీరూ ఇక్కడే ఉండండి అంటూ, సౌమ్యా, నేను క్రితంసారే చెప్పాను. ఇప్పుడూ చెపుతున్నాను. మనిద్దరం కలిసి కాపురం చెయ్యాలనేది నా కోరిక. మనమధ్య ఇప్పుడు బాబుకూడా ఉన్నాడు గనుక వాడి కోసమైనా మన కలిసి బతకాలని కోరుతున్నాను. పిల్లాడికి తల్లిదండ్రులు ఇద్దరూ ఉండాలి. వాళ్ళ సమక్షంలోనే వాడి పెంపకం జరగాలని నా ఉద్దేశం".

"తండ్రిగా నువ్వు ఏం చేశావు? ఒక్కరోజన్నా వాడి ఆలనాపాలనా చూశావా? రాత్రిపూట ఒక్కసారైనా వాణ్ణి నిద్రపుచ్చావా, వాడికి పాలుపట్టావా? అన్నీ నేనే చేసుకున్నేట్టైతే ఇక నువ్వెందుకు? నేనే ఒంటరిగా బతుకుతూ వాడిని పెంచుకుంటా".

"అంత పసిపిల్లాడికి నేను ఏం చేయగలను. నాకు ఆ పని అలవాటు లేదు"

"అందరికీ అన్ని అలవాట్లూ ముందే వచ్చేయవు. చేస్తూ ఉంటే అవే వస్తాయి."

"నిజమే, నేను నేర్చుకోవాలని ప్రయత్నించినప్పుడు, ఏ పనీ సరిగ్గా చెయ్యవు, నీకు చేతకాదు అని నా చేతిలోంచి బాబుని లాగేసుకుంటే నేనెప్పుడు నేర్చుకోవాలి?"

"రోజంతా నిన్ను కూర్చోపెట్టి నేర్పేంత ఓపిక, టైము నాకులేదు. సరే, ఈ గోలంతా చాలాసార్లు అయిందిగానీ, ఇప్పుడు నాతో ఇంకేం మాట్లాడాలో చెప్పు".

"అంటే నా అవసరం లేదనీ, ఒంటరిగా ఉండాలనే నువ్వు నిర్ణయించు కున్నావా?

"ఈ విషయం కిందటిసారే చెప్పానుగా" మొండిగా అంది సౌమ్య

వివేక్ ఒక్కక్షణం సౌమ్య తల్లిదండ్రులవంక చూసి, "విన్నారుకదా, ఇంక మాట్లాడటానికి ఏమీలేదు అన్నతర్వాత, ఇక ఆమె కాళ్లు పట్టుకునేంత ఓపిక, సహనం నాకూ లేవు" అని బాబుని ముద్దు పెట్టుకున్నాడు వివేక్.

"నా కొడుకు సంగతి ఏం చెయ్యాలో లాయర్లతో మాట్లాడిచెపుతా " అంటూ పిల్లాడిని సావిత్రి చేతిలో పెట్టి గదిలోకి వెళ్లి బట్టలు మార్చుకుని బ్యాగ్ పట్టుకుని విసవిస బయటకు వెళ్లిపోయాడు.



"ఇంత అహంకారం పనికిరాదు. నువ్వు చేసిన ఈ పనికి విచారించే రోజు వస్తుందని తండ్రిని కాబట్టి, శాపం పెట్టనుగానీ, ఆల్ ద బెస్ట్, ఇంక నీ ఇష్టం. నీ విషయంలో మేం జోక్యం చేసుకోదల్చుకోలేదు'' అని తండ్రి పేపరు మొహానికి అడ్డంపెట్టు కున్నాడు. సావిత్రి కూతురువంక విముఖంగా చూసి వంటగదిలోకి వెళ్లిపోయింది.

***

"మీ అమ్మ నేను మూడురోజుల్లో అమెరికా బయలుదేరుతున్నాం. నిన్ననే టిక్కెట్లు వచ్చాయి'' అన్నాడు కూతురుతో మూర్తి. సౌమ్య చకితురాలైంది.

"అదేంటి నాన్నా? ఎందుకు ఇంత హఠాత్తుగా ప్రయాణం?'' కలవరపడుతూ అడిగింది సౌమ్య.

"మీ అన్నయ్యకి కొడుకు పుట్టిన తర్వాత ఇప్పటివరకు మేం చూడనేలేదు. వాళ్ళ అత్తగారు పురిటికి వెళ్ళి నాలుగు నెలలైపోయింది. ఆవిడ ఇండియా తిరిగి వచ్చేస్తుందట. అందుకని మమ్మల్ని రమ్మన్నాడు. పిల్లాణ్ణి ఒంటరిగా ఇంట్లో వదిలి ఉద్యోగాలకు వెళ్ళలేరుగా? ఆయా దొరికిందిగానీ, ఇంట్లో మన అనేవాళ్ళం మేం ఉండాలి కదా'' అన్నాడు.

"మరి ఇక్కడ నేను ఎలా? బాబు... బాబుని ఎలా మానేజ్ చెయ్యాలి''

"ఏదైనా క్రష్‌లో ఉంచు. మీ ఇద్దరూ కలిసి ఉన్నప్పుడు కూడా ఆఫీసులకు వెళ్ళినప్పుడైనా బాబుని క్రష్‌లో ఉంచక తప్పదుకదా'' నిర్లిప్తంగా అన్నాడు తండ్రి.

"చెప్పాపెట్టకుండా ఇంత హఠాత్తుగా మీరు అమెరికా ప్రయాణం పెట్టుకుంటే ఎలా? ముందేచెపితే ఏదోఒక ఏర్పాటు చేసుకునేదాని కోపంగా అంది.

'మాకు మాత్రం తెలుసా వెళ్ళాలనుకున్నాంగానీ, అక్కడ వాడి మామగారి తండ్రి ముసలాయన ఐసియులో ఉంటే కోడలుగా వాడి అత్తగారు వెళ్ళొద్దా. అందుకే ఫోను చేశాడు కిషోర్. టిక్కెట్లు కూడా పంపాడు. అవసరానికి నీలాగే, వాడినీ ఆదుకోవాలిగదా. కనీసం ఆరునెలలు పడుతుంది మేం తిరిగి రావడానికి'' అన్నాడు తండ్రి.

"ఆరునెలలు నేను బాబుతో ఒంటరిగా ఎలా ఉండాలి?" కోపం, ఉక్రోషం, గాబరా, భయం... కలగలిసిన వ్యాకులతతో అడిగింది సౌమ్య.

"ఉండాలి మరి. పెళ్ళిచేసి పురుడుపోయడం వరకే మా బాధ్యత. ఇంకా ఇంకా మేమే చెయ్యాలంటే ఎలా? మా పనులు మాకుంటాయిగా. కూతుర్నిగానీ, కొడుకునుగానీ జీవితాంతం కనిపెట్టుకొని ఉండలేకే వాళ్ళకి పెళ్ళిళ్ళు చేస్తారు తల్లిదండ్రులు. పెళ్ళయ్యాక భార్యాభర్తలు కలిసి వాళ్ల సంసారం వాళ్ళు చేసుకోవాలి. వాళ్ల జీవిత సమస్యలను వాళ్ళే ఎదుర్కోవాలి.

మొగుడు అక్కరలేదని నువ్వు అనుకున్నప్పుడు ఒంటరిగానే నీ భాధ్యతలు నువ్వే మోసుకోవాలి. అవసరానికి తల్లితండ్రులు ఆదుకుంటారుగానీ, అజన్మాంతం నిన్నూ, నీ పిల్లల్నీ కనిపెట్టుకుని ఉండే ఓపిక మాకు మాత్రం ఉంటుందా. పిల్లల బాధ్యతలు తీరిపోయి, ఉద్యోగ విరమణ చేశాక కాస్త నాలుగుచోట్లా తిరిగి గుళ్ళూ గోపురాలు చూద్దామనుకున్నప్పుడు, ఈ కొత్తబాధ్యతలు మానెత్తినవేస్తే అవన్నీ మేం మోయలేం. మాకూ కాస్తంత విశ్రాంతి, తీరిక కావాలి గదా".

సౌమ్య తల్లిదండ్రులకేసి చురచురా చూసింది. "నేను వివేక్ దగ్గరకి వెళ్ళను అన్నాను కాబట్టి, నాకు పాఠం ఈవిధంగా నేర్పాలనుకుంటున్నారా. నాకు బుద్ధి చెప్పడానికేనా మీ ప్లానంతా?"

"డోన్ట్ బి సిల్లీ. అన్నయ్యకి కొడుకు పుట్టిన దగ్గర నుంచి వియ్యపురాలు ఇండియా తిరిగి వచ్చాక మేం వెడదామన్న ప్లాను ముందుగా అనుకున్నదే గదా..."

మొహం ఎర్రబరుచుకుని విసురుగా పిల్లాడిని తీసుకుని లోపలికి వెళ్లిపోయింది సౌమ్య. రెండు రోజులు తల్లిదండ్రులతో మాట్లాడం మానేసింది సౌమ్య. వాళ్ళు కూడా ఏమీ జరగనట్టే వాళ్ళ ప్రయాణం ఏర్పాట్లు వాళ్ళు చేసుకున్నారు.

* * *

నెల రోజుల తరువాత ఒక రాత్రి సౌమ్య ఫోను చేసింది ఏడుపు గొంతుతో. "డాడీ బాబు ... బాబు మెట్లమీదనుంచి పడిపోయాడు. తలకి దెబ్బ తగిలి బాగా రక్తం వచ్చి తెలివి తప్పిపోయాడు. "అయ్యయ్యో మరి ఎలా? ముందు ఆస్పత్రికి

తీసుకెళ్ళు ఫోనులో గాబరాగా అరిచాడు మూర్తి. "తీసుకెళ్లా. తెలిపి వచ్చేవరకు ఏం చెప్పలేం అంటున్నారు డాడీ. మమ్మీ మీరు వెంటనే రండి" ఏడుస్తున్న కూతురు ఎటువంటి పరిస్థితిలో ఉందో వాళ్ళకి అర్థమైంది.

"వస్తాం కానీ రెండు రోజులున్నా పడుతుంది. ముందు నువ్వు వివేక్‌కి ఫోన్ చెయ్. తండ్రికి వెంటనే చెప్పాలి' మాట్లాడే అవకాశం ఇవ్వకుండా ఆర్డర్ వేసినట్టే కఠినంగా చెప్పి ఫోను పెట్టేసి, తలపట్టుకుని కూర్చున్నాడు మూర్తి

"మీరు కూడా అతనికి ఫోన్ చెయ్యండి" సలహా ఇచ్చింది సావిత్రి.

తెల్లారాక వివేక్ నుంచి ఫోను. బాబు కళ్ళు తెరిచాడని నార్మల్‌గానే ఉన్నాడని, కొన్ని పరీక్షలు మెదడుకి చేయాలన్నారని, బాబు కాస్త కోలుకున్నాక మిగతాపరీక్షలు చేస్తారనీ చెప్పాడు. "మీరు బెంగ పడకండి. నేనున్నాను చూసుకుంటున్నా, ఎప్పటి కప్పుడు ఫోను చేస్తా" అని చెప్పాక అందరూ కుదుట పడ్డారు. వారంతర్వాత మళ్ళీ ఫోన్ చేశాడు వివేక్. బాబుని తీసుకుని ఇంటికి వచ్చామని, అన్ని పరీక్షల్లో నార్మల్ రిపోర్టులే వచ్చాయనీ చెప్పాక స్థిమితపడ్డారు సావిత్రి, మూర్తి.

***

మూడు నెలలు గడిచాయి.

ముందుగా అనుకున్న సమయానికే మూర్తి, సావిత్రి ఇండియాకి తిరిగి వచ్చారు.

ఇంటికి వచ్చి చూస్తే తాళం వెక్కిరించింది వాళ్ళని. పక్క ఇంట్లో ఉండే కొలీగ్ గబగబ వచ్చి ఓ కవరు, తాళం చెవి వాళ్ళకు ఇచ్చి వెళ్లారు. ఇంట్లోకి వెళ్లి సామాను పడేసి ఆరాటంగా ఉత్తరం చదివారు.

"నేను, వివేక్, బాబు మా ఇంటికి నిన్ననే షిఫ్ట్ అయ్యాం.

ఇన్నాళ్ళూ మీ ఇంట్లో నాకు ఆశ్రయం ఇచ్చినందుకు థాంక్స్. పెళ్ళయ్యాక ఆడపిల్లలు తల్లిదండ్రులకి బరువవుతారని అమ్మాయిని 'ఆడపిల్ల'గానే తప్ప కన్నకూతురుగా ఏనాటికీ గుర్తించని తల్లితండ్రులలో మీరు ఒకరు. బాబుకి తండ్రి




అండ దొరికింది. నేను కాంప్రమైజ్ అయ్యానో, మనస్ఫూర్తిగా వెళ్లానో మీకు చెప్ప నవసరం లేదు. మీ ఇంట్లోంచి నేను వెళ్లిపోయినందుకు మీరు సంతోషించండి.

అంతే.

'గుడ్‌బై' - సౌమ్య.

"దీనికి మతిపోయింది చూడు ఎలా రాసిందో" అన్నారు మూర్తి విరక్తిగా. "దాని మొహం దాని కోపం నాలుగురోజులు. మనం వెంటనే రాలేదని కోపంలెండి దానికి. మీరు కంగారుపడి ఇండియాకి రావద్దు అని వివేక్ మనకి చెప్పిన విషయం మనం దానితో చెప్పామంటే మళ్లీ అదో గోల. మనతో మాట్లాడకపోతే ఇప్పుడు కొంపలేం మునిగిపోవు గానీ, దాని కాపురం అది చేసుకుంటే చాల్లెండి" అంది నిశ్చింతగా సావిత్రి.

**నవ్య, ఏప్రిల్ 2020** 



# బతుకున బతుకై ...

ఈరోజు మురళికి జీవితం మీద విరక్తి కలిగేంత కోపం వచ్చింది.

ఎవరి మీద?

ఏరి కోరి కట్టుకున్న పెళ్లాం మీద!

బాగా అయింది శాస్త్రి. ఛీ, ఏం బతుకు! అలిసి సొలిసి ఇంటికి వచ్చిన భర్తకు ఓ కప్పు కాఫీ అడిగే అర్హత లేదా?

ఎప్పుడూ తనే కలుపుకుని తాగుతాడు.

కాని ఇవాళ ఇంటికొచ్చేసరికి, డ్రాయింగ్ రూమ్‌లో లాప్‌టాప్ చూస్తూ కూర్చున్న మాధురిని చూసి, వర్క్‌ఫ్రమ్ హెూమ్ డ్యూటీ అయిపోయిందనుకుని, "తలనొప్పిగా ఉంది, కాస్త కాఫీ కలిపి ఇస్తావా?'' అన్నాడు.

అంతే! కళ్లు పెద్దవి చేసి "ష్'' అని గద్దిస్తున్నట్టు చూసి, నోటిమీద వేలుపెట్టి మరోసారి "ఉష్'' అంది.

తనకేం తెలుసు! రోజూ తన రూంలో టేబుల్ మీద లాప్‌టాప్ పెట్టుకుని వర్క్ చేసే మాధురి ఇవాళ డ్రాయింగ్ రూమ్‌లో కూర్చుంటే, పని అయిపోయిందని అడిగాడు.

అంత మాత్రానికే ఇలా ...

సోఫాలోంచి లేచి చివ్వున బెడ్రూమ్లోకి వెళ్లి బట్టలయినా మార్చకుండా పక్కమీద వాలిపోయాడు. అప్రయత్నంగా అతని కంట నీరు చిమ్మింది. పావుగంట తర్వాత లేచి వంటింట్లోకి వెళ్లి కాఫీ పెర్కలేటర్‌లో నీళ్లు, పొడి వేసి, బట్టలు మార్చుకుని, మాత్ర వేసుకుని కాఫీ తాగుతుండగా మాధురి విసురుగా లోపలికి

వచ్చి "ఏం, రోజూ నువ్వే కలుపుకుని తాగుతావు కదా, ఇవాళ పెళ్లాం కలిపి ఇవ్వాలా .. కాఫీ" వెటకరిస్తూ ఎగిరింది.

"ఎవడికి తెలుసు... డ్రాయింగ్ రూమ్‌లో కూర్చుంటే పనైపోయిందనుకుని అడిగాను. పని ఉంటే అక్కడెందుకు కూర్చున్నావ్ మరి?" మురళి అంతకంటే గట్టిగా ఎగిరాడు.

"పని అయిపోయి, బయటికి వచ్చేసరికి బాస్ ఏదో మర్చిపోయి మళ్లీ పిలిచాడు. అందుకు ఇక్కడే కూర్చున్నా. అయినా రోజూ నువ్వే కలుపుకుంటావు. ఇవాళ నన్నెందుకు అడిగావు?" రెట్టించింది మాధురి.

"రోగం వచ్చింది. బుద్ధిలేక అడిగా.. క్షమించు" కప్పు టేబుల్ మీద పెట్టి అటు తిరిగి పడుకున్నాడు. తెలియకుండానే మరోసారి అతని కళ్లు నిండాయి.

'ఛా .. ఏం బతుకు? ఎందుకీ సంపాదన? ఎందుకీ లక్షలు? ఎవరికోసం? కప్పు కాఫీ అయినా పోసేవాళ్లు లేని ఈ కొంపలో ...' తనమీద తనకే విరక్తి కలిగింది మురళికి.

***

పెళ్లయిన కొత్త మోజులో రెండు మూడు నెలలపాటు తనే కాఫీ చేసి మాధురికి ప్రేమగా అందించేవాడు. కమ్మగా వంటచేసి పెట్టేవాడు.

ఆమె చనువు, తెలివి, తనకన్నా మంచి జాబ్, ఎక్కువ జీతం, స్మార్ట్‌నెస్ .. అన్నీ చూసి వెంటపడ్డాడు. మూడు నెలల తర్వాత ప్రపోజల్ తేగానే "పెళ్లా! నేనేం అనుకోలేదు" అంది అదోలా చూసి.

"పోనీ, ఇప్పుడనుకో..." గోముగా చూస్తూ మాధురి చెయ్యి పట్టుకున్నాడు. ఇబ్బందిగా చూసింది. 'ఆ' అనుకోడానికి వారం రోజులు, మరో రెండుసార్లు గుర్తు చేశాక 'ఊ' అంది.' దానికే మురిసిపోయి, పొంగిపోయి, తబ్బిబ్బయిపోయి, సంతోషంగా "థాంక్స్" అన్నాడు చెయ్యి పట్టి ఊపుతూ.

"ఇదిగో అబ్బాయ్ .. నాకేం వంటా, గింటా రాదు. ముందే చెబుతున్నా.

తర్వాత చెప్పలేదనకు. నీవు వండి పెడితే తినిపెడతా, లేదంటే ఆర్డర్ ఇచ్చి ఏది తెచ్చిపెట్టినా సరే తింటాను. నో కంప్లైంట్స్" నవ్వుతూ అంది.

"ఆ పర్లేదులే. వంట ఏం పెద్ద సమస్య కాదులే" తేలిగ్గా అనేశాడు.

పెళ్లికి ముందు మాత్రం అమ్మాయిలు గుండిగలు వార్చి, వంటలో తర్ఫీదు పొందుతారా? వాళ్లూ పెద్ద చదువులు చదివి, ఉద్యోగాలు చేస్తున్నారు. టైముండదూ.. పెళ్లిళ్లయి యింటి బాధ్యత నెత్తినబడితే, అవే వస్తాయి. తన చెల్లెలూ అంతేగా. రెండేళ్లలో పక్కా ఇల్లాలై అన్నీ నేర్చుకుంది' అని తేలిగ్గా అనుకున్నాడు.

కాని, మాటమీద నిలబడ్డట్టు మాధురి వంటింట్లోకి వెళ్లలేదు. పెళ్లై, కాపురం మొదలు పెట్టిన ఈ ఏణ్ణార్ధంలో ఏదో బాధ్యత నెత్తిన బడితే... అమ్మాయిలు అదే నేర్చుకుంటారన్న అతని ఊహ అపోహగానే మిగిలిపోతుందని అనుకోలేదు మురళి.

కొత్త మోజు మురిపం తీరిన రెండు నెలల తర్వాత యింక లాభం లేదని ఆవిడగారు ఏ పనీ చేయదని అన్నట్టే తిని కూర్చుంటుందని అర్థం అయ్యాక ఓరోజు...

"పద, ఇవాళ నీకు వంట నేర్పిస్తా. ఇద్దరం ఆడుతూ పాడుతూ కలిసి చేద్దాం. ప్రయత్నిస్తేగా వచ్చేదీ లేనిదీ తెలిసేది! వంటింట్లోకి వెడితేనేగా పొయ్యేదో, పేనమేదో తెలిసేది. పద.. పద.. ఈరోజు అన్నం, పప్పు ఎలా చేయాలో నేర్పుతా .." సరదాగా అంటూ వంటింట్లోకి చెయ్యిపట్టి లాగాడు.

"అబ్బ ... వంటా" అంది మాధురి మొహం చిట్లించి, అదోలా పెట్టి.

ఇన్నాళ్లూ ముసుగుతన్ని లేవని మాధురి, మురళి కాఫీ తెచ్చి లేపగానే "ఓ, అప్పుడే ఎనిమిదైందా! బాస్ ఎనిమిదిన్నరకే వచ్చి కూర్చుంటాడు. ఐ మస్ట్ గెట్ రెడీ" అంటూ తెచ్చిన కాఫీ గటగట తాగేసి, హడావిడిగా బాత్రూమ్‌లోకి దూరి, అరగంట తయారై తన గదిలో లాప్‌టాప్ తెరుస్తూ "నువ్వు బ్రేక్‌ఫాస్ట్ తినేసి, నాకన్నీ టేబుల్ మీద వదిలేయ్. గిన్నెలు కడిగేస్తాలే" ఉదారంగా అనేది.

కరోనా పుణ్యమా అని ఏడాదిగా వర్క్‌ఫ్రమ్ హోమ్ కాన్సెప్ట్ వచ్చి ఇళ్లనించే పనిచేసుకోవడానికి అలవాటు పడిపోయారు జనం. కొన్నాళ్లు మొదట్లో బాగుందని పించినా, బయట ముఖం చూడక, బోర్ కొట్టింది. వంటి మీదా, డ్రెస్సుల మీదా




శ్రద్ధ తగ్గి, తిన్నగా పక్కల మీంచి లేచి కాస్త మొహం కడిగేసి, ఓ ఇస్త్రీ చొక్కా తగిలించుకుని, తల దువ్వేసి ప్రెజంటబుల్‌గా తయారై ఎవరి గదుల్లో వారు లాప్‌టాప్‌ల ముందు కూర్చునేవారు.

బ్రేక్ పీరియడ్లో అన్నం ఒకసారి, పప్పు మరోసారి పడేసి వచ్చేవాడు మురళి. ఏ ఆదివారమో చేసి పెట్టుకున్న కూరను ఫ్రిజ్‌లోంచి పైకి తీసేవాడు. ఈ రొటీన్‌కి అలవాటు పడిపోయినవారు ఇప్పుడు కొన్ని ఆఫీసులు తెరవడంతో, బస్టాప్‌కి పిల్లలని లేపి తయారుచేసి పంపడం, వాళ్లు తయారై అందరికీ పరుగులు, హడావిడి మొదలయ్యింది.

అయితే, కొన్ని ఆఫీసులకు వర్క్‌ఫ్రమ్ హోమ్ కాన్సెప్టే బాగుంది. అద్దెలు, ఎలక్ట్రిసిటీ, కాఫీల ఖర్చు లేవనుకుని ఇంకా పొడిగిస్తున్నాయి.

కాని మురళికి ఆఫీసు, మాధురికి ఇంటి నుంచి వర్క్ మొదలైంది. మురళి ఆఫీసుకి వెళ్లాల్సి రావడంతో అవస్థలు మొదలయ్యాయి.

✲✲✲

మురళి ఆఫీసుకెళ్లేముందు కాఫీ ఎలా చేసుకోవాలో, ఆమ్లెట్ ఎలా వేసుకోవాలో, రైస్ కుక్కర్లో ఎలా వండుకోవాలో, పప్పు కుక్కర్లో ఎన్ని నీళ్లు పోసి వండాలో.. బేసిక్ పాయింట్స్ అన్నీ చేసి చూపిస్తూ వండాడు. చిన్నపిల్లలకి, వంటరాని మొగుళ్లకి పుట్టింటికి వెళ్లే ఇల్లాలు చెప్పినట్టు, చెప్పుకున్నంత సేపూ 'ఏం ఖర్మ' వచ్చింది మొగుళ్లకి.. ఆడ మగ స్థానాలు తారుమారు అవడం, అమ్మాయిలు రాజ్యం వచ్చేసిందా, తనలాంటి వాళ్లతో.. ఈతరంలోనే ఆరంభమయిందా' మాధురి కళ్లముందటే అనుకునేవాడు.

అమ్మ ఆనాడే చెప్పింది. హాలీడే ట్రిప్ అంటూ మాధురిని తీసుకొచ్చి చూపించాడు అమ్మకి. చెప్పకుండానే అమ్మ గ్రహించింది తన ఉద్దేశం.

తన ఇంజనీరింగ్ అయిపోయాక, ఎమ్మెస్ చేద్దామని అనుకుంటున్నప్పుడే తండ్రి హార్ట్ ఎటాక్ వచ్చి పోతే సెటిల్ కాని తననూ, చెల్లెలి బాధ్యతనూ తన చేతుల్లోకి తీసుకుని సమర్థవంతంగా నిర్వహించింది తల్లి. తన టీచర్ ఉద్యోగం, ప్లస్ నాన్న పెన్షన్‌తో.



చదువు పూర్తి అయిన స్వప్నకి మంచి సంబంధం చూసి పెళ్లి చేసింది. తనని అమెరికా పైచదువుకి పంపింది. అమ్మ దగ్గరున్న మూడు రోజుల్లో మాధురి తెలివి, చదువు, స్మార్ట్‌నెస్‌తోపాటు తను గ్రహించని విషయాలు ఎవరూ చెప్పక్కరలేకుండానే గ్రహించింది ఆవిడ.

మాధురి బెంగళూరులో ఉంటున్న వాళ్ల అమ్మనాన్న దగ్గరికి వెళ్లింది. అవకాశం చూసి 'అమ్మా, నచ్చిందా మాధురి నీకు' అన్నాడు ఆరాటంగా తల్లి మొహం చూస్తూ.

'నచ్చకపోవడానికి ఏముంది? చదువు, మంచి ఉద్యోగం, జీతం.. నీవు కోరుకున్నవి అన్నీ ఉన్నాయి ఆ అమ్మాయిలో, కానీ' అని ఆగిపోయింది.

"చెప్పమ్మా, కానీ ఏమిటి, వాళ్ల ఫ్యామిలీ గురించి కూడా చెప్పాను. ఒక్కతే కూతురు. తండ్రి, తల్లి మంచి ఉద్యోగస్థులు. అయినింటి అమ్మాయి.."

"అవన్నీ కాదురా, ఆ అమ్మాయికి ప్రపంచజ్ఞానం కాస్త తక్కువనిపించింది. ప్రాపంచిక విషయాలు పట్టవు. తనన్నది జరిగిపోవడం తప్ప. ఎలా వచ్చింది. ఎక్కడ నుంచి వచ్చింది, ఎవరేమనుకుంటారు, కూర్చున్న చోటుకి తెచ్చిపెడితే అదెవరు ఎంత కష్టపడితే తను తినగలుగుతోంది అన్న ప్రాపంచిక విషయాలు ఆమెకు అక్కర లేదు. డబ్బున్న వాళ్లు, అడిగిందల్లా యిచ్చే తల్లిదండ్రుల ముద్దు మురిపాలల్లో పెరిగిన పిల్ల మరి. రేపు ఎంత చదివినా, ఎంత సంపాదించినా యిల్లు అన్నది నడపడం తెలిసి ఉండాలి గదా! ప్రేమలు తిని, డబ్బుతో అన్నీ కొనుక్కొని తినేస్తూ బతుకుతారా? కాబోయే అత్తగారు వంటింట్లో ఇక్కడ చేస్తోంది అని మాట వరసకైనా, 'నేను హెల్ప్ చేయనా ఆంటీ .. ఇది చేయనా' అని ఇంప్రెస్ చేయడానికైనా అడగాలని తెలియదు మాధురికి. ఇద్దరి మధ్య గొడవలు రాకుండా సర్దుకుంటూ బతకడం సాధ్యమా అన్నది నీవు ఆలోచించుకో, నీకిష్టం అయితే నాకేం అభ్యంతరం.." అనేసింది అన్నపూర్ణ. "నేర్చుకుంటుందిలే, మేనేజ్ చేసుకుంటాం, తను నేర్చుకునే వరకు నేనున్నాగా చూసుకుంటా" అనేశాడు నమ్మకంగా.

***

పెద్దలు ఎంతో అనుభవంతో... తాము అనుభవించి చెప్పినమాటలు అవన్నీ.. ప్రేమ మైకంలో ఆ మాటలు పట్టించుకోరు తనలాంటి వారు. మాధురి మనస్తత్వాన్ని అంచనా వేయడంలో ఎంత పొరపడ్డాడో రోజులు గడిచిన కొద్దీ అర్థమయ్యాయి.

వంట, వంటిల్లు, ఇల్లు సర్దుకోవడంలాంటి పనులు తనకి సంబంధించిన విషయాలు కావన్నట్లు, పెట్టిందేదో తినేసి వెళ్లే మాధురిని చూస్తుంటే, చెప్పందే చేసేట్టు లేదని, వంట రాకపోతే మిగతా పనులైనా చేస్తుందని ఆశించిన మురళి విస్తుపోయాడు.

"అన్నం, కూరలు, టిఫిను, కాఫీ లాంటి పనులు ఒకరు.. వారానికి ఒకసారి యిల్లు వ్యాక్యూమ్ చేయడం, వాషింగ్ మిషనులో బట్టలు ఉతికి ఇస్త్రీ చేయడం, పక్కలు సర్దడం మరొకరు.. నీవేం చేస్తావో ఫస్ట్ ఛాయిస్ నీదే, రెండూ నేను చెయ్యలేను. ఆఫీసునించి వచ్చి పనులు యిద్దరం పంచుకుందాం" అన్నాడు సౌమ్యంగా.

"ఇంటి పనికి వారానికి ఒకసారి వచ్చి అన్నీ చేసేందుకు మెయిడ్‌ని పెట్టుకుందాం. ఏదో రోజు గిన్నెలు కడిగిస్తున్నాగా" అంది ఉదారంగా.

మాధురి మాటలకు మురళి నోట మాట రాలేదు.

"వంట నాకు రాదని ముందే చెప్పాగా, నీవు సరే అంటేనే, పెళ్లికి ఒప్పుకున్నాను.. ఇప్పుడు మాట మార్చకు" అంది కోపంగా.

"వంట రాదనకు. చేయనను. ప్రయత్నిస్తేగా వచ్చేది" హేళనగా అన్నాడు.

"అవును. చేయను. దటీజ్ నాట్ మై జాబ్" అంది కోపంగా లేచివెడుతూ.

అన్నట్టే వంట, బ్రేక్‌ఫాస్ట్, వంటపని తనుచేసి మిగతావి వదిలేసి పట్టించుకోలేదు. ఆదివారానికి పొద్దుటే ఒక తెల్లమ్మాయి దిగబడి ఇల్లంతా సర్ది, బట్టలుతికి, ఇస్త్రీ చేసి, గిన్నెలన్నీ కడిగి సర్ది, ఇల్లంతా నీట్‌గా చేసి పోయింది.

ఓ ఆవిడ సంపాదిస్తోందిగా బోలెడు, డబ్బిచ్చి చేయించుకుంటుంది. తను ఆఖరికి వంటవాడుగా మిగుల్తాడేమో అనిపించింది మురళికి ఆమె ధోరణి చూసి.

✲✲✲

"అరే బాబూ, నీవేకాలంలో ఉన్నావింకా? యిప్పటి భార్యలు ఉద్యోగాలు చేస్తూ వంటలు కూడా చేస్తారా నాయనా? నీ మిసెస్ మాత్రమే కాదు, అందరూ అంతేరా. పక్కలు సర్దడం, వాషింగ్, డిష్‌వాషర్, ఇస్త్రీలు, ఇల్లు మాప్ అన్నీ మనం చేస్తే రెండు పదార్థాలు వండి ఆపసోపాలు పడిపోతారు. వాళ్లు సగం, మనం సగం పని షరతులు ముందే పెడుతున్నారు నాయనా... ఇవి వాళ్ల రోజులు. మొగాళ్ల, మొగుళ్ల రోజులు అయిపోయాయి. నోరు విప్పితే పడరు. విడాకులంటున్నారు. ఉన్నదంతా వూడ్చి పట్టుకుపోతారు. జాగ్రత్త "నాయనా" డ్రింక్స్ మధ్య మనసులో మాటలు బయటికి వచ్చేసి ఒకరి గోడు ఒకరు వెల్లబోసుకున్నారు మిత్రులు.

"పిల్లల్ని తరువాత కనొచ్చని... ముందు ఇల్లు కొనాలి, కారు కొనాలి. ఫర్నిచర్ కావాలి అంటూ రెండేళ్లు గడిచిపోయాయి. 'పిల్లలను కనండి. మేం చూస్తామ'ని మా పెద్దవాళ్లు ఎంత మొత్తుకున్నా 'ఆ.. యిప్పుడు ఇలా అంటారు, కన్నాక మా నెత్తినే పడేస్తారంటుంది మా ఆవిడ" మరో మిత్రుడి గోస.

"అటు అమ్మవాళ్ళు రెండేళ్లయింది పిల్లల్ని కనండి' అంటారు. కావలసినపుడు స్విచ్ వేస్తే ఫ్యాను తిరిగినట్టు పుట్టుకొస్తారనకుంటాను. మన ఖర్మ, ఉద్యోగం చేసే పెళ్లాం అయితే డబ్బుతో సుఖాలన్నీ దొరుకుతాయి అనుకుంటే తిండికే కరువొచ్చింది. సంపాదిస్తున్నాం అన్న అహంకారం పెరిగిపోయింది. పైగా, సగం పని నీది అని ముందే షరతులు" ఒకరి కష్టాలు ఒకరు పంచుకుని, ఒకర్నొకరు ఓదార్చుకుని చివరకు విడిపోయారందరూ.

మరో ఆరు నెలలు భారంగా గడిచాయి మురళికి. ఇంట్లో గొడవలు ఎక్కువయ్యాయి. కీచులాటలు, అరుచుకోవడాలు, వాదించుకోవడాలు. పెళ్లయితే ముద్దులు మురిపాలు, అన్నీ ఊహాగానాలు అని తేలిపోయాయి. మాధురికి ఇల్లు, సంసారం, పిల్లలు, కాపురం ఏమీ అక్కరలేదు. పట్టించుకోదు తను, తన ఉద్యోగం తప్ప ఏదీ పట్టించుకోదని, అన్నం పెడితే తింటుంది, వండకపోతే బ్రెడ్ ముక్కలు, జ్యూస్‌లు, పళ్లు, పిజ్జాలు ఆర్డర్ చేసుకు తినేసి బతికేస్తుంది.

తీరిక లేని భార్య.. ఇది సంసారమా, ఇది కాపురమా? తామిద్దరూ భార్యాభర్తలు. ఆలోచనలు, సందిగ్ధాలు, అనుమానాలు, భయాలు, ఎటూ



తేల్చుకోలేని ఆలోచనలు. రాత్రి నిద్ర కరువైంది - ఈ పెళ్లా తను కోరుకుంది ! వద్దు. ఈ డబ్బూ వద్దు, ఈ ఉద్యోగమూ వద్దు. ఈ పెళ్లాం అసలే వద్దు. తను సంపాదించన లక్షలు ఏం చేసుకుంటాడు. తినడానికి తిండిలేదు. లక్షలు దాచి యివ్వటానికి పిల్లలు లేరు. నిరంతరం ఒకటే ఆలోచనలు.

రోజులు దొర్లిపోతున్నాయి.

***

రెండు పెద్ద సూట్‌కేసులతో ఒక తెల్లారి యింటి ముందు నిల్చుని బెల్ కొట్టిన మురళిని చూసి విస్తుపోయింది అన్నపూర్ణ.

"ఏమిటి చెప్పా చెయ్యకుండా.. ఇలా హఠాత్తుగా" ఆవిడ అంటుండగానే మురళి తల్లిని తప్పించుకుని సూట్‌కేసులతో లోపలికి వెళ్లాడు.

"మాధురి ఏదీ? రాలేదా?" అంది అనుమానంగా

"రాలేదు.. రాదు" అని "అమ్మా ముందు కాఫీ యివ్వు తరువాత టిఫిన్ పెట్టు. ఆకలేస్తోంది. తరువాత నిద్రపోయి లేచాక అన్నీ చెప్తాను" అంటూ రూమ్‌లోకి దూరాడు మురళి.

***

కడుపునిండా తిని, కంటినిండా నిద్రపోయి లేచాక, సాయంత్రం తల్లి యిచ్చిన కాఫీ తాగుతూ..

"అమ్మా, నేను అమెరికా నుండి వచ్చేశాను. ఇక్కడే ఉద్యోగం చూసుకున్నా. మావాళ్లు ఇండియాలోనే బ్రాంచి పెట్టారు. దాన్లో చేస్తా ..."

"మరి మాధురి ఒప్పుకుందా? తరువాత వస్తుందా?" అంది ఆరాటంగా అన్నపూర్ణ.

"తను రాదు. తనిక నా భార్య కాదు. యిద్దరం, మ్యూచువల్ డైవోర్సు తీసుకున్నాం. అన్ని తెగ తెంపులు చేసుకుని ఎలా వెళ్లానో, అలా వచ్చేశాను రెండు సూట్ కేసులతో.." అతని గొంతు రుద్దమయింది. ఆవిడ విస్తుపోతూ కొడుకు వంక చూసింది. ఏం అడగాలో, ఏం అనాలో అర్థం కాలేదావిడకి. చటుక్కున లేచి మురళి తల్లి దగ్గర. కూర్చుని ఆవిడ రెండు చేతులూ పట్టుకొని

"అమ్మా, నాకు ఇల్లు, సంసారం చూసుకునే అమ్మాయి కావాలి. భర్తకి అనురాగం, ఆప్యాయతతో దగ్గర కూర్చుని యింత అన్నం పెట్టే యిల్లాలు కావాలమ్మా. యిల్లంటే, భార్య భర్త, పిల్లలు కళకళలాడే నవ్వులుండే పరిస్థితులు కల్పించే భార్య కావాలమ్మా! భోజ్యేషు మాతలా నా యిష్టాలు గుర్తెరిగే అన్నపూర్ణ లాంటి భార్య కావాలమ్మా! శయనేషు రంభ అంటారు కాని రంభలాంటి భార్య అందగత్తె కానక్కర్లేదు. ప్రేమగా, అన్యోనంగా ఒకరికొకరు తోడునీడగా కష్టసుఖాలు పంచుకుని సాగే సంసారం కావాలమ్మా! నాకు లక్షలు సంపాదించే భార్య వద్దు. రాత్రింబవళ్లు ఆఫీసు పనితో అందనంత ఎత్తుకి ఎదిగిపోయే భార్య వద్దు. నాకు తోడు నీడగా యింటి పట్టునుండి, యిల్లు, భర్త, సంసారం, పిల్లలని చూసుకునే మంచి ఇల్లాలు కావాలమ్మా. అలాంటి అమ్మాయిని చూడమ్మా.." గుక్కతిప్పు కోకుండా మనసులో ఇన్నాళ్లూ గూడుకట్టుకున్న. బాధనంతా ఒక్కసారి వెళ్లగక్కి తల్లి చేతుల్లో మొఖం దాచుకున్నాడు.

"ఏమిటి, ఏమైంది. మాధురి నీవు మాటా మాటా అనుకున్నారా? ఏం జరిగింది చెప్పు నాన్నా.. ఛ.. ఆ కన్నీళ్లేమిటి?" అంది అయోమయంగా చూస్తూ.

"అమ్మా, మాధురితో నాకు సరిపడదు. యింక తనతో కలిసి బతకలేనమ్మా. ఇద్దరం మ్యూచువల్ డైవోర్స్ తీసుకున్నాం. అక్కడ నించి శాశ్వతంగా వచ్చేశాను. ఆ ఉద్యోగం, ఆ డబ్బు, సుఖాలు అన్నీ వద్దనుకుని యిక్కడకి వచ్చేశాను. నాకొచ్చే జీతంతో వున్నంతలో హాయిగా బతకాలనిపించింది. అమ్మా, ఈసారి నా పెళ్లి బాధ్యత నీదే. కాస్త చదువుకుని యింటి పట్టుని ఉండి సంసారం చేసుకుంటే చాలు. మంచితనం వున్న పేదింటి పిల్లనైనా సరే, జీవితం సుఖంగా గడిచిపోతే చాలు. నాకింకేం వద్దు" ఆవేదనగా అన్నాడు.

"మరి మాధురి ఏమంది? ఒప్పుకుందా విడిపోవడానికి? అంత సులువుగా డైవోర్సు ఇచ్చేసిందా?" అనుమానంగా అడిగింది. "చేతులెత్తి దండంపెట్టి నన్ను వదిలేయ్. ఈ యిల్లు తీసుకో. నీవు కొన్నదేగా, నా సేవింగ్స్ .. యింట్లో సామాను. ఏం కావాలంటే అన్నీ తీసుకో, నేను ఇక్కడ ఉండను, ఇండియా వెళ్లిపోతాను. నాకూ నీకూ సరిపడడంలేదు. జీవితంలో భోజన సుఖం, భార్య సుఖం, పిల్లల



సుఖం ఏదీ లేకుండా లక్షలు సంపాదించి ఏం చెయ్యాలి? నన్ను వదిలేయి'' అని దణ్ణం పెట్టేశాను.

"నన్ను పెళ్లి చేసుకోమని చంపావు. చేసుకున్నాక యిప్పుడు మారిపోయావు. మీ మగవారిని నమ్మడం నాదే తప్పు. అందేవరకూ కాళ్లు పట్టుకుంటారు, అందాక నిజస్వరూపాలు చూపిస్తారు. ఫో? నీకు నేను అక్కరలేకపోతే, నాకూ నీవు అక్కరలేదు. నీతో పాటు నీ సామాను, నీ డబ్బు నాకేం అక్కరలేదు. ఫో-ఫో. నా ఇంట్లోంచి' అని కోపంగా ఎగిరి రేపు నీ మొహం నాకు కనపడ కూడదని తన గదిలోకి వెళ్లి దడేల్మని తలుపు మూసుకుంది. బతుకు జీవుడా అనుకుని బట్టలు సర్దుకుని బయటకి వచ్చేశాను. ఇంత సులువుగా వదిలించుకున్నందుకు తేలిగ్గా ఉందిప్పుడు. అమ్మా .. ఏం చేస్తావో, నా బతుకు నీ చేతుల్లో పెడుతున్నా. నీ ఇష్టమే నా యిష్టం...''

అన్నాపూర్ణ దీర్ఘంగా నిట్టూర్చి, కొడుకు తల నిమురుతూ కళ్లు మూసుకుని అలాగే ఉండిపోయింది.

***

ఆరేళ్లు గడిచిపోయాయి.

ఇప్పుడు మురళికి యిద్దరు పిల్లలు, వాళ్ల ముద్దు ముచ్చట్లతో, ఆటపాటలతో, అనుకూలవతి అయిన భార్యతో ఇదీ ఇల్లంటే అనిపిస్తోంది తనకి.

అమెరికా కంఫర్ట్‌కు తీసిపోని యిల్లు, సామాను, తనూ, పిల్లలే జీవితం అనుకునే భార్య తోడు నీడై అత్తని బాగా చూసుకునే మంచి మనసున్న భార్య .. మగవాడికి సిరిసంపదలు కావు. వున్నదానితో తృప్తిపడి, తను సుఖపడి, తనని సుఖపెట్టే భార్య దొరికితే చాలు .. అనుకున్నవన్నీ అందాక అనిపించింది మురళికి.

'బతుకున బతుకై తోడొకరుండిన చాలు అదే స్వర్గం' అనిపించి, తనకీ జీవితం యిచ్చిన తల్లికీ, తనకి తోడు నీడగా నిల్చిన కమలకీ జీవితాంతం కృతజ్ఞతగా ఉండడం తప్ప తనేం యిచ్చుకోగలడని అనుకుంటాడు రోజుకి ఒకసారైనా మురళి.

**ఆదివారం ఆంధ్రజ్యోతి, 31-4-2024** 